# సినారె

## సాహిత్య వివేచన



కృష్ణాజిల్లా రచయితల సంఘం

ప్రచురణ

# సినారె

## సాహిత్య వివేచన

గౌరవ సంపాదకులు

**డా. మండలి బుద్ధప్రసాద్**

సంపాదకులు

**గుత్తికొండ సుబ్బారావు**

**డా. జి వి పూర్ణచందు**




**కృష్ణాజిల్లా రచయితల సంఘం**

*1వ అంతస్తు, సత్నాం టవర్స్, బకింగ్‌హామ్ పోస్టాఫీస్ ఎదురుగా*

*గవర్నర్‌పేట, విజయవాడ- 520 002*

*సెల్ : 9440167697, 9440172642*

3

# CINARE SAHITYA VIVECHANA

A Publication of
**Krishna District Writers Assocation**
1st Floor, Satnam Towers,
Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada-2.
Mobile : 94401 67697, 94401 72642

**First Edition : 2017**

**Copies : 1000**

**Price : Rs. 70/-**

Title Design : Giridhar

Type Setting :
MADHULATHA GRAPHICS,
Arundalpet, Vijayawada. Ph. : 0866-2434320

*Printed by :*
Sri Chaitanya Offset Printers
Vijayawada - 2.

4

# సినారెతో మా అనుబంధం

డా. సి నారాయణరెడ్డిగారితో కృష్ణాజిల్లా రచయితల సంఘానికి అనుబంధం నాలుగు దశాబ్దాల నాటిది. కృష్ణాజిల్లాలోని సాహితీవేత్తలు 1967లో నిర్వహించిన తొలి కృష్ణాజిల్లా రచయితల మహాసభలకు స్ఫూర్తి ప్రదాతల్లో సినారె ఒకరు.

ఒకవిధంగా కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆయన మానసపుత్రిక. మచిలీపట్టణం స్పందన సాహితీ సమాఖ్య విస్తృతంగా కార్యక్రమాలు నిర్వహిస్తున్న రోజుల్లో ఆయన జిల్లా రచయితల సంఘం ఆవశ్యకత గురించి ఎప్పుడూ మాతో అంటూ ఉండేవారు. ప్రపంచ తెలుగు మహాసభలు 1975లో జరిగిన సందర్భంగా ఆయన వ్రాసిన నృత్య గేయ రూపకం "తరతరాల తెలుగు వెలుగు" శ్రీ నటరాజ రామకృష్ణ నృత్య దర్శకత్వంలో ప్రదర్శించబడింది. ఆ గ్రంథాన్ని స్పందన పక్షాన ప్రచురించాము. అది సినారెతో మాకు గల అనుబంధానికి ఒక తీపి గుర్తు.

1983లో కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని రిజిష్టరు చేసినప్పుడు, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, డా. యం. ఆర్ అప్పారావు, డా. సి. నారాయణరెడ్డి, డా. దాశరథి ఆనాటి గౌరవసలహామండలిలో సభ్యులుగా ఉండేవారు. చిన్న కార్యక్రమం అయినా సరే, కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆహ్వానిస్తే కాదనని ఆత్మీయత ఆయనది. 1983లో సినారె అధికార భాషాసంఘం అధ్యక్షుడిగా ఉన్న కాలంలో యువకవి కాంచనపల్లి రాంప్రసాద్ వ్రాసిన బంభరాలు అనే కవితా

సంపుటి ఆవిష్కరణకు ఆహ్వానిస్తే, ఆయన పనులన్నీ వదిలి ఆ సభకు వచ్చారు. నిజానికి, అది చాలా చిన్న సభ. విజయవాడ ఠాగూరు గ్రంథాలయంలో నిర్వహించాం. కవిని గౌరవించు అనే ఒకే ఒకనినాదంతో ఆయన విజయవాద తరలి వచ్చారు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన 2007 లోప్రథమ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, 2011లో రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలకు ఆయన విచ్చేశారు. నిజానికి 2011 రెండవ సభలు జరుపుతున్నప్పుడు తెలంగాణా ఉద్యమం ఉధృతంగా సాగుతోంది. ఆ మహాసభలను, విజయవాడ తుమ్మలపల్లి కళాక్షేత్రం ఎదురుగా ప్రధానరహదారి పక్కన నెలకొల్పిన తెలుగుతల్లి విగ్రహాన్నీ నారాయణరెడ్డిగారి చేత ప్రారంభింప చేయాలని భావించాము. అది, ఆయనను ఇబ్బంది పెట్టడమే అవుతుందని మాకు తెలుసు. కానీ, సినారె సంకోచించకుండా సభకు వచ్చి రామోజీరావుగారితో కలిసి ప్రారంభోత్సవాలలో పాల్గొన్నారు.

హైదరాబాద్ రవీంద్రభారతిలో కృష్ణాజిల్లా రచయితల సంఘం 'తెలుగు వ్యాసమండలి' గ్రంథావిష్కరణ సభ నిర్వహించినప్పుడు నాటి ముఖ్యమంత్రి శ్రీ కిరణ్ కుమార్ రెడ్డితో పాటు సినారె కూడా పాల్గొన్నారు. ఆరోజు ఆత్మీయంగా ఆయన చేసిన ప్రసంగం 'యూ ట్యూబు'లో పదిలంగా ఉంది. శ్రీ బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. పూర్ణచందులను మూలస్తంభాలుగా అభివర్ణిస్తూ ఆయన ప్రసంగం సాగింది.

2007లో దివిసీమ శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణు దేవాలయ ప్రాంగణం ఆముక్తమాల్యద మంటపంలో కృష్ణదేవరాయలు విగ్రహాన్ని ప్రతిష్ఠాపించి కృష్ణదేవరాయల మహోత్సవాలను నిర్వహించినప్పుడు సినారె ఆ సభలను ప్రారంభించటానికి విచ్చేశారు. శ్రీ బుద్ధప్రసాద్ మంత్రి పదవి స్వీకరించిన సందర్భంగా విజయవాడలో అభినందన సభ ఏర్పాటు చేసినప్పుడూ ఆత్మీయంగా వచ్చి పాల్గొన్నారు. కృష్ణాజిల్లా రచయితలసంఘం అంటేనూ, దాని నిర్వాహకులంటేనూ ఆయనకు

అంతర్రేమ. వ్యక్తిగతంగా కూడా సుబ్బారావు, పూర్ణచందు అనేక పర్యాయాలు సినారె చేతులమీదుగా వివిధ సంస్థలు ప్రకటించిన పురస్కారాలను అందుకున్నారు.

సినారె దీర్ఘకాలం అనారోగ్యంతో ఉన్నప్పటికీ, ఆయన వ్రాస్తూనే ఉన్న కవి. ఆయన కలం, ఆయన గళంతో పాటు ఆయన మనసు వీటికి వార్ధక్యం లేదు. అవి కడదాకా ఉత్తేజితంగానే ఉన్నాయి. సినారె లేరనే వార్త వినలేనిది. కాలధర్మాన్ని కాదనలేం కదా!

ఆయన 87వ జయంతిని పురస్కరించుకుని ఆ మహాకవికి నివాళిగా కృష్ణాజిల్లా రచయితల సంఘం సినారె సాహితీ వివేచన పేరుతో ఈ గ్రంథాన్ని వెలువరిస్తోంది. సినారెతో సన్నిహిత సంబంధాలు కలిగిన రచయితలు ఆయన సాహిత్య తత్వాన్ని విశ్లేషించిన వ్యాసాలతో రూపొందిన విమర్శనా గ్రంథం ఇది. సాహిత్యాభిమానులకు ఇది ఉపయుక్తంగా ఉండగలదని ఆశిస్తున్నాం.

గుత్తికొండ సుబ్బారావు
డా. జి వి పూర్ణచందు

# ఇందులో ఇదీ వరుస...



8

# తెలుగు సాహితీ మహోన్నత శిఖరం సినారే

డా. మండలి బుద్ధప్రసాద్

డా. సి నారాయణరెడ్డి ఒక సాహిత్యస్ఫూర్తి ఒక సభాస్ఫూర్తి, ఒక స్నేహ స్ఫూర్తి. మాట, పాట, చేతల మధ్య సమన్వయ మూర్తి. కవితాత్మకంగా చెప్పినా, అది పూర్తి వాస్తవం...! ఆయన ఇంటి పేరు చైతన్యం. ఆయన పేరు కవితాపరాయణం.

ఏ దేశకవితకైనా పూర్వకవిత ఒక ఆలంబనగా ఉంటుంది. శూన్యంలోంచి ఏ కవీ పుట్టడు. పూర్వకవితా రూపాల ఆకళింపులోంచే కొత్త గొంతుకలు కవితలను విచ్చుకుంటాయి. పూర్వ కవితాత్మకతను నవీన మార్గాన నడిపించే కవులు కొందరైతే పూర్వకవిత్వాన్ని తిరస్కరించి కొత్తదారులే శరణ్యం అనుకునే వారు ఇంకొందరు. డా. సి నారాయణరెడ్డిది నడిమిదారి. ఆయనది నవ్యసాంప్రదాయ మార్గం.

పూర్తి కొత్త సాంప్రదాయంలో కొత్త సమాజం ప్రతిఫలిస్తుంది. కానీ ఎక్కువ సందర్భాల్లో కవిత్వం పండకపోవటాన్ని గమనిస్తున్నాం. పాతకవితా మార్గంలో కవిత్వం ప్రతిఫలిస్తోన్నా... సమాజం, అందులోని మానవుని సహజ మానవత కానరాకపోవటమూ మనం గమనిస్తున్నాం. కొత్త సమాజం కోసం మానవ విలువల్ని కొత్త కవితాత్మకతో పండించటం సినారే లక్ష్యం. కవిత్వమా? సమాజమా? అని అడిగితే కవితాత్మక సమాజంలోని మానవుణ్ణి కోరుకునేవాడు సినారే

పాఠకులు లేకపోయినా కవులు కవిత్వం ఎందుకు రాస్తారూ...అంటే, ప్రజలను ముందుకు నడిపించే వారిని ప్రభావితం చేయగల శక్తి కవిత్వానికి ఉంది కాబట్టి, కవులు కవిత్వం వ్రాస్తారు. సమస్త జనసామాన్యాన్నీ ప్రభావితం చేయగల కవిత్వాన్ని మహాకవులు వెలయిస్తారు. వీరేశలింగం, గురజాడ, రాయప్రోలు, శ్రీశ్రీ, సినారే, తిలక్, బైరాగి, శేషేంద్ర వీళ్ళంతా తెలుగు నవ్యకవితా వీధుల్లో విహరించిన మహాకవులు. కవులంతా ఒక పుస్తకం అనుకుంటే ఆ పుస్తకానికి ముఖచిత్రం సినారే!

కొమ్మపైనే నిలిచి నింగిని కొల్లగొట్టే కోరిక
ఒడ్డుపైనే నిలిచి ఒడిసిపట్టే కోరిక
ఓరిమనిషీ నువ్వు మూరెడు; కోరికేమో బారెడు-
మాటనివ్వక దాతగా తెగమోగిపోయే కోరిక.

త్యాగమంటక నేతగా ఊగిపోయే కోరిక" అంటూ ప్రపంచపదుల్లో ఆయన మానవుడి దురాశని ఎత్తిపొడుస్తారు.

ఒక కవితలో కవితాత్మక పదచిత్ర విన్యాసాలు సమాజనిష్ఠను ప్రతిబింబించినప్పుడే అది నవ్యకవిత అవుతుంది. కవులందరిలోనూ భిన్నభిన్న వ్యక్తిత్వాలను బట్టి వ్యక్తమయ్యే భావాలు ఆ కవితలో పూర్తి వైవిధ్యాన్ని ప్రతిబింబిస్తాయి. సామాన్యుడికి సూటిగా సులభంగా సాధారణ స్థాయిలో అర్థం కావటం, అది చదవగానే ఆహా అనిపించగల నేర్పరి తనం సినారే కవితలో ఉంది. భావజాల పరంగా శ్రీశ్రీ కవులను ప్రభావితం చేస్తే, భావాత్మకత పరంగా సినారే తెలుగు సాహితీ జగత్తును స్పందింప చేశారు. సినారే ప్రభావాన్ని తప్పించుకోగల తెలుగు కవి ఉండడు. తెలుగు వారి తొలి విజ్ఞానపీఠ బహుమతి గ్రహీత విశ్వనాథవారు సంప్రదాయ విలువలకు పట్టంకట్టిన వాడైతే, మలి విజ్ఞానపీఠి సినారే మా'నవత'కు పట్టం కట్టినవాడు.

"ఊపిరాడ్డం లేదు, ఉక్కపోస్తుంది, నాకు ఏసి గదిలో.. కారణం తెలిసి పోయింది.. కవిత్వం రాయలేదు.." అంటూ, వ్రాస్తూనే పోవాలనే ఏకైక లక్ష్యం ఆయనను కవిగా నిలిపింది. 85వ జన్మదినోత్సవాన కూడా ఒక కవితా సంపుటిని తెచ్చిన కవితా ప్రియుడు సినారే.

## ప్రపంచ తెలుగు మహాసభలకు స్ఫూర్తి సినారే

1972లో భారత స్వాతంత్ర్య రజతోత్సవాలు హైదరాబాద్ లో నాటి ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారి ఆధ్వర్యంలో ఘనంగా జరిగాయి. మా నాన్నగారు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ఆయన మంత్రివర్గంలో సాంఘిక సంక్షేమ శాఖామంత్రిగా పనిచేశారు. ఆగస్టు 14 అర్ధరాత్రి శాసనసభ సమావేశం జరిగింది. ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చుని ఆ సమావేశాన్ని తిలకించే భాగ్యం నాకు కలిగింది. ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారు "ఆ నిశీధిని మేల్కొని......" అన్న దీర్ఘకవితను ఎంతో ఉద్వేగభరితంగా చదివారు. అదొక మధురానుభూతి.

మరునాడు లాల్ బహదూర్ స్టేడియంలో ప్రభుత్వం పెద్ద ఎత్తున సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటు చేసింది. సినారే తన కమనీయ కంఠంతో సుమధుర వ్యాఖ్యానం చేయడమే కాకుండా, ప్రత్యేకంగా ఒక నృత్య నాటకం వ్రాసి, కుమారి రత్నపాప బృందంతో ప్రదర్శింపజేశారు.

అమర గాయకుడు ఘంటసాల గానామృతాన్ని, డా. సి నారాయణరెడ్డిగారి వ్యాఖ్యానామృతాన్ని తొలిసారిగా ఆస్వాదించే అవకాశం ఆనాడు నాకు కలిగింది. ఘంటసాలని తొలిసారి, చివరిసారి నేను చూడటం అదే. కానీ సినారేతో, ఆయన తుదిశ్వాస విడిచే వరకు నాలుగున్నర దశాబ్దాలపాటు అనుబంధం కొనసాగింది.

శ్రీ జలగం వెంగళరావుగారి మంత్రివర్గంలో మా నాన్నగారు 1973 మార్చిలో విద్యాసాంస్కృతిక శాఖామంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టారు. నారాయణరెడ్డిగారు తరచూ మా ఇంటికి వస్తూ ఉండేవారు. 1975 ఏప్రిల్ 12 వ తేదీ నుంచి వారంపాటు హైదరాబాదులో ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలని నిర్ణయించినపుడు, ఆ ప్రతిపాదనను గట్టిగా బలపరచి మహాసభల విజయానికి మా నాన్నగారికి కుడి భుజంగా నిలిచారు సినారే. ప్రపంచ తెలుగు మహాసభల ప్రాచుర్యాన్ని కవితలతో తెలియజెప్పారు.

ప్రపంచ తెలుగు మహాసభలు జరిగిన వారంరోజులూ ప్రధాన కార్యక్రమాలకు వ్యాఖ్యాతగా డా. సి నారాయణరెడ్డి వ్యవహరించి, లక్షలాది ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేశారు. మా నాన్నగారి కోరికపై "తరతరాల తెలుగు వెలుగు" అనే నృత్యగేయ రూపకాన్ని రచించి మహాసభల ప్రారంభ సూచకంగా ప్రదర్శింపజేశారు.

శ్రీ నటరాజ రామకృష్ణ నృత్య దర్శకత్వంలో ప్రదర్శించబడిన ఈ గేయ రూపకం ఈ విధంగా సాగుతుంది:

"మేలుకో శ్రీ ఆంధ్ర దేవా/మేలుకో దివ్యప్రభావా!
మేలుకో వంశ ప్రదీపా/మేలుకోవయ్యా! దేవా! మేలుకోవయ్యా!

ప్రపంచ తెలుగు మహాసభల వైభవాన్ని ఈ క్రిందివిధంగా ఆయన కీర్తించారు:

"తెలుగు దీప్తి సహస్ర కళలతో సాగింది
తెలుగు గీతి సమస్త దిశలందు మ్రోగింది...
గోదావరీ నదీ స్వాదుర్మికలతోడ
కృష్ణవేణీ తరంగిణి గొంతు కలిపింది...
తుంగభద్రా జలతరంగముపైన
మంజీర గంభీర మధునాద మొలికింది!
తెలుగు నదులన్ని చేతులు కలిపి ఆడినవి
తెలుగు నిధులన్ని గుండెలు పొంగి పాడినవి
ఆ మూల ఈ మూల ఆ నేల ఈ నేల
అన్ని ఎల్లలు దాటి ఐక్యమై పోయినవి!

ఇది వేల ఏళ్ల కథ
ఇది నిత్య నవచరిత
ఆంధ్ర సంస్కృతి ఒడ్డులంటి పారిన సరిత
ఇది జిలుగు తెలుగు కోయిలల గానము సుమా!
ఇది నిఖిల విశ్వాంధ్ర హృదయ బంధము సుమా!"

రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మలేషియాలో జరపాలని నిర్ణయించినప్పుడు, ఆ మహాసభలకు పూర్వరంగంగా డా. సి. నారాయణరెడ్డిగారిని, డా. దాశరథిగారిని రాష్ట్ర ప్రభుత్వం తరపున మా నాన్నగారు 1976న మలేషియాకు పంపించారు. వీరిద్దరూ మలేషియాలో మూడు వారాలపాటు విస్తృతంగా పర్యటించి, తెలుగువారందరినీ కలుసుకొని, వారిని చైతన్యపరచారు. వారు హైదరాబాద్ తిరిగి రాగానే, కళాభవన్ లో అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆధ్వర్యంలో మా నాన్నగారి అధ్యక్షతన వారి మలేషియా పర్యటన విశేషాలు తెలుసుకోవడానికి ఒక సమావేశం జరిగింది. సభలో వారి యాత్రాస్మృతులను వివరిస్తూ నారాయణరెడ్డిగారు ఈ క్రింది కవితను చదివారు:

"మలేషియా తిలకించితి
మరీ మరీ పులకించితి
తెలుగువారి ఎదలలోని
తీపిని ఆస్వాదించితి"

మూడవ ప్రపంచ తెలుగు మహాసభలు మారిషస్‌లో 1990 డిసెంబర్‌లో జరిగాయి. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతిగా డా. నారాయణరెడ్డిగారు ఆ మహాసభలలో ప్రతినిధి బృందానికి నాయకత్వం వహించారు. మా నాన్నగారు, నేను కూడా ఆ సభల్లో పాల్గొనడం జరిగింది.

నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభలు 2012 డిసెంబరులో తిరుపతిలో జరిగినపుడు నారాయణరెడ్డిగారు ఆ సభలకు సంపూర్ణ మద్దతు ప్రకటించడమే కాక, మహాసభల ప్రారంభ గీతాన్ని వారే రచించారు. శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం బృందం ఆ గీతాన్ని ఆలపించారు. ఈ విధంగా ఇప్పటివరకూ జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలతో డా. సి. నారాయణరెడ్డిగారి అనుబంధం మొదటి నుంచీ కొనసాగింది.

కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన 2007 లోను, 2011 లోను విజయవాడలో నిర్వహించిన ప్రపంచ తెలుగు రచయితల మహాసభలలో

నారాయణరెడ్డిగారు అనారోగ్యాన్ని సైతం లెక్కచేయక వచ్చి పాల్గొన్నారు. 2011 లో జరిగిన మహాసభల సందర్భంగా విజయవాడలో తెలుగుతల్లి కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించాము. దానిని సినారే మరియు తెలుగు భాషా వ్యాప్తికి ఎనలేని కృషి చేస్తున్న "ఈనాడు" సంస్థల అధినేత శ్రీ రామోజీరావుగారి చేతుల మీదుగా ఆవిష్కరింప జేయాలని అప్పుడే ఆ విగ్రహానికి సార్థకత ఏర్పడగలదని భావించాము. తెలంగాణ ఉద్యమం ఉద్ధృతంగా సాగుతున్న రోజులవి. నారాయణరెడ్డిగారిని ఇబ్బంది పెడుతున్నామేమోనని సంకోచించాము. అయితే, నారాయణరెడ్డిగారు ఎంతో భక్తి భావంతో రామోజీరావుగారితో కలిసి ఆ విగ్రహాన్ని ఆవిష్కరించారు. ఆ మహాసభలను ప్రారంభించారు.

**దివిసీమ తుఫాను ఉప్పెన :**

అవనిగడ్డ నియోజకవర్గం తరచూ ప్రకృతి వైపరీత్యాలకు గురౌతూ ఉంటుంది. 1976 లో ఒక పెను తుఫాను తాకిడికి గురైంది. ఆ సమయంలో మానవతా హృదయులైన డా. నారాయణరెడ్డిగారు తన హృదయ స్పందనను ఈ విధంగా తెలియజేశారు:

"ఏమి విపరీతమిది? ఎట్టి ఎదకోత ఇది
తీరాంధ్ర ధరణికే తీరని విఘాతమిది
మూడు సార్లు వచ్చి ముంచెత్తి పోయినది
పెను తుఫానా? కాదు, కనులు మండిన ప్రకృతి
ఇంకా– పొలాలలో ఇంకిపోకున్నవి
వరద నీళ్ళా –కాదు ; బాధితుల కన్నీళ్ళు
ఆ నీటిలో కుప్పలై మూల్గుతున్నవి
వరి పనలు కాదు ; తెగిపడిన బ్రతుకులు సుమా!
బాలప్రాయము నుండి పాలిచ్చి పైరులను
పెంచిన జలాలే కబళించిపోయిన వౌరా!
కంటి కరువును; కడుపు మంటను చల్లార్చు
బంగారు సిరులు నడి గంగలో కలిసెరా
నోటి కందే కూడు నీటి పాలై పోగ
ఉన్న కాస్తా గూడు ఛిన్నభిన్నము కాగ
బిక్కు బిక్కుమంటున్నారు బక్క రైతులు చూడు
అఖిలాంధ్ర మొక్కటై ఆదుకోవలె నేడు

ఈ జల ప్రళయాల కికముందు స్వస్తి యని
ప్రకృతి ఉన్మాదాలకిక ఆటకట్టని
చాటండి ప్రతినగా శాస్త్రజ్ఞులారా
ఉండండి ఊతగా ఓ నేతలారా!

ఈ పాటను మా నాన్నగారు దివిసీమలో అనేక సభలలో శ్రీ కోసూరు పున్నయ్య భాగవతార్ చేత పాడించేవారు. ప్రజలు హృదయభారంతో కన్నీళ్ళు పెట్టుకునేవారు.

1976లో వచ్చిన తుఫాను కేవలం ఆస్తి నష్టాన్నే కలిగించింది కానీ, 1977 నవంబర్ 19 న వచ్చిన ఉప్పెన తుఫాను దివిసీమలో 10 వేల మందిని పొట్టన పెట్టుకుంది. లక్షలాది పశువులు అశువులు బాశాయి. ఊళ్ళకు ఊళ్ళు తుడిచిపెట్టుకు పోయాయి. 21 వ శతాబ్దంలో సంభవించిన ఘోర ప్రళయమిది. శోకతప్తులైన బాధితులను ఓదార్చి, వారిలో ధైర్యాన్ని నింపడానికి డా. సి. నారాయణరెడ్డిగారు, ధ్వన్యనుకరణ సమ్రాట్ శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్‌తో కలిసి అవనిగడ్డకు వచ్చారు. వారిని ఉప్పెన ప్రాంతాలకు తీసుకువెళ్ళి చూపించమని మా నాన్నగారు నాకు చెప్పారు. నేను శ్రీమతి హేమలతా లవణం గారూ కలిసి వారిని తీసుకుని చింతకోళ్ళ గ్రామానికి వెళ్ళాం. ఇంకా అప్పటికి శవాలు ఎండిపోయి చెట్ల మీద వేళ్ళాడుతున్నాయి. సున్నిత మనస్కులైన వేణుమాధవ్ నా ఆదృశ్యాలు నేను చూడలేనన్నారు. నారాయణరెడ్డిగారు ఉప్పెన బీభత్సాన్నంతా కలియతిరిగి చూశారు చలించిపోయారు. బాధితులను పరామర్శించారు. గుండె దిటవు చేసుకోవాలని ఓదార్చారు.

అక్కడొక సంఘటన జరిగింది: ఉప్పెనలో నిండు చూలాలైన ఒక స్త్రీ తాటిచెట్టును పట్టుకుని బ్రతికి బయటపడింది. మేము అక్కడికి వెళ్ళేసరికి ఆమె ఒక పండంటి మగబిడ్డను కన్నది. ఆ బాబును తీసుకువచ్చి మాకు చూపారు. ఆ పిల్లవాడికి నారాయణ రెడ్డిగారు జలవీరుడు అని పేరు పెట్టారు. నేను ఆ గ్రామానికి వెళ్ళినప్పుడల్లా అతని గురించి తెలుసుకుంటుంటాను. 'జలవీరుడు' అదే పేరుతో పెరిగి పెద్దవాడయ్యాడు. అతనికి పిల్లలు కూడా కలిగారు.

## వటపత్రశాయి

తుప్పర పట్టింది జల్లు కొట్టింది / తుఫానుకు పిచ్చి పట్టింది
జలరాశికి ఒళ్లు తిరిగింది / ప్రళయ తాండవం పెరిగింది
ఊళ్లకు పాలిచ్చే నీళ్లు / ఇళ్లను ముంచేస్తున్నాయి
తాడెత్తు కెరటాలు లేచి / మేడలను కబళిస్తున్నాయి.

చేయి చెరువులవుతున్నాయి. / గాలి దెబ్బకు విరిగిన చెట్లు
తేలిపోతున్నాయి తెప్పలై / పడిపోయిన పాకలు
పసిబిడ్డల కేకలు / పశువుల అరుపులు
మనుషుల పిలుపులు / అడుగడుగునా మరణ వేదనలు
ఆడలిన గుండెల ఆక్రందనలు / భళ్లున తెల్లారి పోయింది
నల్లటి చీకటి ముసుగు తీసి / తల్లినేల కెప్పున ఆరిచింది
తన రొమ్మున పడివున్న శవాలను చూసి,
ఎటు చూసినా ఏముంది? / ఎవరు అరిచినా ఏముంది?
కాల్చే శైతల్యమున్న శ్మశానం. / కళేబరాల్లా పరచుకున్న విషాదం.
ఆ శ్మశానంలో ఒక జీవరేఖ / ఆ విషాదంలో ఒక ఆశారేఖ
ఇసుక తిన్నెపై పడుకుని / మిసిమి నవ్వులు చిందుతున్న పాపాయి;
జల ప్రళయాన్ని తట్టుకుని / శయనించివున్న వటపత్రశాయి.

అక్కడి నుంచి కమ్మనమోలు గ్రామానికి వెళ్ళాము. అక్కడ కూడా ఒక తల్లి ఒక ఆడబిడ్డను కన్నది. నారాయణరెడ్డిగారు ఆ పాపకు 'జలజ' అని పేరు పెట్టారు. ఆ తరువాత వారు ఆంధ్రప్రభలో "వర్ధిల్లు జలజా వర్ధిల్లు" అని ఒక వ్యాసం వ్రాశారు. సినారే కవితాదృక్పథం మానవతా పరిమళాలను వెదజల్లుతుంది. కేవలం కవిత్వం వ్రాయడమే కాకుండా, తన మానవ హృదయాన్ని దృశ్యీకరింపజేయడంలో వారు ఘనులు.

అప్పట్లో పెద్దగా ఫోటోగ్రాఫర్లు ఉండేవారు కాదు. నా వద్ద 'మినోల్టా' కెమెరా ఉండేది. నారాయణరెడ్డిగారి దివిసీమ పర్యటనను ఆ కెమెరా ద్వారా బంధించే అవకాశం నాకు కలిగింది. నా జీవితంలో అదొక చిరస్మరణీయమైన సంఘటన.

ఆ తరువాత 1984 లో కళాప్రపూర్ణ రావూరు సత్యనారాయణరావుగారు రచించిన "హంసలదీవి" గ్రంథావిష్కరణకు నారాయణరెడ్డిగారు అవనిగడ్డ గాంధీక్షేత్రానికి వచ్చారు అప్పుడు వారి ప్రసంగం మహోన్నతంగా సాగింది:

**గాంధీక్షేత్రం మాసపత్రికతో అనుబంధం :**

"మా దేశం భారత దేశం/మాదేశం బంగరు దేశం!
మా పాలిట తారకమంత్రం/బాపూజీ నవ సందేశం"

గాంధీగారి మహనీయ ఆశయాలను తెలియజెప్పడానికి గాంధీక్షేత్రం మాసపత్రికను నా సంపాదకత్వాన ఒక పుష్కరకాలం పైగానే నడిపించాము. నారాయణరెడ్డిగారు అప్పుడప్పుడు తమ కవితలను పంపడమే కాకుండా ప్రతి సంవత్సరం జన్మదిన సంచికకు వారి శుభాశీస్సులను అందిస్తూ ఉండేవారు. 20.9.1988 న సినారె నాకు ఈ క్రింది విధంగా లేఖ వ్రాశారు.

"శ్రీ బుద్ధప్రసాద్ కు,

ఆత్మపూర్తిగా నమ్మిన ఆశయాలకు ఆకృతి కలిగించడంలో మండలి వెంకట కృష్ణారావుగారు ఉదాహరణ యోగ్యులు. వారి వ్యక్తిత్వాన్ని జీర్ణించుకున్న చిరంజీవిగా మీరు గాంధీక్షేత్రం మాసపత్రికను నడుపుతున్న తీరు ఎంతో అభినందనీయం. ఈ పత్రికలో రచనలు కొన్ని చిన్నవైనా విషయసమృద్ధిలో లోతును సంతరించుకున్నాయి. నాలుగు సంవత్సరాలు నిరంతరంగా మీరు ఈ పత్రికను ఉత్తమాభిరుచులతో నిర్వహిస్తున్నందుకు నా అభినందన".

గాంధీక్షేత్రం పత్రిక కోసం సెప్టెంబరు 1987లో "దేశమా! నిన్ను నువ్వు చూసుకో" పేరుతో నారాయణరెడ్డి గారు వారు వ్రాసిన కవిత ఇది:

తల పగిలిపోతున్నది - నొప్పితోకాదు
గొంతారిపోతున్నది - దప్పితోకాదు
ఒళ్ళు కాలిపోతున్నది - జ్వరంతోకాదు
గుండె ఊగిపోతున్నది - పోటుతోకాదు
నానాటికీ దిగజారుతున్న నా దేశాన్ని చూసి
పట్టపగలే ఊరేగుతున్న పచ్చి మోసాన్ని చూసి
దేశమా! చూసుకో నిన్ను నువ్వు - అంతరంగం అద్దంలో
నువ్వు పదిలంగా ప్రదర్శించే చిరునవ్వు వెనక
ఎన్ని విషాద వలయాలో ఏటా రెండు సార్లైతే
నీ జండా వెనక ఎన్ని అదృశ్య కృపాణాలో
ఎన్నిసార్లు హైజాక్ చేశారు - నీ మానాన్ని
ఎన్నిసార్లు తూట్లు పొడిచారు - నీ సహనాన్ని
ప్రపంచవిపణి వీధిలో - నీ పరువును వేలం వేసే ముందే
మాతృ దేశమా! తడిమిచూసుకో
మూతపడ్డ నీ మూడో కన్ను

గాంధీజీ అంటే నారాయణరెడ్డిగారికి అపారమైన భక్తి. గాంధీజీ మీద వారనేక కవితలు వ్రాశారు. అంతేకాకుండా, గాంధీజీ ఆంగ్లసూక్తులను "గాంధీయం" పేరిట గేయానుసరణ చేశారు. అవంటే నాకెంతో ఇష్టం. మచ్చుకు కొన్ని -

"చెమటోడ్చనిదే ఇలపై/సిద్ధించదు ఏ లక్ష్యము.
తపియించనిదే ఆత్మ/క్షాళనమ్ము దుస్సాధ్యము
స్వచ్ఛమైన సంకల్పము/చతికిలబడి పోదు
అచ్ఛమైన వాక్కు కడకు/అప్రియమ్ము కాదు

దారుణ సూర్యతాపమ్ము/తలదాలిచి ఆశ్రితులకు
చలువల నందించెదు/వృక్షమ్ము సదా స్మరణీయము
ఏది జీవితమ్ము? కేవ/లేంద్రియ తర్పణము కాదు.
జీవితమనగా ఈశ్వర/భావన మానవ సేవన
మతములన్నీ శ్రేష్ఠములు ధ/ర్మములన్ని గరిష్ఠములు మరి
వెలితి ఎవరిది? వాని విలువలు/తెలియజాలని నరులది
పితూరీలు వినకు/విన్నా ఔననకు
మంచివారి సహవాసము/మనసుకు సరిపడు గ్రాసము"

డా. సినారె వ్రాసిన గాంధీయం పుస్తకం గాంధీజీ సూక్తులకు గేయానుసరణలు ఆనాటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ఈ గ్రంథాన్ని ప్రచురించింది. స్తుతిగీతిగా వారు వ్రాసిన "బాపూ నీ పుట్టిన రోజు" గేయం గొప్పది.

"బాపూ నీ పుట్టినరోజు/భగవానుడు పుట్టినరోజు
ఒకరాముడు పుట్టిన రోజు/ఒక రహీము పుట్టిన రోజు
చావులేని పుట్టుకలేని/సత్యమూర్తి పుట్టిన రోజు
దాస్యంలో విలవిలలాడే/ధర్మం తొడగొట్టిన రోజు
కుత్సితాల కులమతాల/కోటలు పడగొట్టిన రోజు
చురకత్తులగుండెల్లోన/ చిరునవ్వులు మెట్టిన రోజు
దొరలకు శిరసొగ్గని రోజు/మరలకు మనసివ్వని రోజు
చరఖాతో భారతమాతకు/పరువును నిలబెట్టిన రోజు
సత్యాగ్రహ మంత్రం వింటూ/సంకెళ్ళను ఛేదించుకుంటూ
నోరులేని వీరసంతతి/హోరున గీ పెట్టిన రోజు
ఆలయాన దాగిన దేవుని/అస్పృశ్యులు ముట్టిన రోజు"
హరి-జనుడై పుట్టిన రోజు/హరిజనుడే పుట్టినరోజు

చలనచిత్రాలలో కూడా నారాయణరెడ్డిగారు తమ గాంధీ భక్తిని చాటుకున్నారు. "గాంధీ పుట్టిన దేశం"లో గాంధీజీపై ఆయన ఒక చక్కటి పాట వ్రాయడం జరిగింది. అదే చిత్రంలో "ఎవరిని అడగాలీ బాపూ! ఏమని అడగాలీ? మూగ గుండెలో రగిలే బాధ మూగగానే మిగలాలి" అన్న పాటలో నారాయణరెడ్డిగారి సూచన మేరకే భగవంతుని కాక, గాంధీ మహాత్ముని సంబోధిస్తూ పాడించడం జరిగింది. అలాగే, "మానవుడు-దానవుడు" సినిమాలో....

"అణువూ అణువున వెలసిన దేవా
కనువెలుగై మము నడిపించరావా!
మనిషిని మనిషే కరిచే వేళ
ద్వేషం విషమై కురిసే వేళ
నిప్పులు మింగి నిజమును తెలిపి
చల్లని మమతల సుధలను చిలికి
అమరజీవులై వెలిగిన మూర్తుల
అమృతగుణం మాకందించ రావా"

ఈ విధంగా సినిమాల్లో కూడా అవకాశం వచ్చినప్పుడల్లా గాంధీతత్వాన్ని ప్రబోధించడానికి డా. సి నారాయణరెడ్డి ప్రయత్నించారు.

గుజరాత్ లోని రాజ్ కోట్ లో గాంధీజీ చదివిన 'ఆల్ ఫ్రెడ్' హైస్కూల్ దుస్థితిని గమనించి, రాజ్యసభ సభ్యుడిగా నారాయణ రెడ్డిగారు తనకొచ్చిన నిధుల నుంచి రూ.5.00 లక్షలు మంజూరు చేసి ఆ పాఠశాలను పునరుద్ధరించారు. గాంధీజీని వ్యక్తిగతంగా అవమానపరుస్తూ Maxim పత్రిక ఒక కథనం వ్రాస్తే నారాయణరెడ్డిగారు ఈ అంశాన్ని పార్లమెంట్ దృష్టికి తెచ్చి తన నిరసన గళాన్ని గట్టిగా వినిపించారు. ఆ విధంగా గాంధీజీ పట్ల తనకున్న భక్తి ప్రపత్తులను చాటుకున్నారు.

" .. ఇంకెవరిది జవహరునిది.. గరళము మింగిన గుర్తే కనిపించని నవహరునిది." అంటూ విద్యార్థి దశలోనే కవిత చదివి విన్పించారు సినారే!

"బాపూ! నీ జీవితం / భగవద్గీతా భాషితం! అది
హిమగిరిలా సమున్నతం / స్వరఝురిలా నిత్య పునీతం"
"నీవు పలికిన మాటలో! నిన / దించెను సర్వ మతాలు!
నీవు నడిచిన బాటలో! పయ / నించెను ధర్మపథాలు!
కదిలెను నీ చూపుడు వేలు / కంపించెను శాసనాలు" అని కీర్తించారు

**నిలువెత్తు తెలుగు సంస్కృతి :**

"మాతృభాషా తృణీకారం/మాతృదేవీ తిరస్కారం"అనే నినాదంతో తన తెలుగుభక్తిని చాటుకున్నారాయన.

"తేనియలకే తీపిపెంచే తెలుగులో మాటాడుకో
తెలుగుజాతి సమైక్య గీతి పదేపదే పాడుకో"
"నాటినన్నయ మొదలుగా ఈ నాటి యువకవి అవధిగా
తరగలెత్తిన తెలుగు కవితల స్వరం నీలో నింపుకో"
"ఏ ప్రదేశంలో ఉన్నా ఏ విదేశంలో ఉన్నా
జీవనిధిగా మిగిలిన స్వీయసంస్కృతి నిలుపుకో"

తెలుగువాడిగా పుట్టినందుకు నారాయణరెడ్డిగారు గర్వంతో పొంగిపోయేవారు. తెలుగువారి యొక్క ప్రవృత్తిని వారర్థం చేసుకున్నట్లు వేరెవరు అర్థం చేసుకోలేరు. తెలుగువారిలో ఉన్న మంచి చెడులను ఎత్తి చూపి, తెలుగుజాతి సంస్కృతిని ప్రపంచానికి చాటారు.

"పంచ కట్టుటలో ప్రపంచాన మొనగాడు
కండువా లేనిదే గడప దాటనివాడు
పంచభక్ష్యాలు తన కంచాన వడ్డించ
గోంగూర కోసమై గుటకలేసేవాడు
ఎవడయ్య ఎవడు వాడు, ఇం
కెవడయ్య తెలుగువాడు!
తెలుగుబాసను జుంటితేనియయని తెగ పొగిడి
పొరుగింటి పులుపుపై మరులు పెంచినవాడు
దేశభాషలలో లోన తెలుగు లెస్సని చాటి
మల్లెలకు బదులు లిల్లీలు వలచినవాడు
ఎవడయ్య ఎవడు వాడు, ఇం
కెవడయ్య తెలుగువాడు!
మంచి మనసెదురైన మాలలిచ్చేవాడు
భాయి భాయి అన్న చేయి కలిపేవాడు
తిక్క రేగిందంటె డొక్క చీల్చేవాడు
చిక్కులెరుగని వాడు చిత్తాన పసివాడు
ఎవడయ్య ఎవడు వాడు, ఇం
కెవడయ్య తెలుగువాడు!"

తెలుగువారి మనస్తత్వాన్ని, ప్రవృత్తిని, వేషభూషలను ఇంత మనోజ్ఞంగా వర్ణించిన కవి మరొకరు కానరారు. ఆయనకు ఈ గేయమంటే ఎంతో ఇష్టం. సందర్భం వచ్చినపుడల్లా ఉపన్యాసాలలో ఈ గేయాన్ని ఆలపించి, నారాయణరెడ్డిగారు తాను పరవశిస్తూ, సభికులను పరవశింపజేసేవారు. ఒక సినిమాలో ఆయనే స్వయంగా ఈ కవిత చదువుతూ కనిపిస్తారు.

"ఇది తెలుగుగడ్డ, గాండ్రించు పులిబిడ్డ - ఈ
గొంతులో పిల్లి కూతొద్దురా - ఈ
గుండెలో గొర్రెదాటొద్దురా!
ఇది తెలుగు పలుకు - కురి

సే తేనె చినుకు - ఈ
పలుకెపుడు నీరు గారొద్దురా - తీపి
చిలికితేనే చెవికి ముద్దురా!
ఇది తెలుగు తెలివి; రగి
లే నిప్పు కొలిమి - ఇది
ఎప్పుడూ మండుతుండాలిరా - బూది
కప్పినా ఉరుముతుండాలిరా!" అంటారాయన.

1974వ సంవత్సరాన్ని తెలుగు సాంస్కృతిక సంవత్సరంగా ప్రభుత్వం ప్రకటించిన సందర్భంలో రవీంద్ర భారతిలో మా నాన్నగారి ఆధ్వర్యాన జరిగిన సభలో

"విశ్వపథంలోన తెలుగు
వెలిగే సంవత్సరమిది!
తెలుగుజాతి శిరమ్మెత్తి
నిలిచే సుముహూర్తమ్మిది!!" అనే గీతాన్ని సినారే ఆలపించారు.

**విశ్వజనీనమైన సందేశం :**

జగతిని రంగస్థలంగా మార్చుకుని
గగనాన్ని మకుటంగా మలచుకుని
అందరిలో తన బింబాన్ని చూసుకుంటూ
అందరి ఆశయాలను తనలో శ్రుతి చేసుకుంటూ
నిత్యచైతన్యంతో నిలిచే మనిషి
నిష్క్రమణలేని పాత్రధారి
నిఖిలవిశ్వంలోని పాత్రధారి
నిఖిల విశ్వంభరా పురోగతుల
నియతిని కాపాడే సూత్రధారి"

'నన్నయ నుంచి - నారాయణరెడ్డి దాకా తెలుగు సాహిత్యం' అని సంబోధిస్తారు. సాహిత్యం విశ్వశ్రేయస్సును కాంక్షించాలని పెద్దలు చెప్పిన మాట. సినారే సాహిత్యం విశ్వజనీనమైనది. కుల మత ప్రాంతీయ తత్వాలకు అతీతమైనది. మనిషిలోని మానవత్వాన్ని మేల్కొలిపేది. మృగత్వాన్ని పారద్రోలేది. విశ్వంభర ద్వారా, తన సాహిత్యం ద్వారా విశ్వశ్రేయస్సును కాంక్షించి, తెలుగువారికి జ్ఞానపీఠను సాధించిపెట్టారు.

కోరుకోవోయ్ మనిషీ / కొబ్బరికాయ జీవితాన్ని.
మాడుపగిలినా ఇతరులకు / మాధుర్యాన్ని పంచాలని
కోరుకోవోయ్ మనిషీ / కొవ్వొత్తి ఆశయాన్ని.
ఒళ్లంతా కరిగిపోతున్నా / చల్లని వెలుగివ్వాలని.
కోరుకోవోయ్ మనిషీ / కారుమబ్బు హృదయాన్ని.
తాను నీరౌతున్నా / ధరణిని పండించాలని.

ఈ తరం రచయితలు నారాయణరెడ్డిగారి బాటలో నడిచి, విశ్వజనీనమైన భావనలను తమ సాహిత్యం ద్వారా అందిస్తే నారాయణరెడ్డిగారి మృతివల్ల ఏర్పడిన లోటును పూడ్చగలుగుతారు. మానవజన్మ సార్థకతను అర్థం చేసుకొని తమ జీవితాన్ని, సాహిత్యాన్ని పరమార్థంగా నిలుపుతారు.

జీవన తరంగాలు సినిమాలో –
"పుట్టినరోజు పండగే అందరికీ – మరి
పుట్టింది ఎందుకో తెలిసేది ఎందరికి
"పువ్వెందుకు తీగపై పుడుతుంది?
జడలోనో గుడిలోనో నిలవాలని"
"ముత్యమేల కడలిలో పుడుతుంది?
ముచ్చటైన హారంలో మెరవాలని"
"ప్రతిమనిషీ తన జన్మకు – పరమార్థం తెలుసుకొని
తనకోసమె కాదు – పరుల కొఱకు బ్రతకాలని
తానున్నా లేకున్నా – తన పేరు మిగలాలని"

**కొన్ని జ్ఞాపకాలు :**

ప్రముఖులతో ఒకసారి పరిచయమైతే ఆ పరిచయాన్ని సదా గుర్తించుకునే తత్త్వం నాది. ఐతే, నారాయణరెడ్డిగారితో నా పరిచయం నాలుగు దశాబ్దాల పైబడింది. వారి ఉపన్యాసాలు వందలాది విన్నాను. వారితో కలిసి వందలాది సభల్లో పాల్గొనే అవకాశం నాకు కలిగింది. వారు అధిష్ఠించిన అధికార భాషాసంఘానికి చిట్టచివరి అధ్యక్షుడుగా పనిచేసినపుడు మనఃస్ఫూర్తిగా ఆశీర్వదించి, చక్కని సలహాలిచ్చి, నన్ను ఆశీర్వదించారు. వారితో అనుభవాలు ఎన్నెన్నో జ్ఞాపకాలు.

ప్రప్రథమ ఆంధ్ర రాజధాని శ్రీకాకుళం మా నియోజకవర్గంలో ఉంది. ఐదు వందల సంవత్సరాల క్రితం శ్రీకృష్ణదేవరాయులు శ్రీకాకుళంలో వెలసిన ఆంధ్రమహావిష్ణువును సేవించడానికి అక్కడికి రాగా, ఆంధ్రభోజుడికి స్వామి కలలో కనిపించి, "దేశభాష లందు తెలుగులెస్స" అని పలికి, తెలుగులో కావ్యం వ్రాయమని ఆదేశించగా శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదకు అక్కడే శ్రీకారం చుట్టారు.

ఆ నేపథ్యాన్ని పురస్కరించుకొని శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదను వ్రాస్తున్న భంగిమలో విగ్రహాన్ని తయారుచేయించి ప్రతిష్ఠించడం జరిగింది. ప్రతిష్ఠాపన కార్యక్రమానికి డా. నారాయణరెడ్డిగారు విచ్చేశారు. సందేశాత్మక గా ప్రసంగించారు. ఆశీర్వదించారు.

**జ్ఞానపీఠ గౌరవం**

1953లో వారి తొలిరచన నవ్వని పువ్వు, అజంతా సుందరి, నాగార్జున సాగరం, కర్పూర వసంత రాయలు, రామప్ప లాంటి సంగీత నృత్య రూపకాలు ప్రసిద్ధి పొందాయి. ఆయన పరిశోధన గ్రంథం ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు" నేటికీ అత్యంత ప్రామాణిక గ్రంథంగా పేరు పొందింది. వారికి జ్ఞానపీఠం వచ్చినప్పుడు నిత్య నిరాశావాదులు కొందఎరు సహజంగానే పెదవి విరిచినా, నారాయణరెడ్డి పాటలు, కవితలూ నోటికొచ్చిన సామాన్యుడు ప్రతి ఒక్కడూ ఎంతో సంతోషించాడు. "ఆధునిక తెలుగు సాహిత్యానికి 'ఈ పురస్కారం కోసం గతంలో నేనే స్వయంగా శ్రీశ్రీ ఆరుద్రల పేర్లు ప్రతిపాదించాను. కేంద్రం అంగీకరించలేదు. ఏం చేస్తాను.. ఇప్పుడు నాకు వచ్చింది' అనటం ఆయన నమ్రత.

'గోరంతదీపం కొండంత వెలుగు చిగురంత ఆశ జగమంత వెలుగు' అని ఆశావాదాన్ని రేకెత్తించారు, 'గాలికీ కులమేది' అని ప్రశ్నించారు.. 'స్నేహమేరాజీవితం-స్నేహమేరా శాశ్వతం' అన్నారు. "ఇదేనా మన సాంప్రదాయమిదేనా?" అంటూ వరకట్నపు కోరలకు బలి అవుతున్న ఆడపిల్లల పక్షాన నిలిచి నిలదీశారు.

"నీ ధర్మం నీ సంఘం నీ దేశం నువు మరవద్దు" అని హితవు చెప్పారు. "మారాలీ మారాలీ మనుషుల నడవడి మారాలి" అని ప్రబోధించారు. "కంటేనే అమ్మ అంటే ఎలా కరుణించే ప్రతి దేవత అమ్మే కదా" అని నవ్య మానవతా వాదాన్ని మనకు వినిపించారు.

విశ్వంభర, మనిషి - చిలక,ముఖాముఖి, భూగోళమంత మనిషి, దృక్పథం, కలం సాక్షిగా, ఇంటిపేరు చైతన్యం, కలిసి నడిచే కలం, తేజస్సు నా తపస్సు, విశ్వనాథ నాయకుడు, కొనగోటి మీద జీవితం, రెక్కల సంతకాలు, వ్యక్తిత్వం లాంటి

అసంఖ్యాకమైన రచనలు, 3000కు పైగా సినిమా పాటలూ వ్రాసిన సినారేకి ఏమిచ్చి ఆ మహాకవి ఋణాన్ని తీర్చుకోగలం?

వచనకవితా వాచస్పతి శ్రీ కుందుర్తి సినారే గురించి "కవిత్వంలో అగ్ని చల్లగలడూ- అమృతమూ కురిపించగలడు" అన్న మాటలు అక్షర సత్యాలు.

ఆయన రగిలించిన అగ్ని మనలోని కల్మషాలను కాల్చివేయాలి.

ఆయన కురిపించిన అమృతం మనలో మానవతను పరిమిళింపచేయాలి.

# పెద్దల సభకు వన్నె తెచ్చిన కవి

ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

ఒక కవి ప్రజాప్రతినిధి అయితే ఎలా ఉంటుంది? సామాజిక సమస్యలపై బయట గళం ఎత్తే, కలం ఝళిపించే, పదాలతో విన్యాసం చేసే కవి, భావుకుడు చట్ట సభల్లో ప్రవేశిస్తే ఏ విధంగా వ్యవహరిస్తారు?

హరివంశ రాయ్ బచ్చన్ నుంచి రాంధారి సింహ్ దినకర్ వరకూ అనేకమంది కవులు చట్టసభల్లో చేసిన ప్రసంగాల గురించి మనకు తెలుసు. కానీ ఒక తెలుగు కవి సభలో ప్రవేశిస్తే ఏ విధంగా విజృంభిస్తారో నిరూపించిన ఏకైక వ్యక్తి డాక్టర్ సి. నారాయణరెడ్డి (సినారె).

1997 నుంచి 2003 వరకూ రాజ్యసభలో నామినేటెడ్ సభ్యుడుగా ఉన్న సినారె సామాజిక, సాంస్కృతిక సమస్యలపై ఏ విధంగా గళం ఎత్తారో చాలామందికి పెద్దగా తెలియదు. కానీ సినారె కంటె సరిగ్గా ఏడాదికి ముందు (1996లో) రాజ్యసభలో సభ్యుడినైన నాకు ఆ మహాకవిని చట్టసభలోకి ఆహ్వానించి ఆయన అనర్గళంగా హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లో కవితాత్మకంగా మాట్లాడుతుంటే చూసే అదృష్టం లభించింది.

అలాగే సినారెను నామినేట్ చేసినప్పుడు ఆయనతోపాటు పలువురు లబ్దప్రతిష్టులు రాజ్యసభకు నామినేట్ అయ్యారు. వారిలో పంజాబీ కవి కర్తార్ సింగ్ దుగ్గల్, సినీ దర్శకుడు మృణాల్‌సేన్, సంఘ సేవకురాలు నిర్మలాదేశ్ పాండే, జర్నలిస్టు కుల్దీప్ నయ్యర్, శాస్త్రవేత్త రాజారామన్న, పత్రికా రచయిత చో రామస్వామి వంటి హేమాహేమీలు ఉన్నారు. ఆ రోజుల్లో రాజ్యసభలో చర్చల స్థాయి, ప్రమాణాలు భిన్నంగా ఉండేవి, పలువురు సభ్యులు మాట్లాడే విషయం, భాష ఉన్నత ప్రమాణాలతో ఉండేవి. ఏ అంశం తీసుకున్నా అందులో వారికున్న అమోఘమైన పరిజ్ఞానం అబ్బురం కలిగించేది.

సినారె కూడా నాకు ఇలాంటి అబ్బురం కలిగించారు. శాసన సభ్యుల్లో చాలామటుకు ఆసనసభ్యులే అన్నదానికి విరుద్ధంగా, ఏదో నామినేటెడ్ పదవి కదా అని ఆయన కాలక్షేపం చేస్తూ పదవీకాలాన్ని గడిపేయలేదు. పార్లమెంట్ ఉన్నన్ని రోజులూ ఆయన ఢిల్లీలో ఉండేవారు. రాజ్యసభలో ప్రశ్నోత్తరాల సమయంలో పలు ప్రశ్నలు గుప్పించేవారు. ప్రత్యేక ప్రస్తావనల విషయంలో ఆయనది అందెవేసిన చేయి. సినారె లేచి నిలబడ్డారంటే సభ అంతా ఆసక్తితో చెవులు రిక్కించి వినేవారు. ఎందుకంటే ఆయన మాట్లాడుతూ మధ్యమధ్యలోనో, చివరిలోనో ఒక ఉర్దూ గజల్

వాక్యాల్ని చదివి సభను రసభరితం చేసేవారు. సినారె ఆకారమే ఒక మేరునగాన్ని స్ఫురిస్తే, ఆయన మాటల విరుపు, పదాల విన్యాసం సహచర సభ్యులను ఎంతగానో ముగ్ధులను చేసేవి. కవి, మేధావి కనుక సభలో సినారె ప్రస్తావించే అంశాల్లో ఎక్కువగా సాహిత్యం, సాంస్కృతిక అంశాలు ఉండేవి. పార్లమెంట్ లైబ్రరీలో కూర్చుని ఆయన పలు పత్రికలు చదివి, అక్కడ కనపడ్డ జర్నలిస్టులతో ముచ్చటించి ఎప్పటికప్పుడు తాజా విషయాలను తెలుసుకునేవారు.

పాఠశాలల్లో తెలుగుభాషను బోధించడం మానేయడంపై సినారె అనేకసార్లు ఆక్రోశం వ్యక్తపరిచారు. త్రిభాషా సూత్రాన్ని ఖచ్చితంగా పాటించాలని వాదించారు. తెలుగు ఫాంట్స్, సాఫ్ట్‌వేర్, ఇ-పాలనలో తెలుగుకు ప్రాధాన్యతనీయడం కోసం ఆయన ప్రశ్నలు గుప్పించేవారు. దేశం నుంచి పెద్ద ఎత్తున మేధోవలస, విదేశీ మ్యూజియంలలో హిందూ దేవతలను అపహాస్యంగా ప్రదర్శించిన తీరుపై ఆయన ఆవేదన వెలిబుచ్చారు.

గాంధీజీ విద్యాభ్యాసం చేసిన రాజ్‌కోట్ పాఠశాల శిథిలావస్థలో ఉండడంపై ఆయన సభలో మాట్లాడిన తీరు అందర్నీ ఆకట్టుకుంది. అవసరమైతే తన ఎంపీలాడ్స్ నుంచి ఈ పాఠశాల మరమ్మత్తుకు నిధులు మంజూరు చేస్తానని ఆయన ప్రకటించారు. అదే విధంగా సుభాష్ చంద్రబోస్ జన్మించిన కటక్‌లోని జానకీనాథ్ భవన్‌ను ఒక జాతీయ స్మారక చిహ్నంగా ప్రకటించాలని ఆయన డిమాండ్ చేశారు.

ప్రముఖ హిందీ రచయిత మున్షీ ప్రేమ్‌చంద్ జన్మస్థలం వద్ద జాతీయ స్మారక చిహ్నాన్ని నిర్మించాలని కోరారు.

బ్రిటిష్ మ్యూజియంలో అత్యంత విలువైన మన పురావస్తు చిహ్నాలు, ప్రాచీన దస్తావేజులు ఉన్నాయని వాటిని కాపాడాలని సినారె ఆందోళన వ్యక్తం చేశారు. టెలివిజన్‌లలో హింసాకాండ, ఇంటర్‌నెట్‌లో అశ్లీలత, అవాంఛనీయమైన ప్రకటనల జారీ పెరిగిపోతున్నదని, దాన్ని అరికట్టాలని కోరారు.

తుంగభద్ర ప్రాజెక్టుల వద్ద కట్టే వంతెనల వల్ల చరిత్రాత్మకమైన హంపీ దెబ్బతింటుందేమోనని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు.

భారత దేశంలో అన్ని చారిత్రక, సాహిత్య ఆధారాలను పద్ధతి ప్రకారం కేటలాగింగ్ చేసి భవిష్యత్ తరాల కోసం భద్రపరచాలని కోరారు. జాతీయ సాంస్కృతిక నిధిని ఏర్పాటు చేయాలని సూచించారు.

పిల్లలకోసం ప్రత్యేక టీవీ ఛానెల్‌ను ఏర్పాటు చేయాలని, నేషనల్ బుక్ ట్రస్ట్ నుంచి పిల్లల పుస్తకాల విభాగాన్ని వేరు చేసి ప్రత్యేక ప్రాధాన్యతనీయాలని ఆయన కోరారు.

గోల్కొండ కోటను యునెస్కో ప్రపంచ చరిత్రాత్మక స్థలంగా ప్రకటించేందుకు తగిన చర్యలు తీసుకోవాలని పార్లమెంట్‌లో పోరాడింది ఆయనే. ఒక దేశానికి గుర్తింపు దాని సంస్కృతే అని సినారె విస్పష్టంగా ఒక సందర్భంలో ప్రకటించారు. విద్య అనేది సమాచారపు కుప్ప కాదని, జీవితం జీర్ణించుకోలేని విద్యకు సార్థకత లేదని ఆయన స్పష్టీకరించారు. మన విలువలు దిగజారకుండా చూసుకోవడం ముఖ్యమని ఆయన చెప్పారు.

ప్రజా సమస్యలను ప్రస్తావించడంలో సినారె ముందుండేవారు. అంగన్‌వాడీ వర్కర్లకు గౌరవ వేతనం, ఇతర సౌకర్యాలు పెంచాలని ఆయన వాదించారు. రెండవ లేబర్‌కమిషన్ నివేదికను అమలుచేయాలని డిమాండ్ చేశారు.

ఏపీలో కరువు పరిస్థితులు విలయతాండవం చేయడంపై ఆయన సభలో తీవ్ర ఆవేదన వ్యక్తంచేసి కేంద్రాన్ని ఆదుకొమ్మని కోరారు. రాష్ట్రంలో జపనీస్ ఎన్‌కెఫలైటిస్ టీకాలు సరఫరా చేయాలని కూడా ఆయన కేంద్రంపై వత్తిడి చేశారు.

నకిలీ యూనివర్సిటీలు ఎల్లెడలా కనిపించడంపై ఆయన విద్యావేత్తగా కేంద్రం దృష్టికి తీసుకువచ్చారు.

పొగ తాగడంపై నిషేధం విధించాలని కోరారు. మహిళలపై నేరాలు పెరిగిపోవడం గురించి ఆయన ఆందోళన వ్యక్తపరిచారు. కేరళలో పర్యావరణానికి జరుగుతున్న హానిని కూడా ఆయన ప్రస్తావించారు.

మానవ వనరులశాఖకు సంబంధించి పార్లమెంట్ స్థాయీసంఘం నివేదికలను ఆయన పలుసార్లు సభకు సమర్పించారు. వాటిలో ప్రభుత్వాలకు విలువైన సూచనలు చేశారు. అయితే కేవలం కమిటీలు వేయడం వల్ల పని జరగదని, అవి చేసిన సూచనలు అమలు చేయాలని ఆయన గట్టిగా ప్రభుత్వానికి సభలో హితవు చెప్పారు. "కమిటీలు వేయడమంటే గాలిలో బాణాలు వదిలినట్లే... లక్ష్యాన్ని చేరుకోని బాణాలు ఎన్ని వదిలితే ఏమి లాభం?" అని సినారె ప్రశ్నించారు.

అప్పటి ఉప ప్రధాని లాల్ క్రిష్ణ అద్వానీ అధ్యక్షులుగా, నేను ఉపాధ్యక్షుడుగా ఉన్న పార్లమెంటరీ అధికార భాషా సంఘంలో నారాయణరెడ్డి సభ్యులుగా ఉండటం, దేశవ్యాప్తంగా ఇన్‌స్పెక్షన్ల సందర్భంగా పర్యటనలు చేయడం నాకు జీవితంలో దక్కిన మధురానుభూతులు.

ఆయన లాగా తాను కవిత్వ భాషలో మాట్లాడలేనని, అంత భాష తనకు లేదని, ఉర్దూలో ఆయన ప్రావీణ్యం చెప్పుకోదగ్గదని శాస్త్రవేత్త రాజారామన్న పలు సందర్భాల్లో ప్రశంసించారు. పార్లమెంటరీ చర్చలకు సినారె ప్రసంగాలు వన్నె తెచ్చాయని ఆయన మెచ్చుకున్నారు.

సినారె పదవీ విరమణ చేసి నిష్క్రమించినప్పుడు ఆయనను సభలో తామెంతగా పోగొట్టుకుంటున్నామో ప్రతి ఒక్కరూ గుర్తు చేశారు. తనకు రాజకీయాలు లేవని, ఒక రచయితగా తాను సభలో ప్రవేశించానని సినారె పలు సందర్భాల్లో ప్రస్తావించారు.

తనకు రాజకీయాలు అంటగట్టవద్దని సభ్యులకు గట్టిగా చెప్పేవారు. రాష్ట్రపతి ప్రసంగంపై ధన్యవాదాలు తెలిపే తీర్మానంపై ఆయన చేసిన ప్రసంగాలే ఆయన నిష్పాక్షిక ధోరణికి అద్దం పడతాయి.

తాను ఆశావాదినని, నిరాశ అనేది తన శబ్దకోశంలోనే లేదని సినారె సభలో పలుసార్లు వక్కాణించారు. "పూలు వాడిపోయానని బాధపడను, ఫలాల కోసం ఎదురుచూస్తాను. ముళ్లపై నడిచి భావిని ఆహ్వానిస్తాను" అని ఆయన ఉర్దూ గజల్స్ వినిపించేవారు.

"గతం అంటే బూడిదతో నిండిన బాల్చీ" అని ప్రముఖ ఇంగ్లీషు కవి స్టీఫెన్ స్పెండర్ వాక్యాల్ని సినారె ఉటంకించారు.

తన రాజ్యసభ సభ్యత్వం ముగిసిన సందర్భంగా రాజ్యసభలో సినారె చివరిగా చేసిన ప్రసంగం ఎంతో ఆర్ద్రంగా ముగిసింది. ఫిరోజ్‌షా రోడ్‌లోని తన ఇంటి పిట్టగోడపై ఈ రోజు ఉదయం ఆరు పక్షులను చూశానని, అంతలోనే అవి ఎగిరిపోయాయని, అదే విధంగా రాజ్యసభలో తాను గడిపిన ఆరేళ్ళూ పక్షుల్లా ఎగిరిపోయాయని సినారె చెప్పారు.

సినారె అనేక పక్షులకు ఆశ్రయం ఇచ్చే ఒక మహావృక్షం. నిత్య వసంతంతో కళకళలాడే ఆకుపచ్చటి ఆకులతో పథికులను ఆశీర్వదించే కల్పవృక్షం.

అప్పుడప్పుడూ పార్లమెంట్ ఇన్నర్, ఔటర్ లాబీలలో మెల్లగా నడిచి వెళ్తుండే ప్రధానమంత్రి అటల్ బిహారి వాజపేయిని ఆపి ఆయనకు సినారె గజల్స్ వినిపించేవారు. అప్పుడు నేను వారి పక్కనే ఉండటం, వారానికి రెండు సాయంత్రాలు ఆయన సన్నిధిలో రసవంతం చేసుకోవటం వంటి అనుభవాలు ఆ ఐదు సంవత్సరాలు నా సొంతం కావటం నా అదృష్టం.

# దార్శనికుడు సినారె

- డా॥ దీర్ఘాసి విజయభాస్కర్

డా॥ సి.నా.రె గారు జాతీయ కవి. గొప్ప సాహితీవేత్త. సహృదయులు. వాటన్నిటికీ మించి నిరాడంబరులు. దార్శినికులు.

నేను 2000 సం॥లలో హైదరాబాద్‌కు వచ్చిన దగ్గర నుంచి వారితో పరిచయం. నాపట్ల ఎంతో వాత్సల్యం ప్రదర్శించేవారు. ఏం విజయ్ ఇప్పుడు ఏం వ్రాస్తున్నావనేవారు. మీరు కనిపించినప్పుడల్లా అడిగితే ఏం చెప్పమంటారనేవాడ్ని. నవ్వుతూ తన చేతిలోకి నా చేతిని తీసుకునేవారు.

ఇంచుమించుగా నా నాటకాలన్నీ చూసారు. తర్వాత జరిగే సభలో వాటి మంచి చెడుల గురించి మాట్లాడేవారు. కారు ఎక్కేవరకు సాగనంపితే, సీట్లోస్థిరంగా కూర్చొని టా టా చెప్పేవారు.

కిన్నెరవాళ్ల ఉత్సవాల్లో పులిస్వారీ నాటకం వేశాం. అది చూసి విజయ్ చాలా ధైర్యవంతుడు - రాయలసీమలో పనిచేస్తూ అక్కడి ఫ్యాక్షనిజం మీద నాటకం వ్రాయగలడా? పైగా రెడ్డి, నాయుడు అనిపేర్లు పెట్టి, అవును, దేశహాని పనులు పెద్దవాళ్ళే చేస్తారు. దేశానికి చిన్నకులస్థుడు చేసే హాని ఏముంటుందీ? ఏ వుండదని నా థాట్‌ని ఎంత అభినందించారో చెప్పలేను.

కబీర్‌దాస్ నాటకం చూసినప్పుడు కబీర్‌దాస్ డైలాగులు విని అదే భావంగల హిందీ, ఉర్దూ పంక్తులు ఎన్నో ఉదహరిస్తూ మాట్లాడారాయన.

'జీవన్నాటకం' చూసినప్పుడు అందులో నటించిన జితేంద్ర మేకప్పు తీసేసిన తర్వాత కనిపిస్తే 'జగన్నాథం' మూడు దశల్లో నువ్వేపాత్ర వేసేవని అడిగారు. మూడు తనే వేసాడని నేను చెబితే ఎంతో ఆశ్చర్యపోయి నీ రచనకు ప్రాణ ప్రతిష్ఠ చేసాడని కితాబు ఇచ్చారు.

ఇలా గాంధీ జయంతి, కుర్చీ, మినిస్టర్ "బొమ్మలు చెప్పిన భజగోవిందం", మబ్బుల్లో బొమ్మ నాటికలు నేను వ్రాసినవి ఆయన చూసి లోటుపాట్లు నిష్కర్షగా చెప్పేవారు. నా రచనలు విడుదల చేసిన ప్రతీసారీ ఆయన సభలో పాల్గొని ఆ సభకు హూందాతనాన్ని చేకూర్చారు.

ఆయనలో గొప్పదనం ఏ చిన్న రచయిత పిలిచినా ఆ సభకు హాజరై ఆశీస్సులందించేవారు. నిర్మొహమాటంగా తప్పొప్పులు చెప్పేవారు. మంచి వాక్యం కనిపడితే చాలు పొంగిపోయేవారు. నాటకం చూస్తున్నప్పుడు కూడా మంచి డైలాగ్‌వస్తే తలూపుతూ కుర్చీమీద చిటికేసేవారు. నారాయణరెడ్డి గారు మెచ్చుకుంటే లోకమంతా

మెచ్చుకున్నట్టే అనుకునేవాడ్ని. ఆయన నాటకం చూస్తుంటే నేను ఆయనవైపుకు చూస్తుండేవాడిని.

ఆ ప్రక్కన కూర్చునే శ్రీ రమణాచారిగారిది వేరే బాణి. గుంభనంగా నవ్వుతూ, మంచి సంభాషణలకు ఆహా, ఓహో, అంటూ తన సంతోషాన్ని బాహాటంగానే ప్రకటిస్తారు రమణాచారిగారు. ఆ ఇద్దరు ఉన్న సభ నిండైన సభగా, సంప్రదాయ నింపిన సభగా సాగిపోతుంది. రవీంద్రభారతి, త్యాగరాజగానసభ, తెలుగు యూనివర్సిటీ ఆడిటోరియం – వేదిక ఏదైనా వక్త ఎవరైనా నారాయణరెడ్డిగారుంటే ఆ వేడుకే వేరుగా ఉండేది. సభల్లో మంత్రులు, ముఖ్యమంత్రులున్నా వాళ్ల మీద ఒక విసురు విసరాలంటే అందుకే మాత్రం వెనుకంజ వేసే వారు కాదు.

ఇంచుమించుగా ప్రతిరోజు ఏదో ఒక సభలో మాట్లాడే ఆయన ఒక్కోసారి అంతకుముందు చెప్పిన విషయాల్ని ఉటంకించేవారు. అంతకు ముందు విన్నవాళ్ళు కూడా ఏమాత్రం శ్రద్ధకోల్పోకుండా వినేవారు. ఎన్నిసార్లు విన్నా విసుగు అనిపించేది కాదు. క్రొత్తగా వింటున్నట్లే ఉండేది.

ఆయన సినిమాలకు పాటలు నేపథ్యాన్ని వివరించినప్పుడు ఎంత హృద్యంగా ఉండేదో! ముఖ్యంగా దానవీరశూర్ణకు వ్రాసిన 'చిత్రం! భళారే చిత్రం' పాటలోని మాటలు ఎలా పుట్టుకొచ్చాయో చెబుతుంటే రవీంద్ర భారతి కేరింతలతో మారుమ్రోగేది.

నేను వ్రాసిన 'మహాశూన్యం' కి అభినందలు, పేరిట

"నీవు ధరించాల్సిన దస్తులు

నగ్న అంతస్సుతో నడిచి వెళ్ళు"

వ్యాఖ్యానానికి అంత సులభంగా అందని ప్రగాఢ తత్వనిహిత పంక్తులివి అని ఆశీస్సులు అందించారు.

# సినారె సినీ సాహితీ విన్యాసాలు

- శ్రీ ఎస్.వి.రామారావు

తెలుగు సినీ గీతచరిత్రను పరిశీలిస్తే సినారెకు ముందు, సినారె తరువాత అని స్పష్టంగా విభజించవచ్చు. వస్తు వైవిధ్యంతో అన్ని తరహాల సన్నివేశాలకు నియమితకాలంలో నిర్మాత, దర్శకులను ఇబ్బంది పెట్టకుండా అర్థవంతమైన గీతాలు వ్రాసి ఇవ్వగల సినీకవులు ఆరుద్ర, సి.నారాయణరెడ్డిలను ప్రముఖంగా పేర్కొనాలి.

1961వ సంవత్సరంలో మహానటుడు నందమూరి తారక రామారావు ప్రోత్సాహంతో 'గులేబకావళికథ' చిత్రానికి అన్ని పాటలు వ్రాసి, సినీరంగ ప్రవేశం చేశారు నారాయణరెడ్డి. అంతకుముందే అద్భుతమైన సాహిత్యాన్ని సృష్టించి, సాహితీ అభిమానుల్ని అలరించారు. 1962 నుంచి వారు కన్నుమూసిన 2017 వరకు నిరంతరం సినీగీతాలు వ్రాస్తూనే వున్నారు. అంటే గీతరచయితగా వారి ప్రస్థానం 55 సంవత్సరాలు. ఇది భారతీయ సినీగీత చరిత్రలో ఒక రికార్డు. వారు వ్రాసిన మూడు వేల గీతాల నుంచి ఆణిముత్యాల వంటి కొన్నింటిని రేఖామాత్రంగా ఈ వ్యాసంలో విశ్లేషించేందుకు ప్రయత్నిస్తాను.

**ప్రబంధ శృంగార ప్రభావం :**

'మనుచరిత్ర', 'వసుచరిత్ర' వంటి ప్రబంధ కావ్యాలను వంటబట్టించుకున్న సినారె ఆ సాహిత్య ప్రభావాన్ని తన గీతాల్లో వినిపించారు. తొలిసారిగా రికార్డయిన పాట 'నన్ను దోచుకుందువటే' అయినప్పటికీ, కలం పెట్టి వ్రాసిన తొలి గీతం 'కలల అలలపై తేలెను'. ఈ గీతంలో నాయకుడు 'విరజాజులు పరిమళించు, విరుల పాన్పు ఏమన్నది' అని ప్రశ్నించగా, నాయిక 'అగుపించని ఆనందం బిగికౌగిట కలదన్నది' అని జవాబు ఇస్తుంది. 'అగ్గిబరాటా' చిత్రంలోని 'చిరునవ్వులోని హాయి' యుగళగీతంలో నాయిక 'నెలరాజు సైగ చేసే, వలరాజు తొంగిచూసే' అనగా నాయకుడు 'సిగపూలలోన, నగుమోములోన వగలేవో చిందులేసె' అని ఆనందాన్ని అభివ్యక్తీకరిస్తాడు. 'పగటిపూట చంద్రబింబం' (చిక్కడు దొరకడు) అనే పల్లవి గల యుగళగీతంలో 'వన్నె వన్నె తారలెన్నో కన్ను గీటి రమ్మన్నాయి' అని తెలిపి, ఆ తారకలు అమె సిగలోనే ఉన్నాయని సమర్థించుకుంటాడు. అందుకు ప్రతిగా నాయిక 'పదును పదును బాణాలేవో ఎదను నాటుకుంటున్నాయి' అంటూ అవి ప్రియుడి వోర చూపులేనని సమర్థించుకుంటుంది. ఎన్‌టిఆర్ ఆలోచనలకు తగ్గట్టు 'దానవీరశూరకర్ణ'లో దుర్యోధనునకు వ్రాసిన యుగళగీతంలో 'బింబాధర మధురిమలు

బిగికౌగిలి ఘుమఘుమలు - ఇన్నాళ్లుగ మాయురే మేమెరుగకపోవుటే చిత్రం' అంటారు. ఆ గీతంలోనే 'సతమతం' అనే వ్యావహారిక రూపానికి 'సదమదం' అనే ప్రాచీన రూపాన్ని ప్రయోగించారు.

**క్లి(ఇ)ష్ట సమాస సందోహం :**

రసవత్తరంగాను, శ్రవణపేయంగాను వుండే సమాసాలను ప్రయోగించడానికి సినారె ఇష్టపడేవారు. ఆ పదాల నడకలో సాహిత్యపరంగాను, సంగీతపరంగాను వేగం ధ్వనిస్తుంది. 'ఏకవీర' చిత్రంలో 'నీపేరు తలచిన చాలు' అనే గీతంలోని చరణాలు గమనించండి. "బృందానికుంజముల పూలుపూచి, శరదిందు చంద్రికల కేలుసాచి, తరుణాంతరంగముల దాగి దాగి - చెలి అందెలందు చెలరేగిరేగి నను తొందరించెరా - తొలకరించెరా, వలపుజల్లుగా పలుకరించెరా, వల్లవీరమణి చల్లని ఉల్లము, అల్లన ఝల్లన పరవశించెరా".

'శ్రీకృష్ణ విజయం' చిత్రంలో హేమామాలినిపై చిత్రీకరించిన నృత్యగీతం 'జోహారు శిఖపింఛమౌళి'లోని చరణాలు - 'చకిత చకిత హరిణేక్షణావదన చంద్రకాంతులివిగో - చలిత లలిత రమణీ చేలాంచల చామరమ్ములివిగో, ఝళం ఝళిత సురలలనా నూపుర కలరవమ్ము లివిగో, మధురకరరవమ్ము లివిగో, మంగళరవమ్ము లివిగో" - ఈ చరణాలకు అద్భుతమైన నృత్య రీతులు అలంకారాలయ్యాయి. 'తూర్పు పడమర' చిత్రంలో 'శివరంజని, నవరాగిణి' అనే పల్లవి గల గీతంలో నాయకుడు తను ఆరాధించిన నాయికను సంబోధించిన చరణాలు పరిశీలిద్దాం. "జనకుని కొలువున అల్లనసాగే జగన్మోహిని జానకి, వేణుధరుని రథమారోహించిన విదుషీమణి రుక్మిణి, రాశీకృత నవరసమయ జీవన రాగచంద్రికా, లలిత లావణ్య భయద సౌందర్య కలిత చండికా". సాహిత్యం, సంగీతం, నృత్యం ఈ మూడు త్రివేణీసంగమమై ఏకోన్ముఖంగా రూపుదిద్దుకుంటే, ఆ దృశ్యం మొత్తం కనువిందు చేస్తుంది. ఇందుకు ఉదాహరణగా 'చెల్లెలి కాపురం'లోని 'చరణకింకిణులు' గీతాన్ని పేర్కొనవచ్చు. త్రినేత్రుని కంటి మంటకు మన్మథుడు బూడిద కాగా, అతని సతి రతీదేవి బాధపడిందట. దానిని "ఫాలనేత్ర సంప్రభవత్ జ్వాలలు ప్రసవశరుని దహియించగా, పతిని కోలుపడి రతీదేవి దుఃఖితమతియై రోదించగా" అంటూ అభివ్యక్తీకరించారు. ఆ తరువాతి చరణాలు ఇంతకన్న వేగమైన పదాలతో "ప్రళయకాలసంకలితభయంకర జలధర్భార్భటుల చలిత దిక్కటుల, చకిత దిక్కరుల వికృత ఘీంకృతుల సహస్రఫణసంజనితఫూత్కృతుల" అంటూ సాగుతాయి. ఆ చిత్ర నిర్మాత బాలయ్య ఈ భాష సామాన్యులకు అర్థంకాదేమో అని సందేహించగా, అవి అలాగే ఉండాలి అని దర్శకుడు విశ్వనాథ్ పట్టుబట్టారు. ఫలితంగా ఒక అద్భుత గీతం, ఒక అద్భుత

దృశ్యం ఆవిష్కృతమయ్యాయి. నేను కథారచన చేసిన 'త్రిలోకసుందరి' చిత్రంలో కూడా కథానాయకుడు తనగానంతో నృత్యం చేసే నాయిక నాగకన్యను ఓడించాలి అనే సన్నివేశంలో 'చరణకింకిణులు' ధోరణిలో ఉండాలి అని నేను సినారెకు సూచించగా, వారు వ్రాసిన చరణాలు "ఓహో శిఖామణీ! సుందర రమణీ జగన్మణీ! పరిచలిత చలిత బంభర వేణీ, సమ్మద మరాళ మృదు గమనా! నవ వికచ కమలదళ నయనా, కిణకిణ కిణ కింకిణులు మ్రోగ" అంటూ సాగుతుంది. యన్‌టిఆర్‌కు కూడా సుదీర్ఘ సమాస ప్రయోగాలంటే ఎంతో ఇష్టం. ఆయన దర్శకత్వంలో రూపొందిన 'శ్రీకృష్ణ పాండవీయం', 'దానవీరశూర కర్ణ' చిత్రాల్లో దుర్యోధనుని ఎదుట రెండు స్వాగత గీతాలుంటాయి. ఆ రెండూ సినారె వ్రాశారు. 'శ్రీకృష్ణపాండవీయం' స్వాగత గీతంలో "ధరణిపాల శిరోమకుటమణి తరుణ కిరణ పరిరంజిత చరణా, కదనరంగ బాహుదండ ధృతగదాప్రకట పటుశౌర్యాభరణా" అంటూ సుయోధనుని సంబోధిస్తారు. 'దానవీరశూరకర్ణ'లోని 'జయీభవ' స్వాగత గీతంలో "చంద్రవంశ పాథోధి చంద్రమా, కురుకుల సరసీ రాజహంసమా, జయీభవ విజయీభవ – ధన్యగాంధారి గర్భశుక్తి ముక్తాఫలా, మాన్య ధృతరాష్ట్ర తిమిర నయన తేజఃఫలా" అంటూ ప్రస్తుతిస్తారు. ఎన్‌టిఆర్ సూచన మేరకు రాక్షసకన్య హిడింబి నోట వెలువడ్డ ప్రణయగీతంలో "ఛాంగురే, మజ్జారే, అయ్యారే, అమ్మకచెల్ల" అంటూ అర్థవంతమైన చిత్రవిచిత్ర పదప్రయోగాలు చేశారు. 'స్వాతికిరణం'లోని "సంగీత సాహిత్య సమలంకృతే" మరో ఉదాహరణ.

**త్రివేణి సంగమం :**

ఇంతకుముందు పేర్కొన్నట్లు సాహిత్యం, సంగీతం, నృత్యం త్రివేణి సంగమమై, ఏకోన్ముఖంగా సాగిన రెండు అద్భుతగీతాలను ముచ్చటించాలి. 'కంచుకోట' చిత్రంలో మహారాజు నరపాలసుధాకరుడు. అతని తమ్ముడు మత్తులో, మగువల సాంగత్యంలో గడిపే రతిరాజసుందరుడు. వేరువేరు ప్రదేశాల్లో వారి ఇద్దరి ప్రవర్తనను, పాత్ర ఔచితిని విశ్లేషించే నృత్య గీతం 'సరిలేరు నీకెవ్వరు'. నర్తకీమణులు ఎల్.విజయలక్ష్మి, టి.జయశ్రీ పోటీపడి నర్తించారు. అత్యంత వేగంతో కూడిన నృత్యరీతులు ప్రేక్షకుల్ని ఆకట్టుకుంటాయి. గీతంలో ముక్తాయింపుగా సుశీల నోట "రాజభోజ! రవితేజ! దానజితకల్పభూజ! జోహార్!" అని పలికించి– జానకి నోట "నీటుగుల్కి సుమకోటి తేనెలా నేటి తేటి! జోహార్!" అనిపిస్తారు. ఇదే వేగంతో కూడిన మరో గీతం "విచిత్ర దాంపత్యం"లోని "శ్రీగౌరి శ్రీగౌరియే" ఈ గీతంలో "ఒదిగి ఒదిగి పతి పదములందు నివసించియుండు గౌరి" అని పార్వతి లక్షణాలను, "ఎగిరి ఎగిరి పతి సిగను దూకి నటియించుచుండు గంగ" అని గంగ నైజాన్ని వివరించారు.

**శబ్ద సౌందర్యం :**

కొన్ని చరణాలు వింటుంటే అందులో వున్న పదాల పోహళింపులోని శబ్ద సౌందర్యం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. "ఏమో ఏమో ఇది" అనే 'అగ్గిపిడుగు' యుగళ గీతంలో "కనులలో నీ కనులలో - కురులలో ముంగురులలో - వింతగా కవ్వింతగా, చెంతగా నువుచేరగా - ఎందుకో సిగ్గెందుకో, అందుకో చేయందుకో- నవ్వుతో మునినవ్వుతో, మాటతో సయ్యాటతో" అనే ప్రయోగాలు మనల్ని అలరిస్తాయి. 'దానవీర శూరకర్ణ'కు పోటీగా కృష్ణ 'కురుక్షేత్రం' రూపొందించారు. అందులో ఓ గీతాన్ని వ్రాయమని సినారెను కోరగా, ఎన్‌టిఆర్ చిత్రంలో అన్ని పాటలు నేనే వ్రాస్తున్నాను. కనుక మీకు వ్రాయడం భావ్యంగా ఉండదు, అందులో లేని సన్నివేశం ఉంటే వ్రాయడానికి అభ్యంతరం లేదు అని సంస్కారయుతంగా చెప్పారు సినారె. అప్పుడు దర్శకులు కమలాకర కామేశ్వరరావు సుభద్రార్జునుల ప్రణయ సన్నివేశం సృష్టించి, యుగళగీతం వ్రాయమని కోరగా, సినారె అందించిన గీతం "మ్రోగింది కల్యాణవీణ". అందులో 'కలవరించి' అనే పదాన్ని రెండు అర్థాలు వచ్చేలాగా కలవరించి - కల, వరించి అని వ్రాసిన చరణాన్ని గమనించండి. "పిల్లగాలితో నేనందించిన పిలుపులే విన్నావో - నీలిమబ్బుపైనే లిఖియించిన లేఖలందుకున్నావో, ఆ లేఖలే వివరించగా రసరేఖలే ఉదయించగా కల వరించి కల-వరించి, పులకిత తనులత నిను చేరుకోగా", 'స్వాతిముత్యం'లోని లాలిపాటలో "కళ్యాణ రామునికి కౌసల్య లాలి, యదువంశ విభునికి యశోదలాలీ, కరిరాజముఖునికి గిరి తనయ లాలి" అన్నపుడు ఎంతో అర్థవంతంగా హాయిగొలిపేలా పదప్రయోగం జరిగిందనిపిస్తుంది.

**అధిక్షేప గీతాలు :**

'బంగారు మనిషి' చిత్రంలో "నాదేశం భగవద్గీత, నాదేశం అగ్నిపునీత సీత - నా దేశం కరుణాంతరంగ, నా దేశం సంస్కార గంగ" అని దేశ వైభవాన్ని తెలిపి, అటువంటి దేశంలో నేటి అస్తవ్యస్త పరిస్థితిని చూసి "ఎక్కడికెళుతూందీ దేశం, ఏమైపోతూంది - హిమశైల శిఖరం పైకా? పాతళ కుహరం లోకా?" అని అధిక్షేపించారు. భారతీయులకు పరమపవిత్రమైనది 'వందేమాతర' గీతం. ఆ గీత చరణాల భావాన్ని "సుజల విమల కీర్తనలో సుఫలాశయ వర్తనలో, జలం లేక ఫలం లేక జనం ఎండుతున్నది - మలయజ శీతలపదకోమల భావన బాగున్నా - కంటి కంటిలో తెలియని మంట రంగులుతున్నది" అంటూ అధిక్షేపించారు.

**స్థలపురాణం :**

హైదరాబాద్ ప్రాశస్త్యాన్ని 'మట్టిలో మాణిక్యం' చిత్రంలో ఓ గీతంలో "అటు చూస్తే చార్మినారు, ఇటు చూస్తే జుమామసీదు, ఆవంక అసెంబ్లి హాలు - ఈవంక

జూబిలి హాలు, తళ తళ మెరిసే తళ తళ మెరిసే హుసేనుసాగరు, దాటితె సికింద్రబాదు" అంటూ వివరించారు.

**గీత వేదాంతం :**

వికల మనస్కులైనప్పుడు, విషాదం, వియోగం సంభవించినప్పుడు తెరపై కనిపించే పాటలకు సినారె రూపుదిద్దిన వైనాలను పరికిస్తే – "మల్లెయలారా! మాలికలారా!" అనే మకుటం గల గీతంలో "జాబిలిలోనే జ్వాలలురేగె, వెన్నెలలోనే చీకటిమూగె – పలుకగ లేక పదములు రాక, బ్రతుకే తానే బరువై సాగె" అనే చరణాల్మొ 'తాత-మనువడు'లోని "అనుబంధం ఆత్మీయత అంతా ఒక బూటకం, ఆత్మ తృప్తికై మనుషులు ఆడుకొనే నాటకం వింత నాటకం"్మొ 'దేవదాసు మళ్ళీ పుట్టాడు'లోని "ఎవరికి ఎవరు చివరికి ఎవరు ముగియని ఈ యాత్రలోనా – ముగిసే ఈ జన్మలోన" గుర్తుకువస్తాయి.

**స్నేహబంధం :**

'బాలమిత్రులకథ'లోని 'గున్నమామిడి కొమ్మమీద గూళ్లు రెండున్నాయి' అనే గీతంలోను 'స్నేహమే నాజీవితం, స్నేహమేరా శాశ్వతం – స్నేహమే నాకున్నది, స్నేహమేరా పెన్నిధి' అనే 'నిప్పులాంటి మనిషి' చిత్ర గీతాలు స్నేహమాధుర్యాన్ని గుబాళించాయి. 'కలెక్టర్ జానకి'లోని 'వచ్చితివా బాల్యమిత్రమా' అనే కుచేలోపాఖ్యానం హరికథలో హాస్యరసాన్ని ఆవిష్కరించారు.

**అద్భుత అన్వయం :**

'కృష్ణవేణి' చిత్రంలోని టైటిల్ సాంగ్‌లో కథానాయిక కృష్ణానది వైభవాన్ని వివరిస్తూ– "నాగార్జునగిరి – కౌగిట ఆగీ, బీళ్ళను బంగారుచేలుగా మార్చేవు, ఆంధ్రావనికే అన్నపూర్ణవై కరువులు బాపేవు– బ్రతుకులు నిలిపేవు" అని ప్రశంసించగా, నాయకుడు 'కృష్ణవేణి' అనే పేరు గల తన భార్యపరంగా "నా జీవనదివై – ఎదలోన ఒదిగి, పచ్చని వలపులు – పండించు కృష్ణవేణి" అంటూ అక్కున చేర్చుకుంటాడు. అలాగే 'ముత్యాల ముగ్గు' చిత్రంలో ఉదయసంధ్యను నాయిక "పొద్దుపొడిచె పొద్దుపొడిచె ఓ లచ్చుగుమ్మడి, పుత్తడి వెలుగులు కొత్తగ మెరిసె ఓ లచ్చుగుమ్మడి" అని వర్ణించగా, నాయకుడు –నాయికపరంగా "పొద్దుకాదది నీ ముద్దుమోమున దిద్దిన కుంకుమతిలకమే సుమా – వెలుగు కావవి నీ పాదాలకు అలదిన పారాణి జిలుగులే సుమా" అని మురిపెంగా అభివర్ణిస్తాడు.

**రవళించిన జావళీలు :**

తొలిచిత్రం 'గులేబకావళి కథ'లో వ్రాసిన జావళి గీతం 'మదన సుందర నాదొరా'లో "మిసిమి వన్నెలలోన– పసిడి తిన్నెలపైన రసకేళి తేలి పరవశమౌదమీవేళ"

అన్న చరణాలు ప్రళయరస ప్లావితం. నిర్మాత డి.వి.ఎస్.రాజుగారికి జావళీలంటే ఎంతో ఇష్టం. ఆయన తీసిన 'మంగమ్మ శపథం'లోని "అందాల నారాజ అలుకేలరా" అనే జావళిలోని పంక్తులు "అందనివలపులు గంధము పూసేను, మదనునితూపులు మరి మరి పదునాయె" శృంగార రసావిష్కరణ చేసేవే.

**సూక్తులు - హితోక్తులు :**

ఉత్తమ సాహిత్య లక్ష్యం మానసిక ఆనందాన్ని అందించడమే కాక, వ్యక్తిత్వ వికాసానికి, సామాజిక ప్రగతికి దోహదం చెయ్యాలి. అప్పుడే సినీగీతాలకు ఓ ఉదాత్తత లభిస్తుంది. "ఎవరికీ తలవంచుకు" అనే గీతంలో "జీవితమే ఒక వైకుంఠపాళి, నిజం తెలుసుకో భాయి – ఎగరేసే నిచ్చెనలే కాదు, పడదోసే పాములు వుంటాయి – చిరునవ్వులతో విషవలయాలను ఛేదించి ముందుకు పదవోయి" అంటూ యువతకు హితవు చెప్పారు. "పుట్టినరోజు పండగే అందరికీ" అనే మకుటం గల గీతంలో "ప్రతి మనిషీ తన జన్మకు – పరమార్థం తెలుసుకొని, తన కోసమే కాదు – పరుల కొరకు బతకాలి, తానున్నా లేకున్నా – తన పేరు మిగలాలి" అంటూ జీవిత పరమార్థం వివరంచారు. ఈ వర్గీకరణలో ఉదహరించదగ్గ మరికొన్ని గీతాలు – 'మానవజాతి మనుగడకే ప్రాణం పోసింది మహిళ', 'నీ ధర్మం నీ సంఘం నీ దేశం నువు మరువద్దు', 'అణువూఅణువున వెలసినదేవా! కనువెలుగై మము నడిపించరావా'.

జ్ఞానపీఠాన్ని అధిష్ఠించిన విశ్వంభరుడు, నిత్య కవితా కృషీవలుడు, మహోన్నత మానవతావాది మహాకవి డాక్టర్ సి.నారాయణరెడ్డి ఈనాడు మనమధ్య లేకపోయినా, ఆయన అందించిన అద్భుత సాహిత్యం, ప్రత్యేకించి సామాన్యులకు చేరువైన సినీగీతాలు నిత్యమై, సత్యమై, చిరస్మరణీయమై మనల్ని అలరిస్తూనే వుంటాయి.

# తెలుగు 'నుడి' కి 'గుడి' కట్టిన సినారె

డా॥ ద్వా. నా. శాస్త్రి

*"భాషే నేను తెచ్చుకున్న తీయని వరం*
*భాషే నేను కట్టుకున్న జీవన గోపురం*
*నా ఇంటి విస్తృత గవాక్షం భాష*
*నా కంటి వినిర్మల కటాక్షం భాష"*

అని పలికిన ఆచార్య సి. నారాయణరెడ్డి ఆధునిక కవుల్లో ముందువరుసలో ఉండేవారు. సర్వతోముఖ ప్రతిభాశాలి. బహుభాషాకోవిదులైనాగానీ తెలుగంటే చెప్పలేని మక్కువ. యాభై సంవత్సరాలుగా కాలంవెంట కవిగా తనను తానే బేరీజు వేసుకుంటూ ఈ కవితా పారిజాతాల సౌరభాన్ని గుబాళింపజేస్తున్న ఒకే ఒకడు - సినారె. అన్ని ప్రక్రియల్లోను, అన్ని ఉద్యమాలలోను, సమ దృష్టిని కలిగి కొత్తతరం కవులతో దీటుగా ... కథన చేస్తున్న కవన విశ్వంభరుడలాయన.

"తెలుగు కళ్ళకు తెలుసు నా / లలిత కళారూపం
తెలుగిళ్ళకు తెలుసు నా / కలగీతాకా దీపం"

అనటంలో తెలుగుదనం వుంది. ఆత్మవిశ్వాసం ఉంది - ధిషణాహంకారం .... లేని మానవతావాది సినారె.

సినారె కవిత్వం చదివినా, వచనం పరిశీలించినా, పాట విన్నా, గేయం ప్రక్రియ భాషా సౌందర్యం మనల్ని పట్టేస్తుంది. వస్తు, భావాలతోపాటు భాషకి ప్రాధాన్యం ఇచ్చిన కవి సినారె. సంభాషణలలో కూడా ఒక చమత్కారం, ఒక విరుపు, ఒక చరువు, ఒక కుదుపు, ఒక మెరుపు లేకుండా వుండదు. భాషమీద అధికారం గల కవులు చాలామంది వున్నారు. అయితే తెలుగు భాషమీద సినారెకి ఉన్న ప్రభుత మనల్ని ఆశ్చర్య పరుస్తుంది. ఆ ప్రభుత పాండిత్య ప్రదర్శనకోసం కాదు - భావరామణీయకతకోసం, చమత్ 'కృతి' కోసం. తెలుగు పలుకుబడికిగల చేవని తెలియజేయడం కోసం, కవిత్వంలోనే కాదు సభలలో ఉపన్యసించేటప్పుడు కూడా భాషా సామర్థ్యాన్ని, భాషోచిత్యాన్ని గమనిస్తాం. తెలుగు భాషలోగల మహత్తరశక్తిని తెలియజేసినవారు సినారె.

శీర్షికలు పెట్టడంలోనే సినారె తన భాషాశక్తిని ప్రదర్శించారు. 'నామౌచిత్యం' అనేది చాలా ముఖ్యం. పుస్తకాలకిగాని, కవితలకి గాని పేరు పెట్టడంలో తెలుగు పలుకుకి ప్రాధాన్యమివ్వడం గమనిస్తాం:

"ఉదయం - నా హృదయం"
"దివ్వెల మువ్వలు"; "మార్పు నా తీర్పు"
"కవిత నా చిరునామా"; "నడక నా తల్లి"

మొదలైనవి పుస్తకాల పేర్లు, కవితల శీర్షికలలో గుబాళించే తెలుగుదనం కొంత దర్శిద్దాం -

'ఉదయానికి ఉరి', 'సన్నాజాజీ పూలామాలా', 'తొందరగండడు', 'నీకు నాకూ ఏం పోలిక?', 'కాలం గొంతులో వెలక్కాయ', 'మానవత! తమాషా చూస్తున్నావా?', 'అది చెట్టే కాదు', 'గొర్రెలు గొర్రెలు'.

సినారె శీర్షిక పెట్టడం దగ్గర నుండి భాషపై ప్రత్యేకమైన నిశిత దృష్టిగల వారని తెలుస్తుంది. అయితే ఆ భాషాదృష్టి భాషాడంబరం కాకపోవటం విశేషం. భాషకోసం కాదు - భావన కోసం భాషను ప్రయోగిస్తారు. అందుకే కొత్తగా సినారెది 'భావభాష' అనవచ్చు. సినారె శబ్దపరిజ్ఞానం భావ రామణీయకతకీ, శైలీ మనోహరత్వానికి మూలమైంది.

కార్లయిల్ చెప్పిన "Musical Thought" కాల్‌రిడ్జి చెప్పిన "Best words in their best order ' అన్నవాటికి సినారె కవిత్వమే కాదు, పాటే కాదు, వచనం కూడా సాక్ష్యమే!

"పలుకు పలుకులోన తెలుగు, పలికెను పర్జన్యంలా
పదం పదంలోన తెలుగు, ఎదిగెను చైతన్యంలా""
అన్న సినారె మాటలు అక్షర సత్యాలు.

వెనుకటి తరం సినీకవులంతా సాహితీవేత్తలు. ఏ పాట రాసినా సాహితీ పరిమిళం గుబాళించ వలసిందే. సినారె కూడా సినిమా పాటలలో తమ 'సత్తా' చూపించారు. తెలుగు పలుకుబడిని పూరా ప్రదర్శించారు. వాడుకభాషా పదాలను వాడారు. ధ్వన్యనుకరణశబ్దాలను, నుడికారాన్ని వాడారు. కొత్త పదబంధాలను సృష్టించారు. భావం, శబ్దం, లయ - మూడూ పోటా పోటీగా పరుగులెత్తినా శబ్దం ఒకడుగు ముందే ఉంటుంది. మనల్ని కవ్విస్తుంది. సినారె శబ్దాలు తమ లోతును కనుక్కోమని మనకి సవాల్ విసిరినట్టు కనపడతాయి.

"పగలే వెన్నల, జగమే ఊయల
కదిలే ఊహలకే కన్నులుంటే"
"తొలిచూపులు నా మదిలో తలుపుతీసెనే
పెదవులపై చిరునవ్వులు నిదురలేచెనే"

వంటి పాటలతో తెలుగు పదాల పోహళింపు – పద చిత్రాల గుబాళింపు మనల్ని పరవశింప జేస్తాయి.

"పదే పదే కన్నులవే బెదరునెందుకు
ఎదో ఎదో చక్కిలిగింత కలిగినందుకు
ఒదిగి ఒదిగి లేతవలపు ఉబికినందుకు"

అన్నప్పుడు పదాల పునరుక్తి, లలితా భావ ప్రకటనకి దోహదకారి అయింది. డా॥ గోపి అన్నట్లు "మౌఖిక సంప్రదాయ పునాదుల్లోంచి వచ్చిన శిష్టకవి. లేత వలపు ప్రయోగం విశిష్టం. హరికథలు తొలిప్రేరణగా ఉన్న కవి" అందువల్లనే

"మల్లీయల్లో మల్లీయల్లో మల్లీయాల్లో
మళ్ళీ వస్తావో లేదో మరదలు పిల్లో
వెన్నియల్లో వెన్నియల్లో వెన్నియల్లో
నిన్నూ జూస్తేనే ఒళ్ళు ఝల్లో ఝల్లో"

అని జానపద బాణీని పట్టుకోగలిగారు.

"నేనులో ఏముంది, నీవులో ఏముంది?
నేనులో నీవుంది, నీవులో నేనుంది"

ఇలా తెలుగు పదాలను వాడటం అపూర్వం. ఈ పదవైచిత్రి సొగసుతనం తీసుకొచ్చింది. వ్యాకరణం సంకెళ్ళను ఛేదించుకొని తెలుగుదనం ప్రవహించింది. సినారె పాటల్లో 'సొగసుకాడ', జిలుగుపైట, కులుకునడక, కొసరి విన్నానులే, పిండి వెన్నల, వలపుల సాంబ్రాణి, కువకువ, మిసమిస, అందీ అందని, మబ్బులవాడ, నవ్వులు చిలికిన... మొదలైన తెలుగు పద సంపద అహ్లాదాన్ని కలిగిస్తుంది.

'ప్రపంచపదులు', 'కలంసాక్షిగా' (ద్విపదులు) సినారె నూతన సృష్టి. ఎంతటి సంస్కృతి పాండిత్యం వున్నా తిక్కన "జాత్యము గామి సంస్కృతమెయ్యెడజొన్ప" అన్నట్టుగా సినారె కూడా అవసరమైతే తప్ప సంస్కృతాన్ని వాడరు. తెలుగుమీదగల మక్కువ అపారం. 'మనభాషలో ఆశక్తి లేకపోతేగదా' అని సినారె మనకి చెప్తున్నారా అనిపిస్తుంది. అంత్యప్రాసలు, ఆదిప్రాసలతో పాటు అంతఃప్రాసల ప్రయోగం ప్రత్యేకత. ఈ శాబ్దిక సౌందర్యం తెలుగు పదాలతోనే సాధించటం గమనించదగింది.

"నింగి లోతును చూడగోరితె నీటి చుక్కను కలుసుకో
రత్న తత్వం చూడగోరితె రాతి ముక్కను కలుసుకో
మౌన శిల్పం చూడగోరితె మంచుగడ్డను కలుసుకో
మనిషి మూలం చూడగోరితె మట్టి బెడ్డను కలుసుకో"

ఇందులో అంతఃప్రాసతో పాటు అంత్య ప్రాసను కూడా సాధించారు. ఈ ప్రాసల వెనుక అగాధమైన భావనాశక్తి వుంది. దానిలోతును చూడగోరితె సినారె తెలుగుదనాన్ని తెలుసుకో - అనాలనిపిస్తుంది 'కలంసాక్షిగా'లో ఉన్న ద్విపదులు అలవోకగా పెల్లుబికి వచ్చినవే. స్థిరచిత్తంతో కూర్చొని రాసినవి కాదు. అయినా శబ్దశక్తి ఫలితంగా, లోకానుభవ శక్తి ఫలితంగా వెలువడినట్లు తెలుస్తుంది.

"ఎందుకో అసూయపరులను నీపై ఏ అపకారం చేయందే
అలా పెరిగిపోయావెందుకు అంగుళమైనా వాళ్ళెదగందే"

అనటంలో వ్యంగ్యవైభవం వుంది. ఈ ద్విపదులలోనే సినార తెలుగు వైభవం సహజసుందరంగా వ్యాపించింది అనటానికి - 'కరుచబుద్ధి, పుట్టగొడుకు, చచ్చు, జిగేలనిపించే, బజ్జోమంటే, తీసెయ్యాలోయ్, అంతో యింతో" వంటివి నిదర్శనాలు. 'ప్రపంచ పదులు'లో కూడా.

" 'పుచ్చిక నాలుక", 'ముసురు కొచ్చే', 'కొమ్ముకాచే', 'పాచిపట్టిన', 'తేపతేపకు', 'గోళ్లుగిల్లు కోవటం" వంటి తెలుగు 'సుద్దులు' మన హృదయాల్ని పట్టేస్తాయి.

ఈనాడు మనం మర్చిపోయిన రమణీయమైన తెలుగు పలుకుబడిని సినారె కవిత్వంలో గుర్తించవచ్చు. సినారె కవిత్వంలోగల తెలుగు శబ్ద సంపదపై ఒక "పద ప్రయోగ కోశం" రూపొందితే గానీ సినారె గళంలో ఎన్ని తెలుగు స్వరాలు తరగలెత్తాయో తెలియదు.

సినారె లలిత గీతాలు అమందానందాన్ని కలగజేస్తాయి. 'లయ'కు మరోపేరు నారాయణరెడ్డి. ఆయనకి సమయపాలనే కాదు, పరిపాలనే కాదు - శబ్దపాలన కూడా కొట్టినపిండి. తెలుగు పదాలు సినారె గళంలోంచి, కలంలోంచి 'నేను వస్తాను, నేను వస్తాను' అని ఒకదానినొకటి తోసుకువస్తాయా అనిపిస్తుంది. కొత్త పదచిత్రాలను, పదబంధాలను భావకవులు తీసుకొచ్చారని చెప్తారు. వాళ్ళని సినారె అధిగమించారేమో అన్నంతగా కేవలం తెలుగు పదాలతో వాటిని సాధించారు.

"దరిలేని కడలి కెరలికెరలి ఉరిమి నవ్వేవేళ
వెదురింట తూలి వెర్రిగాలి వేణువయ్యే వేళ
కోరిన కొమ్మకు వేడుక రెమ్మకు కోకిల పుడుతుంటే
నడవని మట్టికి కదలని గుట్టకు అడుగులు పడుతుంటే"

"ఇంకేం కావాలి?" అని తాను పరవశించి మనల్ని పరవశింపజేస్తారు. ఇందులో అంత్యప్రాస సరే - వెర్రిగాలి, కోరిక కొమ్మ, వేడుక రెమ్మలు కొత్త పదచిత్రాలు, పదబంధాలు 'కెరలికెరలి' అనే ద్విరుక్త ప్రయోగం భావస్ఫూర్తికి ఉద్దీపకం.

"ఉనికి లేనివాడవంట"

"ఆ పూలల్లో ఆ రెమ్మల్లో - ఆ లోయల్లో ఆ పాయల్లో"

వంటివి ఎన్నో సినారె గీతాల్లో "తేనెసోకనోరు తీయనయగు రీతి" గా వుంటాయి. వాడవంట-లో 'అంట' అనేది మాండలిక సొగసు గల పదం, అనుట - అంట అవటం భాషా పరిణామం, మాత్రాచ్ఛందస్సులో అందెవేసిన చేయి కావటం వల్ల, లయబద్ధమైన కవితాత్మ గలవారు కావటంవల్ల గీతాలలో అప్రయత్నంగానే పొదుకొని, చిత్తైపోవ, దిమ్మెత్తి, కిమ్మనక, సైదోడు - నీరుకారు - తరగలెత్తు - కుములు వంటివి పదే పదే ప్రవహిస్తూ వుంటాయి.

వచనకవితలో సినారె ప్రయోగాలు అసామాన్యం. తెలుగు భాష వైభవాన్ని ప్రదర్శించారు. అర్థవంతమైన పదచిత్రాలు, అస్పష్టతలేని భావచిత్రాలు సినారె సొత్తు.

ఎన్ని నుడికారాలో ! ఎన్ని నిశ్చయార్థక, ప్రశ్నార్థక, సందేహార్థక, ఆశ్చర్యార్థక వ్యాక్యాలో ! మరెన్ని సూక్తుల్లో! ఇంకెన్ని జాతీయాలో! తెలుగు భాష నాడిని పట్టుకొన్న కవి గదా! మరి సాక్ష్యాలు కావాలా - మచ్చుకి :

"క్రమం కాదు పురోగమనం ముఖ్యమని
అలల్ని చూసైనా నేర్చుకోరేమిటి?"
"రాసే చేతిలో పసవుంటే
బొగ్గుతో రాసిన అక్షరాలు అగ్గిపుట్టిస్తాయి"
"అమ్మలనే అమ్ముకునే వంచకులకు
అమ్మలుకన్న పసిబొమ్మలొక లెక్కా"
"కాలం ముగింట్లో నిలబడి
కాలు దువ్వుతుంది"

ఇలాగే చాలా కవితల్లో "మరి గరి శిఖరాలో!", "గుండె కేంపని?", "అక్షరానువాదమే కదా!" వంటివి సినారె వాచిక సామర్థ్యాన్ని నిరూపిస్తాయి. ఈ నాటకీయ శైలి పాఠకుల్ని ఆత్మీయులుగా చేస్తుంది.

"పిరికిగాలి, చావులోతు, విత్తుకంటి, కసికడుపులు, నెత్తురు గుజ్జులు, మదత మతులు, వెండితెర వేల్పు..." వంటి పదబంధాలు సినారె తెలుగు నుడికడిలి నుండి ఏరుకున్న కొత్త ముత్యాలే! ఎంత ఎత్తు కెదిగినా సినారె తెలుగు మూలాల్ని, పల్లీకరణని విస్మరించలేని సంస్కారి. లేకపోతే పొర్లి, ఓనమాలు, చేదుకొని, చివికి పోతూ, కుమ్మేస్తూ, ఒగురుస్తూ, డీలాపడ్డ, సొగసిర, గడసరి, బజ్జో..." వంటివి సమయోచితంగా ప్రయోగించటం సాధ్యం కాదు. గేయ కావ్యాలలో గానీ, 'విశ్వంభర" మహాకావ్యంలోగాని సినారె రచనా నైపుణ్యం తెలుగు ఎంత కండగల భాషో మనకి విశదీకరిస్తుంది.

కవిత్వంలో మాత్రమే సినారె తెలుగుదనం పరిమళించింది... అనటం పాక్షిక సత్యం. ఆయన పలుకే బంగారం. వచన రచనలో కూడా ఇదే పలుకుబడి, ఇదే తెలుగువాడి, పనివాడినతం దర్శనమిస్తుంది. సిద్ధాంత గ్రంథంలో తళుకులకీ, బెళుకులకీ, సొగసులకీ అవకాశం తక్కువ. విషయ వివేచనకే ప్రాధాన్యం. అరువు తెచ్చుకున్న గుణం కాదు కాబట్టి ఏ ప్రక్రియ చేపట్టినా ఓ పట్టు పట్టడం ఆయన నైజం. "అంగవర్ణన కన్న అంతరంగ వర్ణనకి ప్రాధాన్యం" వంటి వాక్యాలలో చమత్కారం భావప్రకటనా శక్తిని తెలియజేస్తుంది.

గురజాడకి ఉపోద్ఘాతంగా సిద్ధాంత వ్యాసంలోగల ఈ కప్పూరపు గుబాళింపు గమనించండి.

"సాహిత్యము ఏ కొందరి సొత్తో యనుకొన్న కాలములో అది ప్రజల సొమ్మని ఉదారముగా పంచిపెట్టిన సౌమ్యశీలి ఆయన. ఆయన చేతి చలువతో అస్పృశ్యముగా పడియున్న వాడుక భాష అందలమెక్కినది. మెత్తని తెలుగు పలుకు కత్తి వాదరవలె మెరసినది.  వీధి మానిసికి వేదిక లభించినది"

సినారె వ్యాసాలు గానీ, యాత్రా రచనగానీ, మందారమకరందాలు వంటి వ్యాఖ్యానం గానీ పరిశీలిస్తే సినారె తెలుగు పలుకులోగల జిగిబిగి సువ్యక్తమవుతుంది. జాషువా గురించి చాటుతూ అన్న మాటలివి –

"ఈ పద్యం తెలుగువారి నోటి కెక్కింది
హృదయ కోటికెక్కింది"
"ఇటు రక్తికీ అటు ముక్తికీ
మూలకందమైంది ఈ కందం"
"ఈ పద్యాన్ని పిండితే వచ్చే అర్థం ఆవంత
చదివితే ఉదయించే నాదం కొండంత"

డా॥ ఎన్.గోపి ఎంతో శ్రమపడి సినారెగారి ఛలోక్తులు సేకరించి ప్రచురించారు. సినారె సహజ పాండిత్యం, సమయస్ఫూర్తి, చాకచక్యం వాటిల్లో దర్శనమిస్తాయి. తెలుగు పలుకులలో గల శక్తిని సినారె రుచి చూపించారు. 'శబ్దక్రీడ'లో సినారె అందెవేసిన చేయి. సంస్కృతాంధ్రాంగ్ల పదాలతో గమ్మత్తుగా ఆడుకుంటూ కొత్త గొంతుకతో మనల్ని మత్తు హత్తుకున్నట్టుగా తయారుచేస్తారు. అందులో మనం ఒకింత తుళ్ళిపడతాం. 'నోరూరా' రసానుభూతి పొంది సినారె సొగసరి మాత్రమే కాదు 'శబ్ద గడుసరి' అనుకుంటాం:

"రచన వేళ్ళతో కూడుకున్న పని
ప్రచురణ వేలతో కూడుకున్న పని"

"తిమ్మారెడ్డి తతిమ్మారెడ్ల వలె కాదు"
"పరశురాముడు - పర్సురాముడు"
"విద్వత్కవి - విద్యుత్కవి"
నిత్యం వాకింగ్ చేయడటానకి పెట్టిన పేరు - 'గతి వ్రతం'
నఖచిత్ర కారుడిని చూసి - "నఖేనఖే సరస్వతీ॥
"పిహెచ్‌డి పరిశోధనలు ఎత్తి పోతల పథకంగా
మారడం మాత్రమే కాదు - ఎత్తి రాతల పథకంగా మారాయి"

ఈ ఛలోక్తులలో లోకానుభవం వుంది. వాగ్బాణాలున్నాయి. సినారెకి సామాజిక తపనవుంది. సినారె మాటల పరమేశ్వరుడు. తెలుగు పలుకుల గంధర్వుడు. "ఎక్కడ సినారె వుండునో అక్కడ తెలుగు వెలుగు ఉండును" అనటం స్వభావోక్తి అవుతుంది. సినారె తెలుగు పిలుపు విందాం:

"తేనియలకే తీపిపెంచే తెలుగులో మాట్లాడుకో
తెలుగు జాతి సమైక్యగీతి పదే పదే నువు పాడుకో
నాటి నన్నయ మొదలుగా ఈనాటి యువకవి అవధిగా
తరగలెత్తిన తెలుగు కవితల స్వరం నీలో నింపుకో"

# సినారె కవితలు రాగరాజకృతులు

డాక్టర్ కడియాల రామమోహనరాయ్

సురభిళ శబ్దమ్మొక్కటి తరగలెత్తిన చాలు నాయెడంద సందులందు కోటి నందనాలు గుబాళించు" (దివ్య మానవుడు - దివ్వెల మువ్వలు) అని పలికిన డా॥ సి. నారాయణరెడ్డి సౌందర్యానికి అభ్యుదయ భావనకు సమానంగా చోటిచ్చారు. పదప్రయోగ నైపుణిలో పలుకుల పొందికలో సినారె బాణి భావకవులకు దగ్గరగా వుంటుంది. కృష్ణశాస్త్రి గారి, భావన దాశరథి గారి భావప్రకటనా తీవ్రత సినారె కవితలో చక్కగా మేళవించాయి.

'నవ్వని పువ్వు'గా నవ్య కవిత్వంలోకి అడుగుపెట్టిన సినారె "ఆకులు రాలని పూలు వాడని వసంతారామశోభను తన కవితలో చూపారు. తొలినాటి కావ్యాలు వెన్నెలవాడ, విశ్వనాథనాయకుడు, కర్పూరవసంతరాయలు, ఋతుచక్రము, నాగార్జునసాగరము, అక్షరాల గవాక్షాలు, దివ్వెల మువ్వలు, జాతిరత్నం మొదలైనవాటిలో భావకవి ఊహాశాలిత్వము మనసును ఆకట్టుకుంటుంది.

"దుత్తల నెత్తికెత్తుకొని దూరపు చేలకు గాలి తోడ పర్వెత్తెడు కాపు భామలకు, వేగముగా పయనించు మేఘ సంపత్తికి నెంత సామ్యమిసుమంత విభేదమదేదియుండినన్ మొత్తముపై పయోభర సమున్మిషితాంగులుగా దె యిర్వురున్" (వర్షాసుందరి) అని ప్రాచీన కవుల చాటూక్తుల పోలిన పద్య కవిత్వం నుండి వెన్నెలున్నప్పుడు ఇరులనెన్నుకొనుట ఒక అందము".

తీపి గడియలందు చేదు జ్ఞాపకములొక అందము

సంయోగములో విరహ/చ్ఛాయలున్న ఒక అందము ('అందం' - 'అక్షరాల గవాక్షాలు') అని సుకుమారమైన భావనను వెలయించినా "నన్ను త్రాగనిండు విషము/ నాకదియె జీవరసము/ కాకోలమ్మను కొందురో? కాదు కాదు, గుత్తులుగా / పండిన చీకట్లు పిండి వడపోసిన రాగరసము" అని అంతర్ముఖులై "తుమ్మెద సుల్తానుల పద్మధూళినైన నోచుకోని / పూచినవుమ్మెత్త పువ్వు/ నాచషకము నాచషకము" (విషపానం - అక్షరాల గవాక్షాలు) అని గంభీరంగా పలికినా సినారె భాషలో భావనలో పదాల పొందికలో సౌందర్య మధూళి చిందుతుంది.

"ఒక నాట్యకత్తె రొమ్ము కుదింపు గని
బిగించిన వీణవోలె స్పందించి పోయితి గాని
ఆమె గుత్తపురవిక యందు అణగారి పడు

మాతృ భావన లేశమాత్రమ్మెరుగనైతి" అని సౌందర్య దృష్టికి మానవతాభావాన్ని జోడించుకుని కవితకు పుష్టి చేకూర్చుకున్నారు. లయాన్వితమైన పదాలపొందికతో సినారె తొలి కావ్యాలు గానయోగ్యమైనవి.

మాత్రా ఛందోబద్ధమైన సినారె కావ్యాలు రసజ్ఞుల ఆదరాభిమానాల్ని పొందాయి.

ప్రకృతి, ప్రణయం, ప్రబోధాలలో 'సినారె' ప్రణయానికే ప్రాధాన్యమిచ్చారు. ఇరవైయొకటో శతాబ్దంలో సినారె రచించిన ఖండ కావ్యాలలో తాత్త్విక చింతన, మంచినిపెంచే మాటలు చెప్పాలనే తపన కన్పిస్తాయి.

భారత స్వాతంత్ర్యానంతర కాలంలోనే సినారె పేరు తెలుగుపాఠకులకు పరిచయమైంది. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటకాలంలో (1946) ఆయన హైస్కూలు విద్యార్థి. ఉర్దూ మీడియంలో చదువుకుంటున్నారు.

తర్వాత కాలంలో ప్రణయగాథలు, చారిత్రక ఇతివృత్తాలను మాత్రాఛందస్సులలో కావ్యాలుగా రూపొందించారు. గేయ కవిత్వంపై సినారెకు మక్కువ ఎక్కువ.

"రేపటి ఉదయం నాలో

లోపల గుసగుసలాడెను మనిషీ! నీ భవిష్యత్తు మహోజ్జ్వలంగా వుందని" లోకాలోకము - దివ్వెల మువ్వలు) అంటూ సినారె భవిష్యత్తుపై ఆశలు కల్పించారు.

"నింగిలోపల లేవు ఎల్లలు

నీరధిని కనరావు ఎల్లలు / ఎందుకీ ధరణీ తలమ్మున

ఇరుకువాడలు, ఇనుపగోడలు? / అన్ని జాతులు కొకే సూర్యుడు

అన్ని నేలలకొకే చంద్రుడు / అయినచో జాత్యహంకారము

ఆటవికతత్త్వము కాదా" అన్నారు. మనిషికీ మనిషికీ మధ్యన అడ్డుగోడలు తొలగిపోవాలని సినారె ప్రబోధించారు.

గురజాడపై స్తుతి గీతంలో కులమతమ్ముల ఉక్కుడెక్కల / నలిగిపోయెడు మాలలంగని అల్లనాడే కంటనీరిడి/ నట్టి వెన్నెల మనసునీయది" అని కైమోడ్పు ఘటించారు.

శ్రామికుల్ని గురించి పేదలను గురించి రాసినప్పటికి సినారె కావ్యాల్లో మధ్య తరగతి వారి కష్ట సుఖాలు ఎక్కువగా కన్పిస్తాయి. మధ్యతరగతి మందహాసంలో విల్లులావంగిన వెన్నుపూసతోనే విజయదశిమి జరుపుకునే వారి జీవితాన్ని వర్ణించారు. సన్నజాజిపూలమ్మే కుర్రవాడు, 'పసుల పోసి' వంటి బడుగు జీవులు కూడా వారి

రచనలో సజీవ మూర్తులై నిలిచారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఒక పీడకలగా ఆంధ్రదేశాన్ని పట్టి పీడిస్తున్నప్పుడు బాధ్యత యెరిగిన కవిగా ఆయన సమైక్యతను ప్రచారం చేశారు.

"తెలుగుజాతి మనది నిండుగ వెలుగు జాతి మనది / వీర తెలంగాణ నాది వేఱు తెలంగాణ కాదని ఖండితంగా పలికారు. నాలుగు దశాబ్దాల తర్వాత అత్యధిక తెలంగాణ ప్రజలు కోరేది ప్రత్యేక తెలంగాణ రాష్ట్రమైతే అది తనకూ సమ్మతమేనని హుందాగా తెలిపారు.

శ్రీకాకుళంలో ప్రారంభమైన నక్సలైట్ ఉద్యమం ఆ తర్వాత ఉత్తర తెలంగాణకు విస్తరించింది. సమసమాజ నిర్మాణానికి సాయుధ పోరాటమే శరణ్యమని సినారె తలచలేదు. జాతిరత్నం జవహర్‌లాల్ నెహ్రూ ప్రవచించిన ప్రజాస్వామ్య సోషలిజం భారతదేశ పరిపాలనకు అనువైనదిగా సినారె భావించారు.

## ప్రగతిశీల మానవతావాదం

శ్రీ సినారె తన కవితాతత్త్వాన్ని ప్రగతిశీల మానవతా వాదమని పెక్కు సందర్భాలలో తెలిపారు.

"నా పేరు కవి, ఇంటిపేరు చైతన్యం – కవిత్వం నా మాతృభాష. ఇతివృత్తం మానవత్వం" అంటారు సినారె (పూలపాటలు 1952)

'మనిషి – యంత్రం' ఒక విలక్షణ రచన. ఇందులో మొదటిసారిగా ఆయన మానవశక్తిని గుర్తించారు. యంత్రం ఒక మదపుటేనుగైతే/ నీవు మావటివాడవు కావాలి... అణుగోళమ్ములను పిండి / అమృతం ఒలికించాలి / కర్మాగారమ్ములందు కళలను పలికించాలి/ పూలలోని అమాయికత / ఆలంబము కావాలి/ అమృతాంశుని త్యాగశీల మాదర్శము కావాలి" (వెన్నెలవాడ – 1959) "అమృతం పండించే అణు బీజాల నుండి / విషపూరిత మృత్యు సస్యాలను మొలిపిస్తున్న / శాస్త్రజ్ఞులారా / పరమాణువుల రగిల్చి / చరిత్రను పొగచూరనీయకండి (మానవతా ! – జలపాతం) అనటంలో సినారె ప్రగతిశీల దృక్పథం తేటతెల్లమైంది.

మధ్యతరగతి మందహాసం (1968) నాటికి సినారె వచన కవితపై దృష్టిని కేంద్రీకరించారు – మందహాసానికో ఛందస్సుంటుందన్నారు.

"దేవుళ్లను ధిక్కరించే మనుషులుండటం ఈ తరం సాధించిన విజయ" మన్నారు సినారె.

"శ్రమజీవి చెమట బిందువులో / ఆణిముత్యమూ ఉంది/ అగ్ని గోళమూ ఉంది" (నీకూ నాకూ ఏం పోలిక) అని శ్రమశక్తిని గౌరవించారు.

"మంచితనం పచ్చగా ఉండాలి
మనిషి తనం పచ్చగా ఉండాలి
మంచినీ మనిషినీ కాజేసే
వంచన మాత్రం చచ్చుగా ఉండాలి" అనేది సినారె ఆశయం (మనిషీ - చిలక).

సినారె మానవతను గౌరవించినట్లే సంప్రదాయాన్నీ ఆదరించారు.

"అంతకడివెడు పాలపై ఒ
క్కింత మీగడ పేరినట్లుగ
మనకు మిగులును గతములోపలి
మంచి అదియే సంప్రదాయము"

**విశ్వంభర**

సినారె కావ్యాల్లో మకుటాయమానమైనది 'విశ్వంభర'. భారతీయ జ్ఞాన పీఠ పురస్కారం పొందింది. విశ్వంభరలో వస్తువు - మానవుడు కోట్లాది సంవత్సరాలుగా సాగించిన సుదీర్ఘ ప్రయాణం. ఈ ప్రయాణంలో అతడు సాధించిన చైతన్య పరిణామం, వికాస చిత్రణ బహుముఖాలుగా విస్తరించిన అతని శక్తియుక్తులు అతని విజయాలు అపజయాలు సూటిగా తేటగా చిత్రితమైనాయి".

"గుహ నుంచి మహలు దాకా / నడక నుంచి రోదసీ నౌకదాకా/ దివిటీల నుంచి విద్యుద్దీపాల దాకా/ అమ్ముల నుంచి అణ్వస్త్రాల దాకా / ప్రవహించిన సంస్కృతికి మూలహేతువు / మనిషిలో వికసించిన విజ్ఞానధాతువు" అని మానవుని అభివృద్ధి" క్రమాన్ని సినారె వివరించారు.

మానవ ప్రయాణం మూడు ముఖాలుగా సాగింది. కళాత్మకం, వైజ్ఞానికం, ఆధ్యాత్మికం - ఇవి బహిరంగంగా కన్పించే ముఖాలు. మనకు కనిపించకుండా ఆంతరంగికంగా మనసుతో మేథతో ఆత్మతో చేస్తున్న ప్రయాణం వేరే వుంది.

"విశ్వంభరా భ్రమణానికి మూలం / శాశ్వత చైతన్య తేజం" "మానవుడు చైతన్య కేతనుడు కాంతి లహరిలా సాగిపోతాడు" అని సినారె మానవుని మహా ప్రస్థానాన్ని గంభీరంగా వర్ణించారు.

"నా రచనల్లో సామ్యవాదంతో పాటు Progressive humanism ప్రతి ఫలిస్తుంది. విశ్వంభరలో ఈ దృక్పథమే కన్పిస్తుంది" అన్నారు సినారె.

"సృష్టి ఎత్తిన నవయుగకేతనం మీద / మనిషి బొమ్మ / భూగోళమంత నిండుగా నిలుస్తుంది" అని సినారె మానవుణ్ణి అజేయునిగా తలచారు (భూగోళమంత మనిషి బొమ్మ).

సృష్టికైనా దృష్టికైనా పరిణామం అనివార్యం / ఉదయం ఊపిరిలా / ప్రతి మనిషీ అనుక్షణం కరగాలి కదలాలి/ కాలానికి అశ్వగతులు నేర్పుతూ" అని సినారె మానవుడెల్లప్పుడూ పురోగమి అంటారు. "కర్రు కదులుతుంది / కర్రును అదుముకునే నాగలి నడుస్తుంది / నడిచే ప్రతి నాగలీ మనిషే మరి/ మనిషినాడుల్లో పలికే భవితవ్యం చావదు /... విశ్వపటం నుండి ఎప్పుడైనా / మనిషి తుడుచుకుపోయాడా?" అని ఆయన మానవుని మహాశక్తిని కొనియాడారు (మట్టి మనిషీ ఆకాశం) కఠోరవర్ణదుశ్శాసనాలను ధిక్కరిస్తున్న దళితుల శక్తిని కవి యీ కావ్యంలో ప్రశంసించారు.

స్త్రీవాద దళితవాదాలను సినారె పనిగట్టుకొని ప్రచారం చెయ్యలేదు గాని ఆయన కవితల్లో అంతర్లీనంగా యీ వాదాల పట్ల తాదాత్మ్యం కన్పిస్తుంది.

స్వభావతః మనిషి కరుణాళువు. "ఒకోసారి ముళ్లపొదలా గుచ్చుకున్నట్లు అనిపించినా / మనిషిలోని పూలనునుపు మాసిపోదు / ఎక్కడ కన్నీరు తొణికినా తుడిచేయాలనే తహ తహ తనవేళ్లకు" మనిషి కోసం మనిషి స్పందనే మానవత్వమన్నారు.

హితం లేని మతం వ్యర్థమంటారు సినారె. ఆయన విగ్రహారాధకుడుకాడు. ఏ స్వాములవారి పాదాలకు మొక్కరు "మహాత్ములు చచ్చారు మతం కోసం / సామాన్యులు చస్తున్నారు. మెతుకు కోసం / ఎండిన నోటికి చినుకందించలేని / చీలిన గూటికి జిగురందించలేని / మతమెందుకు మహాశయా!" మతం పేరుతో జరిగిన ఊరేగింపులనూ కమలిన శవాల కంపులను తెలిపి మతం కంటె మానవత్వం గొప్పదంటారు (కాలం అంచుమీద).

సినారె విశిష్ట భావసంపుటి 'ప్రపంచపదులు' ఇందులో కవి మనిషి మూలం చూడాలంటే మట్టిబెడ్డను కలుసుకోమంటారు. మానవుడెంత ఎత్తుకు ఎదిగినా

"జన్మించిన సంచి" ని మరువకూడదంటారు.

"పదవికి సాఫల్యం అది ప్రజల మనసుకెక్కినపుడె
తెలివికి సాఫల్యం అది తెరలు చీల్చుకొచ్చినపుడె
చెలిమికి సాఫల్యం అది బలహీనులు మెచ్చినపుడె" అని కవి మానవులకు కర్తవ్యాన్ని బోధించారు.

వర్తమాన సమాజంలో సహనం సభ్యత సంస్కృతి / బతుకు ముంగిళ్లను వదిలేసి ఎప్పుడో పారిపోయాయి / మారణ శక్తుల పాశవిక జ్వాలల్లో మానవాంకురం మసికాక ముందే విష వాతావరణాన్ని విరిచేయాలన్నారు సినారె (మానవాంకురం మసికాకముందే).

మతం పేరుతో మసీదుల్ని మందిరాల్ని కూల్చటం ఘోరమన్నారు సినారె. విశ్వసాక్షి సూర్యుణ్ణి హత్య చేసి మతాన్ని రక్షించుకోమన్నారు నిష్ఠూరంగా (గాయపడ్డ సూర్యుడు).

జాతిపిత బాపూ అంటే సినారెకు అపరిమితమైన అభిమానం "బాపూ నీ పుట్టినరోజు

భగవానుడు పుట్టినరోజు
ఒక రాముడు పుట్టినరోజు
ఒక రహీం పుట్టినరోజు
చావులేని పుట్టుకలేని
సత్యమూర్తి పుట్టినరోజు" ఇంకా

"ఆలయాన దాగిన దేవుని / అస్పృశ్యులు, ముట్టినరోజు / హరిజనుడై పుట్టినరోజు / హరిజనుడే పుట్టినరోజు".

గేయ రచనలోనేగాక సినారె గేయనాటికా రచనలోను మేటి. హైదరాబాదు ఆకాశవాణి ప్రసారం చేసిన రామప్ప, అజంతాసుందరి, వెన్నెలవాడ, దివ్వెల సంగీతం శ్రోతలను అలరించాయి.

ఋతువర్ణనలు కవులకు సర్వసాధారణమే. సినారె ఋతుచక్రంలో లోకపరిశీలన, దృశ్యాన్ని పరికించిన తీరు మనోజ్ఞమైనది". ఇసుకలోన త్రుటిలోపల రసజగత్తులను సృజించి / పిసికివేయు వింత శక్తి పిన్నలకే మనకెక్కడ?" ఆకాశవాణి ఈ మాసపు పాట పేరుతో చాలా పాటలు ప్రసారం చేసింది. ప్రతి దినమూ ఒకే పాటను ప్రసారం చేయటం వారి సంప్రదాయం. సినారె "కాలం పిలుస్తున్నది" పాట విన్నవారు దాన్ని ఎప్పటికీ మరచిపోరు.

"కాలం కేలెత్తి పిలుస్తున్నది
కంకాళం లేచి నడుస్తున్నది
పొగచూరిన బ్రతుకులతో
పొగిలిన నరజాతి ధరా
గగనాలకు వంతెన కడుతున్నది....
పొలిమేరలు తుడుచుకు పోతున్నవి
సరిహద్దులు ముడుచుకు పోతున్నవి
గాలివోలే పరిమళాల
జాలువోలె, భిన్నదిశా
పాళికి కొంగులు ముడిపడుతున్నవి"

సుప్రసిద్ధరచయిత త్రిపురనేని గోపీచంద్‌ని మాట్లాడేమౌనిగా సినారె అభివర్ణించారు". నడిమి తరగతి సమాజం నడక తెగిపోయినప్పుడు / జడిచచ్చిన జీవితాలు ముడుచుకపోయినప్పుడు / నాలో ధ్వనిస్తుంది నీ ఆర్తి. నక్షత్రాల కళ్లు మిలమిలా మెరుస్తున్నప్పుడు / నందివర్ధనం పూలు గలగలా నవ్వుతున్నప్పుడు / నాకు స్ఫురిస్తుంది నీ మూర్తి" అని గోపీ చంద్ వ్యక్తిత్వాన్ని రచనా తత్త్వాన్ని చక్కగా వెల్లడించారు. ఒక పెద్ద వ్యాసం తెల్పవలసిన విషయాలను సినారె అలవోకగా అల్పాక్షరాలలో తెలిపారు.

ఆంధ్రప్రదేశ్ అవతరణ (1956) సమయంలో రాజధానిని ఆంధ్రులందరికీ పరిచయం చేస్తూ "ఇది హైదరాబాదు ఇది హైదరాబాదు

ఇది భిన్న సంస్కృతులు ఎదిగి పూచిన పాదు" అన్నారు.

అర్థశతాబ్దం తర్వాత కూడ హైదరాబాదు తెలంగాణ సంస్కృతినే గాక భిన్న సంస్కృతుల మేలు కలయికగా భాసిస్తున్నది.

కొండను అద్దంలో చూపినట్లు ఆంధ్ర సంస్కృతీ వైభవాన్ని సినారె తరతరాల తెలుగు వెలుగు నృత్య గేయరూపకంలో కొనియాడారు (స్పందన సాహితీ, సమాఖ్య మచిలీపట్టణము ప్రచురణ - 1975) ఈ రూపకం ఇప్పటి తెలుగు రాష్ట్రాలు రెండిటిలో విద్యాలయాలలో ప్రదర్శించవలసిన ఉత్తమ నాటకం.

సినారె తన జీవితకాలంలో తాను నడిచివచ్చిన త్రోవను ఎల్లప్పుడూ గుర్తు చేసుకునేవారు. "పదుగురు పాలేర్లున్నా / పదరా అని మానాయన / మల్లన దున్నిన రేగడి మట్టికి ఈ సన్మానం" (యాభయ్యోజన్మదినోత్సవం).

"వాలుకుర్చీలో వాలిపోయిన పరమవృద్ధుడిలా వున్నాడు/ అస్తమయ సూర్యుడు / సాగినంత కాలం ఓవెలుగు వెలిగాడు" / - మనిషి కూడ అంతే" - పుట్టినప్పుడు బోసినవ్వుల బుడగ / పెరిగిన కొద్దీ కణకణలాడే నిప్పులముద్ద / అవసానంలో నడుం విరిగిన వింటి బద్ద" - వార్ధక్యం / మనిషిని వాలుకుర్చీకి అంటించినా / ఆలోచనల్లో మాత్రం/ ఉదయ సూర్యత్వం వుండిపోవాలని ఆశిద్దాం" అని సినారె అన్నారు. (వాలుకుర్చీలో) ఆలోచనల్లో చివరివరకు ఉదయ సూర్యుడే సినారె.

"రాసిందేదైనా ఒక రాశి పోస్తుంటాను

జల్లెడ ఊపుల కాగిన సరుకే ఇస్తుంటాను" (కలం సాక్షిగా)

'సినారె గజల్లు'లో కొన్ని ఆలోచనామృతమైన పంక్తులున్నాయి. చిన్న దీపమని అనుకోకు అది చీకటినే కాల్చేస్తుంది

జనమేంచేస్తుందని అనుకోకు అది జాతకాలు మార్చేస్తుంది.

ఎంత తెగించిన సాహసమో నినదించే ఊరేగింపులకు

వట్టి పిడికిలే అనుకోకు అది చట్టాలను పేల్చేస్తుంది
గాలేంచేస్తుందని అనుకోకు అది ప్రపంచాన్ని కుదిపేస్తుంది
– కవితేంచేస్తుందనుకోకు అది కత్తులనే నరికేస్తుంది".

సినారెకు తన తల్లి ఫొటోలేకపోవటం తీరని వెలితిగా తోచేది 'అమ్మబొమ్మ' కవితలో

"అమ్మ పోతూ పోతూ తన బొమ్మ ఇచ్చిపోలేదు
అసలు బొమ్మంటూ తీస్తే గదా ఇవ్వటానికి
అమ్మా బొమ్మ దిగవే అంటే
ఆణిముత్యంలా నవ్వేసేది
నువ్వు నా బొమ్మవుకాదా నాన్నా అంటూ
నన్ను తన అక్కున చేర్చుకున్నప్పుడు
ఆకాశమే నాలో ఇమిడిపోయినట్టనిపించేది...
కళ్లుమూసుకొని చూస్తే అమ్మబొమ్మ అలుక్కుపోతూంది
చినుకులుపడ్డ రంగులచిత్రంలా" తోచింది. పోనీ అమ్మ
బొమ్మ గీద్దామనుకుంటే తాను పదచిత్రకారుణ్ణేగాని చిత్ర
కారుణ్ణి కానని తెలిసి వచ్చింది.

## సినారె సినిమా పాటలు

తెలుగు సినిమాలకు సినారె వేలకొలది పాటలు రాశారు.

పాట ఎంత బాగా రాసినా పాటగొప్పదనమంతా కవికి చెందదు.

కథలో రచయిత కల్పించిన సన్నివేశానికి దర్శకుడు చెప్పినట్లు రాయాలి. సంగీతదర్శకుడి బాణీలకు అనువుగా మార్పులు చేయాలి. ఒక్కొక్కప్పుడు సంగీత దర్శకుడు ముందే రూపొందించిన బాణీకి అనుగుణంగా మాటలు పొదగాలి. మరొకప్పుడు ఇతర భాషలో కవి రాసిన పాటను నేర్పుతో తెనిగించాలి. ఇన్ని కష్టాల మధ్య వేలాది సినిమా పాటలు రాసి అగ్రశ్రేణి సినిమా పాటల రచయితగా సినారె కీర్తి గడించారు.

"తోటలో నారాజు తొంగి చూచెను నాడు",

"గున్నమామిడి కొమ్మమీద గూళ్లు రెండున్నాయి",

"ఇంకా తెలవారదేమి ఈ చీకటి విడిపోదేమి" మొదలైన పాటలు రసజ్ఞుల ఆదరంపొందాయి.

"నవ్వులా అవి? కావు రవ్వంత సడిలేని రసరమ్య గీతాలు" అనే పోలిక తెలుగు కవిత్వంలోనే అపురూపమైనది.

**వచన రచన**

సినారె గేయము, వచన కవితలలోనేగాక చక్కని వచన రచయితగా కూడా తన ప్రతిభ చూపారు. ఆధునికాంధ్ర కవిత్వం, మా ఊరుమాట్లాడింది, వ్యాసవాహిని; మందారమకరందాలు; సమీక్షణం సంపుటాలు ఆయన వ్యాసాలు విజ్ఞానదాయకమైనవి.

86 ఏళ్ల వయస్సులో కూడ యువ కవులతో పోటీపడినట్లు సమకాలిక సంఘటనలకు స్పందిస్తూ కవితలు రచించారు.

ఆరోగ్యాన్ని సినారె ఎప్పుడూ అశ్రద్ధ చేయలేదు. మృత్యువుకు భయపడి ఏ దేవుడికి మొక్కుకోలేదు. "మాటకు దండం పెడతా/ పాటకు దండం పెడతా/ అట్టడుగు మనిషి కాళ్లకు గజ్జలు కడతా" నంటూ మానవతకే తన కవితలో పట్టం గట్టారు.

సాహిత్యరంగంలో తన ముందుతరం కవులను సంభావించారు. సమకాలికులలో ఎవరి రచన నచ్చినా తరతమ భేదాలు చూడకుండ ప్రశంసించారు. యువకవులనత్యంత ప్రోత్సహించారు.

ఉన్నత పదవుల నిర్వహణలో పదవికి వన్నె తెచ్చేలాగ నడచుకున్నారు. ఆపదలో వున్నవారికి తన పరిధిలో సహాయం చేశారు.

సినారె కవిత చిరంజీవి - ఆధునికాంధ్ర సాహిత్యంలో సినారె ఒక మహోన్నత శిఖరం.

# వెలుగులు పంచిన సన్నని దీపికలు సినారె గజళ్లు

డాక్టర్ వెలివోలు నాగరాజ్యలక్ష్మి

ప్రవేశిక :

"ఎడారి దిబ్బలు దున్నితే ఫలమేముందనకు
ఇసుకుల గుండెలు పగిలితే అది పైరవుతుంది"

అని గానం చేస్తూ గజల్ రచన ద్వారా మనిషి అంతరంగంలో చైతన్యపు వెలుగులు నింపిన, వ్యక్తిత్వాలను వికసింపచేసిన మానవతావాద కవి ఆచార్య సింగిరెడ్డి నారాయణరెడ్డి గారు.

జీవనది లాంటి తెలుగు సాహిత్యానికి నిండైన ప్రవాహం వంటివారు. అనంత జీవకోటికి జీవనది ప్రాణశక్తి. ఆధునిక తెలుగు సాహిత్యానికి ఆయన ప్రాణశక్తి. తెలుగు సాహిత్యాన్ని జ్ఞానపీఠంపై అధివసింప చేసిన అక్షర బ్రహ్మ.

పాఠశాల విద్యాభ్యాస కాలంలోనే నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన విద్యార్థుల సత్యాగ్రహంలో పాల్గొన్నారు. "మారాలి, కరడుగట్టిన నేటి కరకు సంఘపు రంగు మారాలి" అంటూ దేశభక్తి పూరితమైన పద్యరచన చేశారు.

తొమ్మిదోతరగతి చదువుతున్నప్పుడు రచించిన "మారుటెన్నడో – విషంపు గుండెలీ జగాన, మారుటెన్నడో" గేయం వారి దేశభక్తి తత్పరతకు నిదర్శం. తెలుగులో కథాత్మక దీర్ఘకావ్యరచనను చేపట్టి "నాగర్జునసాగరం, కర్పూర వసంతరాయలు వంటి రచనలు చేశారు. వీరి సిద్ధాంత గ్రంథం "ఆధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు – ప్రయోగములు" పరమ ప్రామాణికం. పద్యం, గేయం, వచనం, పాట గజల్, ద్విపదలు, ప్రపంచపదులు, బుర్రకథ, యాత్రాచరిత్ర, చలనచిత్రగీతాలు వంటి పలుసాహిత్య క్రియలలో రచనలు చేసిన సృజనశీలి సి.నా.రె.

**సాహిత్య ప్రక్రియగా గజల్ :** పారశీ, అరబీ, ఉర్దూ భాషాసాహిత్యాల్లో చక్కని గేయరచనగా రూపుదిద్దుకున్న ప్రక్రియ గజల్. గజల్ తొలినాళ్ళలో సూఫీతత్త్వాన్ని అనంతరం ప్రేయసీ ప్రియుల సంయోగ వియోగాలు, వారి అనుభవాలను, భావాలను కవితాత్మకంగా తెలుపుతూ సాగింది. 5 లేక అంతకంటె ఎక్కువ ద్విపదల కూర్పు గజల్. షేర్, మత్లా, ముఖ్తా, మిస్రా, రదీఫ్, కాఫియా అనే ఛందోనియమాలు కలిగిన ప్రక్రియ. రెండేసి పంక్తులలో ఒక్కొక్క భావం వ్యక్తీకరింపబడుతుంది. ఆ భావం తరువాతి షేర్‌లోనికి విస్తరించదు. ఈ ద్విపద దోహా అనికూడ వ్యవహరింపబడుతుంది.

'గజల్' అనే పదానికి ప్రియురాలితో ఏకాంతంగా జరిపే ప్రణయ సల్లాపం అని నైఘంటికార్థం. దీని లక్షణాన్ని వివరిస్తూ గుంటూరు శేషేంద్రశర్మగారు ఈ విధంగా పేర్కొన్నారు :

"గజల్ మానవ స్వభావాలపైన నాజూకుగా పనిచేస్తుంది. ప్రేమ, దుఃఖం, దైన్యం, వాంఛ, అవమానం, కరుణ ఇత్యాది భావాలపై సాగుతుంది. అందువలన శ్రోత గజల్‌లో ఉన్న భావాన్ని స్వీకరిస్తాడు. కొన్నిసార్లు ద్రవిస్తాడు" – కాలరేఖ.

కవిత్వంగా ప్రయాణం ప్రారంభించిన గజలు ఒక సంస్కృతిగా మారిందని, శక్తిమంతమైన సాహిత్య ప్రక్రియగా నిలదొక్కుకుందని శేషేంద్రశర్మ గారి అభిప్రాయం.

గజల్‌లో మొదటి షేర్‌ను 'మత్లా' అని, చివరి చరణాన్ని 'మఖ్తా' అని వ్యవహరిస్తారు. పల్లవి చివర ఉన్న పదం ప్రతి చరణం చివర అంత్యప్రాసగా ప్రయోగింపబడుతుంది. కొన్నిటిలో అంత్యప్రాసకు ముందు మరో ప్రాసపదం ఉంటుంది. వీటిని రదీఫ్, ఖాఫియాలంటారు. చివరి చరణంలో కవినామముద్ర ఉంటుంది. దీన్నే 'మఖ్తా' అని 'తఖల్లుస్' అని వ్యవహరిస్తారు.

వాగ్గేయకారులు రచించిన భక్తి సంకీర్తనల్లో చివరి చరణంలో కొన్ని ముద్రలు ప్రయోగింపబడ్డాయి. త్యాగరాజు, జయదేవుడు, నారాయణతీర్థులు, రామదాసు స్వీయనామ ముద్రలను తమ గీత రచనల్లో ప్రయోగించి పాడుకున్నారు. క్షేత్రయ్య, ముత్తుస్వామిదీక్షితులు, అన్నమాచార్యులు తాము పూజించే ఇలవేల్పుల నామ ముద్రలతో కీర్తనలు రచించారు. సదాశివబ్రహ్మేంద్రుల వారు "పరమహంస" ముద్రతో కీర్తనలు కూర్చారు. తులసీదాసు పాడిన హనుమాన్‌చాలీసా చివరి దోహాలో కవినామం జోడింపబడింది. దైవభక్తి సంబంధమైన కృతుల్లో, కీర్తనల్లో చివరి చరణంలో ప్రయోగింపబడిన ముద్ర మనిషి అంతరంగంలోని వివిధ భావాలను తనకుతానే వెల్లడించుకొనే గజల్‌లో ప్రాముఖ్యం వహించింది.

**గజల్ – వస్తు పరిణామం :** అభ్యుదయ కవిత్వోద్యమం ప్రారంభమైన కాలంలో 1930వరకు ప్రేమ, వియోగం, వేదన, మధుపాదం, నిరాశ, నిస్పృహ వంటి వస్తువులకే పరిమితమైన గజల్ కాలక్రమేణ వస్తు వైవిధ్యాన్ని పొందింది. సాంఘిక సంస్కరణలు, స్వేచ్ఛాప్రియత్వం, అధిక్షేపం, హాస్యం, మనవతా దృక్పథం, తాత్త్వికత మొదలైన అంశాలు గజల్ రచనకు వస్తువులయ్యాయి.

గజలుపై అమిత ప్రభావం చూపించినది సూఫీతత్వం. ఇది గజల్‌లో మానవతను, కరుణరసాన్ని, భక్తిభావాన్ని నింపింది. ప్రేయసీ ప్రియుల లౌకికమైన ప్రేమ భావనను వర్ణించే గజల్‌ను 'మజాజీ' అని భక్తునికీ, భగవంతునికే నడుమ ఉండే పారలౌకిక

ప్రేమను ప్రతిబింబించే గజల్‌ను 'హకీకి' అని వ్యవరిస్తారు. సూఫీ గజల్‌లో ప్రధానంగా కనిపించేది ప్రకృతి ఆరాధన. దీనిలో రాగాద్వేషాలకు, భౌతికమైన ఆకర్షణలకు తావుండదు.

ఉర్దూ సాహిత్యంలో మిక్కిలి ఆదరణ పొందిన గజల్ ప్రక్రియ సోయగాలకు దాశరథి వంటి కవులు ఆకర్షితులై తెలుగులో తొలుత ఉర్దూ నుండి అనువాద రూపంలోనూ, అనంతరం స్వతంత్ర రీతిలోనూ గజల్ రచన చేపట్టారు. ఉర్దూభాషా సాహిత్యాల మర్మమెఱిగిన మహాకవి సి.నారాయణరెడ్డి ప్రారంభంలో ఉర్దూ గజల్ రచన చేశారు. తెలుగుభాషా మాధుర్యాన్ని గజల్ ప్రక్రియ ద్వారా తెలుగువారికి మరింత చేరువ చేయాలన్న తలంపుతో స్వతంత్ర గజల్ రచన చేట్టారు. ఉర్దూ సంస్కృతి సహితం నివ్వెరపోయే రీతులను సి.నా.రె గజళ్ళతో అనుసరించారు. గజల్ నియమాలను తెలుగులో ప్రవేశపెట్టి అందమైన గజళ్ళను రచించారు.

**సి.నా.రె గజళ్ళు :** సి.నా.రె రచించిన గజళ్ళలో తఖల్లుస్ (ముద్ర) 'సి.నా.రె' కొన్ని గజళ్ళు ఆత్మాశ్రయరీతిలో భావ కవితా ధోరణితో సాగాయి. కొన్ని గజళ్ళు తమను తామే వేరొకవ్యక్తిగా భావించుకొనే రీతిలో తాత్త్విక ధోరణిలో రచింపబడ్డాయి. వీరు రచించిన 'తెలుగు గజళ్ళు' సంపుటి ప్రారంభంలో సి.నా.రె తమ రచనా లక్ష్యాన్ని నిర్దేశించుకున్నారు.

"ఉర్దూభాషలో గజల్ ఒక కమనీయ కవితాలహరి. ఒక గులాబీ గుళుచ్ఛం. ఒక మత్తకోకిల రసొత్తకూజితం. సరసభావన, చమత్కారఖేలన, ఇంపూ, కుదింపూ గజల్ జీవ లక్షణాలు. అది జోల పాడుతుంది. జ్వాలరేపుతుంది.... నా తఖల్లుస్"

"నా గజళ్ళలో ప్రణయానికి బదులుగా మానవీయ దృక్పథాన్ని, ప్రగతిశీలాన్ని, మెత్తని అధిక్షేపాన్ని ప్రవేశపెట్టాను. పదం నాదంగా, భావం రాగంగా, అనుభూతి స్వరరీతిగా గుండెతో నేను పలికించినవి ఈ గజళ్ళు"

తమ నిర్దిష్ట లక్ష్యానుగుణంగా సి.నా.రె. గుండెలో గానం చేసిన గజళ్ళు చైతన్యపు కాంతులను విరజిమ్మిన దీపికలు. వీరి గీతికల్లో సుప్రసిద్ధమైన "పరులకోసం పాటుపడని" మొదలైన ఆరుగజళ్ళును సి.నా.రె స్వయంగా గానం చేశారు. ఇవి అమితమైన ప్రజాదరణ పొందాయి.

**సి.నా.రె. గజళ్ళు – వ్యక్తిత్వ వికాసం :** మనిషి సంఘజీవి కనుక సాటివ్యక్తులతో సత్సంబంధాలు కలిగి ఉండాలి. ఇతరులకు కష్టం కలిగినప్పుడు హృదయపూర్వకంగా స్పందించాలి. తనవలెనే ఇతరులను సహితం ప్రేమతో ఆదరించాలి.

"ఆత్మవత్సర్వభూతాని" అనే ఉపనిషద్వాక్యం ఈ అర్థగౌరవాన్ని ప్రతిపాదిస్తుంది. పరోపకార గుణాన్ని, మానవ సంబంధాలను సి.నా.రె తమ గజళ్ళతో ఆర్ద్రతాభూయిష్ఠంగా వర్ణించారు.

"పరుల కోసం పాటుపడని నరుని బ్రతుకు దేనికని?
మూగనేలకు నీరందివ్వని వాగు పరుగు దేనికని?

.....
ఆదర్శాలకు నోళ్ళు చాలవు ఆశయాలకు పైళ్ళుచాలవు
పదపదమంటూ పలుకులెగానీ కదలని అడుగు దేనికని?"
లోపలి నలుపు 'సి.నా.రె'కు తెలుసు పై పై తొడుగు దేనికని? (– తెలుగు గజళ్ళు – 3.)

మానవత్వంలోని ఔన్నత్యాన్ని కవి దీనిలో పేర్కొన్నారు. ఆ ఔన్నత్యం మనిషికి ప్రకృతే అందిస్తుంది. వాగులు, వంకలు, ప్రవహిస్తూ నేలను సస్యశ్యామలం చేస్తాయి. ప్రకృతిలోని పరోపకార గుణాన్ని మనిషి స్వీకరించాలి. శుష్కమైన ఆదర్శాలు వల్లిస్తూ, ఆశయాలను కాగితాల మీద నడిపించటం సరికాదని ఆశయాల సాధనకు అడుగు కదపటమే మానవత్వం' అని కవిభావన. సున్నితమైన పుష్పాలు సూదిపోటులను ఆహ్వానించి బాధ అనుభవిస్తూనే పరిమళాలు వెదజల్లుతాయి.

"ఎంత చీకటి కాల్చెనో ఇంత చల్లని తారక
ఎంత వెలుగును పంచెనో ఇంత సన్నని దీపిక"
ఏరుదాటితె ఎవరువారే ఏమిలోకం ఓ సినారె!
ఎంతనటన భరించెనో ఇంత పల్చని జీవిక – 2

రెండు పరస్పర విరుద్ధమైన భావాలను, గుణాలను ఈ గజల్‌లోని మొదటి చరణంలో సంయోజన చేసి ఒక అందమైన భావచిత్రం గీశారు. "చీకటిని కాల్చేయటం, వెలుగును పంచటం" అర్థవంతమైన క్రియాపదాలు పదాల కూర్పులోని ఔచిత్యం ఈ గజల్‌కు ప్రాణం పోసింది. మనిషిలో గూడుకట్టుకున్న స్వార్థాన్ని తలచుకొని వేదన చెందటం కన్పిస్తుంది. మనిషి జీవించే స్వల్పకాలంలో చూపించే అంతులేని నటనను వ్యంగ్యంగా నిరసించారు.

మనిషి మానవత్వం నుండి దైవత్వం దిశగా పయనించినప్పుడు కోవెలలు ఎందుకు? అని సూటిగా ప్రశ్నించారు. కోవెలల్లోనూ, పుణ్యక్షేత్రాలలోనూ మాత్రమే దైవం లేదు. ఎవ్వరి హృదయం సమత, మమతలకు అలవాలమో అక్కడే దైవం నివసిస్తాడనే మానవతా దృక్పథాన్ని సినారె వ్యక్తం చేశారు.

"ఇందరు మనుషులు దేవతలైతే ఎందుకు వేరే కోవెలలు?
ఇన్ని మనసులూ గీతికలైతే ఎందుకు వేరే కోయిలలు?
దయకురిపించే తలపే తీయన లయపలకించే చూపే తీయన
ఇన్ని మధురిమలు ఎదలో నిండగ ఎందుకు వేరే తేనియలు?" - 6

జీవన ప్రస్థానంలో ఎన్ని అడ్డంకులు ఎదురైనా చలించక మనిషి తన గమ్యం చేరుకునే ప్రయత్నం కొనసాగించాలి. అపజయం కలిగినప్పుడు అదే విజయానికి సోపానంగా భావించి ముందంజవేయాలి. ఆకాశమే సరిహద్దుగా అభివృద్ధిచెందాలి. వ్యక్తిత్వవికాస బోధకులు బోధించే సూత్రాలను మధురమైన సంభాషణారీతిలో గానం చేశారు. మానవత్వం విలువను చాటి చెప్పారు.

"పిడుగులేవో పడతాయని గడియ గడియకూ ఆగకు
ఎదుట చూడు ఆకాశం ఎంత ఎగిరితే అంతగ
జాగా కరువైనట్టుగా మూగిన చోటే మూగకు.
అంతటి నాయకుడివైతే గొంతెత్తుము నడివీధిని
విరిగిన వ్యక్తిత్వంలో బురఖామాటున దాగకు. - 28

మహానాయకులైనా వ్యక్తిత్వాన్ని కోల్పోయినప్పుడు విలువలను కోల్పోయినట్లే. మనిషికి మనిషితనం ఎంత అవసరమో పదేపదే గుర్తుచేశారు సినారె.

"కనుదారుల ముసిరే చీకటిలో ఒక మిణుగురు పురుగేచాలు
కణమైనా కదలని వేకువలో ఒక గునగున పరుగేచాలు - 18

ఈ లోకంలో ఒంటరియై పయనిస్తున్న బాటసారి ఏ ప్రలోభాలకూ లోనుకాక కనిపించే చిరుఆశాకిరణాన్నయినా వెలుగుదారిగా భావించి పయనించాలి. లక్ష్యసాధనకు ఆత్మస్థైర్యమే శ్రీరామరక్ష. నిరాశా నిస్పృహలతో గమ్యం తెలియకతిరిగే యువతకు ఈ గజల్ చక్కని మార్గనిర్దేశక మంత్రం. మానవత్వపు పరిమళాలను సినారె గజల్స్‌లో పలురీతులుగా వర్ణించారు. లోక కళ్యాణకాంక్షతో ప్రజోపకారిగా బ్రతకాలని సమాజానికి ప్రబోధించారు. కులతత్వం కంటె మానవత్వం మిన్న అని చాటారు.

"ఏ కులము వెన్నెలది?" అని సూటిగా ప్రశ్నించారు. 'గాలికీ కులమేది' అని ఋజువు చూపించారు. ఆపదలనే చీకట్లు తొలగిపోయి విజయాల వెలుగులు ప్రసరించేవరకు ధైర్యం వహించాలన్న మహత్తరమైన సత్యాన్ని ప్రవచించారు.

"మంచు పొరలుండేవి మరికొన్ని నిమిషాలే
ఆ పిదప నిండేవి ఆదిత్య కిరణాలే" - 22

అని స్ఫూర్తిని నింపారు. "మంచుపొరలు కమ్మితే సూర్యోదయమాగునా" అని సూర్యోదయంతో పాటుగా వ్యక్తిత్వ ఉదయాన్ని కాంక్షించారు.

**తెలుగుభాషాభిమానం :**

"తెలుగుజాతి మనది నిండుగ వెలుగుజాతి మనది" అని చలనచిత్రగీతం ద్వారా తెలుగుజాతి, భాషావైభవాన్ని గానం చేసి భాషాభిమానుల హృదయాలను చూరగొన్న సినారె గజళ్ళలో తెలుగుభాష తీయదనాన్ని, తెలుగు ఆవశ్యకతను పలురీతుల ఆలపించారు. తెలుగుపాటకు ఆయన చిరునామా. తెలుగుతనానికి ఆయన ఎనలేని ధీమా అని ప్రశంసలందుకున్నారు.

"ఆత్మలను పలికించేదే అసలైన భాష
ఆ విలువ కరువైపోతే అది కంఠశోష - 5

మాతృభాష ఆత్మసదృశమైనది. విలువలను కాపాడేది స్వచ్ఛమైన భాష. పదప్రయోగంలో, వస్తువర్ణనలో, అంత్యానుప్రాస కూర్పులో తెలుగు భాషమీద సినారెకున్న అధికారం, మమకారం సుస్పష్టం అవుతుంది.

"పలుకున్న కావ్యం అనంతం అనంతం
ప్రతిసారి నవ్యం వసంతం వసంతం - 6

మనోహరమైన అర్థాన్ని ప్రతిపాదించే పలుకే కావ్యగౌరవం పొందుతుంది. "రమణీయార్థ ప్రతిపాదకఃశబ్దః కావ్యమ్" అనే అలంకారికుల కావ్య నిర్వచనం వసంత ఋతువులోని ఆహ్లాదాన్ని పంచిపెట్టగలిగిన లలితమైన పదజాలంతో సినారె దీనిలో వర్ణించారు.

"అనురాగమే జీవమైతే సినారే
పెనుశైలమైనా లతాంతం లతాంతం"- 7

శబ్దార్థాలు, అలంకారాలు అపురూపమైన శైలూషిలా వీరి రచనలు నాట్యమాడాయి.

మధురమైన తెలుగుభాష గురజాడ గుండెగా, గిడుగు గొడుగు అండగా జంగసాచి నడవాలని, పరిపాలనలో చోటు చేసుకోవాలని తపించారు. 1981 నుండి 1985 వరకు ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం అధ్యక్షులుగా పదవీబాధ్యతలు నిర్వర్తించిన సినారె తెలుగుభాషా ప్రాచుర్యానికి ఎనలేని కృషి చేశారు.

"పరిపాలనలో తెలుగు పెరగాలిక నిండుగా
ఏమమ్మా తెలుగమ్మా ఎక్కడ నీ చిరునామా
గుబాళించి పోనీ నీ కొప్పు మల్లెచెండుగా",
పలురుచులను మరిగిన మా తెలుగుజాతి ఓ సినారె!
పులకించాలిక తెలుగుపలుకే కలకండగా" - 32

అనిభావించారు. 1989 నుండి 1992 వరకు పొట్టి శ్రీరాములు తెలుగు

విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవి నలంకరించి తెలుగుకు పట్టం కట్టారు. విశ్వవిద్యాలయానికి యు.జి.సి. గుర్తింపు సాధించారు. ప్రప్రథమంగా తెలుగులోనే స్నాతకోత్సవం నిర్వహించారు. పరిపూర్ణమైన మమకారంతో తెలుగువైభవాన్ని గజల్ పాడుకున్నారు.

**మాతృప్రేమ మాధుర్యం :** కలంపట్టి కవిత చెప్పిన ప్రతీకవీ తల్లి గొప్పతనాన్ని వర్ణిస్తాడు. తన అనుభవాన్ని రంగరించి మాతృప్రేమ మాధుర్యాన్ని అక్షరీకరిస్తాడు. "పొడిచే పొద్దులో ఉందేమో నన్ను నిద్రలేపిన అమ్మ ఆకృతి" అని "అమ్మబొమ్మ" కవితలో పలికిన సినారె గజల్‌లో మాతృమూర్తి ఔదార్యాన్ని అద్భుతంగా చిత్రించారు.

"అమ్మ ఒక వైపు – దేవతలంతా ఒక వైపు
సరితూచమంటే నేను ఒరిగేను అమ్మవైపు" - 8

మహాభారతంలోని శకుంతలోపాఖ్యానంలో దుష్యంతుడు శకుంతలను తిరస్కరించినప్పుడు ఆమె సత్య మహత్త్వాన్ని దుష్యంతునికి తెలిపింది.

"వెలయంగ నశ్వమేధం
బులువేయును నొక్క సత్యము నిరుగడలం
దులనిడి తూపగ సత్యము
వలనన ములుసూపు గౌరవంబున పేర్మిన్ (భార అది 4-95 ప)

వేయి అశ్వమేథయాగాల ఫలితాన్ని, ఒకే ఒక్క సత్యవాక్ఫలితాన్ని తులలో తూచినప్పుడు సత్యంవైపే ముల్లు వంగుతుంది. సత్యవాక్యం అంతటి మహత్తర మైనది. సరితూచటం అనే భావాన్ని సినారె తల్లి వైశిష్ట్యాన్ని వర్ణించిన సందర్భంలో స్వీకరించారు. ఇది సినారె ప్రాచీన సాహిత్య పరిజ్ఞాన నిరూపకం. ఒక వైపున "అమ్మవైపు, అమ్మప్రాంపు" ఇది అంత్యప్రాసలతో సాగిన ఈ గజల్

"మెరిసే ప్రభాత కిరణంలా విరిసే వసంతకుసుమంలా
పెరిగే సినారె బ్రతుకులో దొరికింది అమ్మప్రాపు"

అని ముగిసింది. తల్లి ప్రాపు లభించటం లోకంలో ఎవరికైనా ఆనందదాయకమే. కవితాత్మక ప్రతిభను వెలయించిన ఈ గజల్ అమ్మ కవితల్లో తలమానికం.

**అలంకార వైభవం :** గజల్ రచన శబ్దాలంకారపు, అంత్యప్రాసాలంకారపు సొబగులతోనే ఆసాంతం కవిత్వసౌందర్యాన్ని నింపుకుంటుంది. సినారె గజళ్ళలో అనుప్రాసాలంకారమే కాక వివిధ భావవ్యంజకాలైన అలంకారాలు అనేకం చోటుచేసుకున్నాయి.

"మనసైన స్నేహం మరుమల్లెచెండు
ఎదలేని మోహం అది గాలిదిండు" - 13

స్నేహానికి మరుమల్లెచెండుకు, మోహానికి గాలిదిండుకు అభేద రూపకంతో ఈ గజల్ రసవత్తరమైనది. పరిమళ భరితమైన స్వచ్ఛమైన స్నేహం చిరకాలం వర్ధిల్లుతుంది. గాలిదిండు వంటి మోహం ఏచిన్న ఒత్తిడికైనా నశించిపోతుంది. సత్యప్రతిపాదకమైన రెండు అంశాలు సహజ సుందరమైన అలంకారాలతో సార్థకత పొందాయి.

**చమత్కారఖేలన :** సాధారణమైన అంశాన్ని అయినా రసరమ్యంగా చమత్కార భరితమైన అభివ్యక్తిశిల్పంతో సినారె వర్ణిస్తారు. ప్రధానంగా సహజసిద్ధమైన ప్రకృతిని వర్ణించిన తావులలో సినారె కలం వారి హృదయంలోని భావుకతతో పోటీపడి నడుస్తుంది.

"నీటిని లేచే ఆవిరికీ నింగిని మూగేకోరిక
నింగిని పూచే జాబిలికీ నేలను సాగే కోరిక"
శిరసులనూపే చేలున్నా చేతులు కలిపే పూలున్నా
పదమాగని పసిగాలులకూ వెదురున మోగే కోరిక - 19

సముద్రజలం ఆవిరిగా మారి ఆకాశంలో మేఘంగా రూపుదిద్దుకుంటుంది. ఆకాశంలో జాబిల్లి తన వెన్నెలను నేలపై ప్రసరింపచేస్తుంది. గాలి వెదురు బొంగులో చేరి మధురమైన మురళీనాదంగా తనను తాను మలచుకుంటుంది. ఈ ప్రకృతి సిద్ధమైన దృశ్యాలు, కవి చేతిలో రసవత్తతను పొంది మనోజ్ఞమైన భావచిత్రాలుగా రసహృదయుల ఎదుట సాక్షాత్కరిస్తాయి. సృష్టిలోని ప్రకృతి సౌందర్యం అంతా సినారె గజళ్ళలో చమత్కార భరితంగా ఒదిగిపోయింది.

"మబ్బుకు మనసే కరిగితే అది నీరవుతుంది.
మనసుకు మబ్బే ముసిరితే కన్నీరవుతుంది.
ఎంతటి ఎత్తులకెదిగినా ఉంటుంది పరీక్ష
హిమగిరి శిరసుల మాడితే అదియేరవుతుంది - 21

హిమవత్పర్వతం పై భాగంలో సూర్యకిరణాలతాకిడికి మంచు ఏరులై ప్రవహిస్తుంది. భావనా చమత్కృతి దీనిలో తళక్కుమని మెరిసింది.

**తాత్త్వికత :** భారతీయ సంస్కృతి లౌకిక జీవితంలోనే తాత్త్వికతను నింపుకున్న ఘనత కలిగింది. మనిషి జీవితం అశాశ్వతమని, అశాశ్వతమైన జీవితం ద్వారా శాశ్వతమైన ఆనందమయ స్థితిని చేరుకోవటమే భారతీయతత్త్వసారం. ఆ శాశ్వత సత్యం తెలిసి జీవనాన్ని సార్థకం చేసుకోగలిగినవాడే మనిషి.

"వికసించిన కుసుమం నిలిచేదీ ఒక రెన్నాళ్ళంటాను
వెలకందిన మురిపం వెలిగేదీ ఒక మూన్నాళ్ళంటాను

జన్మించిన జీవికి మృతి తప్పదనే సత్యం కాదనను
చరితార్థుల పేరే జీవించేదీ వేలేళ్ళంటాను - 12
"భాషే నేను తెచ్చుకున్న తీయనివరం.
భాషే నేను కట్టుకున్న తీయని గోపురం" అని తెలుగుభాషనే జీవన సర్వస్వంగా భావించిన సినారె భాషామాధుర్యం తొణికిసలాడే రచనలు చేశారు. లోకరీతిని, రాజకీయాలను, మానవ సంబంధాలను, గజళ్ళలో గానం చేశార. ప్రాసలో కవిత్వానికి వన్నె తెచ్చారు.

మానవుడు అంటే 'ఆరిపోని పరిణామ జ్యోతి, మృత్యువులోంచి అమరత్వాన్ని సాధించేవాడు" అని వారి అభిప్రాయం తమ రచనల ద్వారా అజరామరత్వాన్ని సాధించారు సినారె. శ్రావ్యమైన గళంతో శ్రోతల చెవులు ఉదాత్త భావాలతో రసహృదయుల హృదయాలను ఏకకాలంలో ఉయ్యాల లూపుతూ, ఉద్దీప్తిని అందించే శబ్దరస మర్మజ్ఞుడు సినారె. ఆచార్య దివాకర్ల వేంకటవధానిగారు సినారె బహుముఖ ప్రజ్ఞశీలతను ప్రశంసిస్తూ పలికిన 'కవితా ప్రతిభ హృద్యపద్యగేయ పఠనోపన్యాస విన్యాస కౌశలాది గుణములొక్కచో గుమిగూడిన అపూర్వ వ్యక్తి" అనే పలుకులు అక్షరసత్యాలు సార్థవంతాలు.

"ధ్యానమే ఒక అనుభూతి, మౌనమే వ్రాయనిగీతి" అని ఒక గజల్‌లో సినారె చెప్పినట్లుగా ఆ అనుభూతిని అందుకోవటానికి శాశ్వత ధ్యానంలో మునిగిపోయారు. పలుకలేని మౌనంతోనే విశ్వగీతికలు పాడుకుంటూ ప్రకృతి తాదాత్మ్యం చెందారు.

# సినారె కవి హృదయం

- డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

చాలా మంది నడి వయస్కులకు సినారె ఒక సినీకవిగానే తెలుసు. కానీ ఆయన పద్యకవి, గద్యకవి, గేయకవి, గజల్‌కవి అని చాలా తక్కువ మందికి మాత్రమే తెలుసు, ఎక్కడో మారుమూలపల్లె, సిరిసిల్ల జిల్లా, వేములవాడ మండలం హన్మాజీపేటలో జన్మించి ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆచార్యునిగా, తెలుగు విశ్వ విద్యాలయం ఉపకులపతిగా, ఆంధ్రసారస్వత పరిషత్తు అధ్యక్షునిగా, అధికార భాషా సంఘం అధ్యక్షునిగా ఎన్నో పదవుల నందుకున్న ప్రజ్ఞాశాలి సినారె. పదవుల మాట అటుంచి తెలుగువారి గుండెల్లో ఒక కవిగా, గేయకవిగా, అభ్యుదయకవిగా ఆయన నినదించిన తీరు మరువరానిది. మరువలేనిది.

"నవ్వని పువ్వు" ఆయన తొలి రచన. ఆరేడు తరగతుల వయస్సులోనే సినారె కవితలు వ్రాశారు. జానపదాలు, హరికథలు, బుర్రకథలు ఆలపించారు. తెలుగు జనజీవనంపై ఆయనకున్న మక్కువ మహోన్నతమైనది.

ఛందస్సు అంటే తెలియని రోజుల్లోనే సినారె పద్యాలు వ్రాశారు. ప్రహ్లాద చరిత్ర, సీతాపహరణం వంటి పద్యనాటికలను ఆయన వ్రాశారు. బి.ఎ చదివేరోజుల్లో రోచిస్, సింహేంద్ర, అనే పేర్లతో కవితలు వ్రాసేవారు. "శోభ" అనే సాహిత్య పత్రికకు సంపాదకత్వం వహించారు. తెలుగులోనే కాక సినారె హిందీ, ఉర్దూ భాషలలో కూడా కవిత్వం వ్రాశారు.

సినారె రచించిన "ఋతుచక్రం" అనే కావ్యానికి సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. "విశ్వంభర" కావ్యానికి అత్యున్నత పురస్కారం జ్ఞానపీఠ్ అవార్డును పొందారు. 1977లో పద్మశ్రీ పురస్కారాన్ని, 1992లో పద్మభూషణ్ పురస్కారాన్ని అందుకున్నారు. ఎన్నో విశ్వవిద్యాలయాల నుండి గౌరవ డాక్టరేట్‌ను పొందారు. వ్యక్తిగా ఇంతటి జీవన ప్రస్థానం గల సినారె సాహిత్య ప్రస్థానం కూడా అంత గొప్పది. కవిగా ఆయన హృదయాన్ని తరచి చూడడమే ఈ లఘు వ్యాసం లక్ష్యం –

ప్రతి కవికీ తనదైన ఒక సాహిత్య ప్రయోజనమో, సామాజిక ప్రయోజనమో ఉంటుంది. కేవలం తన ఆనందం కోసమే ఏ కవీ, రచనలు చేయడు. అందరూ తన రచనలు చూసి ప్రభావితులైనప్పుడు మాత్రమే ఆత్మానందాన్ని పొందుతాడు. అయితే కవి గుండెల అట్టడుగు నుంచి కవిత్వం పుట్టినప్పుడు అది పన్నీటి పరిమళంలాగానీ, పున్నమి వెన్నెలలాగానీ, చైతన్య దీపికలాగానీ, అగ్నిజ్వాలగా గానీ

రూపొందుతుంది. స్పందించకలిగే హృదయం వుంటే కవిత మనకు ఎన్నో జీవిత సత్యాలను నేర్పుతుంది. ముందుకు నడిపిస్తుంది. అందుకే సినారె అంటారు –

"ఏదైనా రాయందే ఈ క్షణాన్ని పోనియ్యను. కలాన్ని పిండేయందే కాలాన్ని కదలనీయను". కవికి ఎంతటి శక్తి ఉంటుందో ఈ రెండు పంక్తులూ మనకు చెపుతాయి. కాలాన్ని కూడా శాసించగలడన్నమాట కవి! అయితే ఆ కాలానికి కవి తాను అలా ఎందుకు చేశాడో బదులు చెప్పాలి! అందుకే కలాన్ని పిండుతానంటున్నాడు. ఇక్కడ పిండేది కలాన్ని కాదు హృదయాన్ని "చీకటికొవ్వును కరగించందే కొత్తపొద్దురానీయను" అంటారు. కొవ్వు శరీరానికి చేటు. చీకటి సమాజానికి చేటు, చీకటి అంటే ఇక్కడ అజ్ఞానం. దానిని తొలగించందే నవోదయాన్ని రాకుండా అడ్డుకుంటానంటున్నాడు. ఎంత ఆత్మవిశ్వాసం కవికి!

తాను ఏమిటో పాఠకుడికి తెలియాలి. అందుకే సినారె – "కవిత్వం నా మాతృభాష. కవిత నా శ్వాస. కవిత నా చిరునామా. ఇతివృత్తం మానవత్వం" అంటారు. నడక నా తల్లి, పరుగు నా తండ్రి, సమత నా భాష, అనంతం నా పయనం. విశ్వం నా ఊరు. శాంతి నా పేరు." అంటారు. విశ్వ మానవ సంక్షేమాన్ని శాంతి స్థాపనను తాను కోరుకుంటున్నానని సినారె స్పష్టంగా చెప్పారు. ఈ చైతన్యం ఒక్కసారిగా రాదు.

ముందు బుడి బుడి నడకలుగా మొదలయి, ఆపై పరుగుగా మారుతుంది. అందుకు తల్లినీ ఆలంబనంగా చూపుతూనే ప్రతీకాత్మకంగా చెపుతారు.

మరో చోట అంటారు– "నా పేరు కవి. ఇంటిపేరు చైతన్యం. ఊహ సహజీవనం. తీరు సమభావం. నా వచనం బహువచనం. నా వాదం సామ్యవాదం" కవిగా సినారె అంటే ఏమిటో ఈ మాటలు మనకు చెబుతాయి.

ఏ ఇజం జోలికీ తాను పోనని సినారె ఖచ్చితంగా చెపుతున్నారు. సామ్యవాదం అంటే సమభావన. నలుగురూ కలసి నలుగురి కోసం బ్రతకటం అన్న సత్యాన్ని సినారె ఇక్కడ చాటి చెప్పారు. కులమన్నా, మతమన్నా సినారెకు గిట్టవు. "ఎవడు హిందువెవడుతురక ఎవడు కిరస్తానీ ఎవరిది తెలుగెవరిది. రవమెవరిది హిందుస్తానీ" అంటారు.

మానవుడు కూడా ప్రకృతిలో భాగమే కదా! ఎందుకు మతంపేర, కులంపేర గీతలు గీసుకుంటున్నాడని ఆయన వేదన!" ఏ కులము వెన్నెలది, తెమ్మెరలు ఎట్టి జాతికి చెందినట్టివి" అంటారు.

ప్రకృతిలో అణువణువునా కవిత్వాన్ని దర్శించి స్పర్శించి వినగల శక్తి సినారెకున్నది." మట్టి కూడా మాట్లాడుతుంది. చెట్టేదాని భాష, పూలు నిశ్శబ్దంగా

నినదించే పరిమళస్వరకోశాలు" ఎంత అద్భుతమైన అభివ్యక్తి ఇది. మనిషి గుండెల్లోంచి కవిత్వం ప్రభవించి, అక్షరరూపం దాల్చి, పరిమళాలను, అగ్నిజ్వాలలను కూడా వెదజల్లుతుంది. మట్టి గుండెల్లోంచి చెట్టు కూడా అలాగే ప్రభవించి రెమ్మలుగా, కొమ్మలుగా, పువ్వులుగా నినదిస్తుంది అంటారు సినారె. 'స్వరకోశాలు' అన్న ప్రయోగంలో మాట్లాడగలిగే శక్తిని పువ్వులకు కవి ప్రసాదించాడు.

సినారె సాహితీ ప్రస్థానానికి వస్తే "నవ్వనిపువ్వు", "అజంతా సుందరి" వంటి గేయనాటికలను, "నాగార్జున సాగరం", కర్పూర వసంత రాయలు" "జాతి రత్నం", "విశ్వనాథ నాయకుడు" వంటి గేయ కావ్యాలను, "జలపాతం", "దివ్వెలు" వంటి ఖండ కావ్యాలను, "రామప్ప", తరతరాల తెలుగు వెలుగు వంటి గేయరూపకాలను రచించారు. "అక్షరాల గవాక్షాలు", "మధ్యతరగతి మందహాసం", "మంటలూ మానవుడు," "ఉదయం నా హృదయం", "మార్పు నా తీర్పు", "ఇంటి పేరు చైతన్యం", "కాలం అంచుమీద", "కలం సాక్షిగా" వంటి ఎన్నో వచన కవితా సంకలనాలను వెలువరించారు. "సమదర్శనం" అనే ముక్తక కావ్యం వ్రాశారు. "ప్రపంచ పదులు" అనే ఒక విశిష్ట కావ్యాన్ని రచించారు.

"తెలుగు గజళ్ళు" ఆయన కలం నుండీ, గళం నుండీ జాలు వారి అద్భుతమైన ప్రాచుర్యాన్ని పొందాయి. "పాటలో ఏ ముంది, నా మాటలో ఏముంది", అని తన సినిమా గీతాలపై ఆయన చక్కని విశ్లేషణాత్మక రచన కూడా చేశారు.

సినారె కు సంప్రదాయమన్నా, ప్రయోగమన్నా కూడా మక్కువే! అద్భుతమైన పద్య రచనను, గేయకవితారచనను చేస్తూ కూడా పాఠకులకు బాగా దగ్గర కావాలనే ఉద్దేశ్యంతో ఆయన వచన కవిత్వాన్ని మాధ్యమంగా ఎంచుకున్నారు. గురజాడ ముత్యాల సరాల ప్రభావం ఆయన గేయకావ్యాలలో స్పష్టంగా కనిపిస్తుంది. శ్రీ శ్రీ అభ్యుదయం సినారె కవిత్వంలో చోటు చేసుకుంది.

"అంతకడివెడు పాలపై ఒక్కింత మీగడ పేరినట్లుగా, మనకు మిగులును, గతములోపలి, మంచి, అదియే సంప్రదాయము" అంటారు సినారె. సంప్రదాయాన్ని మీగడ తరకగా పోల్చటంలో కవికి దానిపై గల అభిమానం స్పష్టమవుతుంది. సంప్రదాయమూ ఒకప్పుడు ప్రయోగమేననీ, ప్రతి ప్రయోగమూ సంప్రదాయం అయి తీరుతుందని సినారె విశ్వసిస్తారు.

"మధ్యతరగతి మందహాసం" కవితా సంకలనంలో సినారె మానవతా దృక్పథానికి, అభ్యుదయ ధోరణికీ సమానంగా పట్టం కట్టారు. ఈనాటి మధ్యతరగతి జీవితం ఎలా వుంది–" మూటకున్న విలువ మాటకుందా, తూటాకున్న విలువ పాటకుందా, బాకులకున్న విలువ రేకులకుందా, కాకులకున్న విలువ కోకిలకుందా?"

అని ప్రశ్నిస్తారు. హింస పెచ్చు మీరిపోతున్నదనీ, విలువలకు సరియైన గుర్తింపు లేదని సినారె పరోక్షంగా చెప్తున్నాడు. అయితే నిరాశ పడటం, నిట్టూర్చటం చేతకానివాని లక్షణం. అందుకే, "నిట్టూర్పుల వంతెన మీదుగా నిజాయితీని చేరుకుంటాను. నిరాశల ఊడల్ని పట్టుకొని నింగి అంచుల్ని అందుకుంటాను." అని ఆత్మ విశ్వాసాన్ని ప్రకటిస్తున్నారు. ఆ విశ్వాసమే బలంగా నిలబడితే మధ్య తరగతి మనిషి ఏమైనా చేయగలడు - అందుకే "చీకటిని ముక్కలుగా కత్తిరించేసి జేబురుమాళ్ళుగా చేసుకో" అంటారు. అంతేకాదు "కన్నీళ్ళను ముత్యాలుగా చేరదీసి కంఠమాలగా కైజేసుకో" అని కూడా అంటారు. ఇక్కడ 'జేబురుమాళ్ళు' అనటంలో ధ్వని వుంది.

ఇదే సంపుటిలో పలువురి ప్రశంసలందుకున్న కవిత" "సన్నజాజీ పూలమాల సాయెబులకుర్రాడి గొంతు చించి సాయం సంధ్య అరుస్తున్నది. అన్నార్తుని చింపిరి బ్రతుకులోంచి ఆకలి అందంగా మెరుస్తున్నది." సాయంత్రం కాగానే పూలమ్మే సాయెబుల కుర్రాడి గొంతువిని మురిసిపోతారు. గృహిణులు. కానీ వాడు అన్నార్తుడు. వాడి ఆకలి నిండిన గొంతులోంచి ఆకేక గృహిణులకు అందంగా విన్పిస్తున్నది.

వద్దన్నా వచ్చి పడే వృద్ధాప్యాన్ని ఎంతో అందంగా చెపుతారు సినారె.

ఎక్కడ జారిపోయిందో నాకు తొడిగిన వృద్ధాప్యం
నా ఒంటికది కుదరదోయ్ అని
కాలం టైలరుతో
దారంతో కుట్టినట్టు చెప్పినా విన్నాడా!

అయితే ఆయన తన ఒంటిమీద నుండి దాన్ని జార్చేసుకుంటున్నా అంటారు. అవును మరి! వృద్ధాప్యం శరీరానికుండొచ్చు. మనసుకు కాదుగదా!

'మట్టి మనిషీ ఆకాశం' అనేది సినారె రచించిన విశిష్ట దీర్ఘకావ్యం. మట్టిని స్థలానికీ, ఆకాశానికీ, కాలానికీ ప్రతీకలుగా గ్రహించి మనిషిని ఈ రెంటికీ అనుసంధాన కర్తగా చూపుతారు సినారె.

మట్టిమనిషీ ఆకాశం
వీటి చుట్టే అల్లుకుంది సృష్టి కథా సూత్రం
మట్టి ప్రసవించిన చెట్లు మనిషి చేతుల్లాలేచి
నింగిని తట్టి లేపుతాయి.
ఉలికిపడ్డ పగటికన్ను తెరుచుకుంటుంది.

ఈ కవితలో మనిషిని ఆత్మీయంగానేకాక ఆత్మాశ్రయంగా మలుచుకోవటానికి కవి ప్రయత్నించాడంటారు ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యం. ఇలాంటి కావ్యమే విశ్వంభర.

మానవతావాద ప్రస్థానంలో ఇది ఒక మణిదీపం అంటారు జి.వి.ఎస్. ఈ కావ్యానికి నాయకుడు మానవుడు. విశ్వంభర అంటే భూమిలేక ప్రపంచం అని అర్థం. నేపథ్యం ప్రకృతి మనిషి భూమి పై కాలుమోపిన నాటి నుండీ అతను చేసిన ప్రస్థానాలు ఈ కావ్యంలో ప్రకరణాలు –

"నేను పుట్టకముందే నెత్తి మీద నీలితెర, కాళ్ళకింద ధూళిపొర"–
కావ్యం ఈ పంక్తులతో మొదలవుతుంది. ఇంతకూ నేనెవణ్ణి.
ఏమింటి ఇంటి వాణ్ణి! ఏ కాలం చంటి వాణ్ణి! వెర్రెత్తిన ఏ శక్తి
విసిరేసిన కందుకాన్ని ? ఎందుకిలా దొర్లుతున్నాను"

అంటూ మానవునిలో జిజ్ఞాస మొదలవుతుంది. స్త్రీ అని తెలియని ఒక రూపం వెంటాడుతూంటే", ఎవరదీ వెన్నంటి వస్తున్నది? నేనే తానైనట్టు నీడలా పలకరిస్తున్నది" అనుకుంటాడు పురుషుడు. ఆ పైన నిషేధించిన చెట్టు పండుతిని వారిరువురూ తాము స్త్రీ పురుషులమని తెలుసుకోవటం తత్ఫలితంగా చావు పుట్టుకలకు లోబడటం జరుగుతుంది.

మనుషులు రాజ్యదాహంతో యుద్ధాలు చేయటం, అంతటా శవాలకుప్పలు, కమిరి పోయిన మాంస ఖండాలు దిబ్బలుగా కావటం చూసి మానవుడు, "వినాశం జరిగితే కాదు వివేకం పెరిగితే గెలుపు అనురాగం చేసే శాసనము అసలైన రాజనీతి" అని పశ్చాత్తాప పడటం జరుగుతుంది.

వృద్ధాప్యం వచ్చాక మనిషి" తనకు తెలుసు తాను పెంచుకున్న మువ్వన్నెల చిలుకను తన్నుకుపోవడానికి అహరహం ముక్కులు నూరుతున్న ఆరుగద్దలున్నాయని" అని గ్రహిస్తాడు. చివరకు కావ్యం "గుహనుంచి మహలుదాకా, నడక నుంచి రోదసిదాకా, దివిటీలనుంచి విద్యుద్దీపాలదాకా, అమ్ములనుంచి అణ్వస్త్రాల దాకా, ప్రవహించిన సంస్కృతికి మూలహేతువు... మనిషిలో వికసించిన విజ్ఞానధాతువు" అని ముగుస్తుంది. మనసుకుతొడుగు మనిషి మనిషికి ఉడుపు జగతి. ఇదే విశ్వంభరాతత్త్వం. ఇదే అనంత జీవిత సత్యం" అని సినారె తన కావ్య ప్రయోజనాన్ని చెపుతారు.

సినారె గేయ కావ్యాలలో "కర్పూర వసంతరాయలు" అత్యుత్తమమైన రచన. కథా వస్తువు చిన్నదే. కానీ చెప్పిన తీరుచాలా హృద్యంగా వుంటుంది. కొండవీడు రాజధానిగా ఆంధ్రదేశాన్ని పరిపాలించిన కుమారగిరిరెడ్డి కథానాయకుడు. అతడే కర్పూర వసంతరాయలు!

ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ త్రయోదశి నుండి మొదలుకొని తొమ్మిదిరోజులు వసంతోత్సవాలు నిర్వహించటం వల్ల, ఉత్సవాలకు వచ్చిన జనం మీద

కర్పూరఖండాలను, కస్తూరిని, గొజ్జగినీటిని వెదజల్లుతూ వినోదించటం వల్ల అతనికి కర్పూర వసంతరాయలు అనే బిరుదు వచ్చింది.

అతడు పండితుడు. సంగీత, నాట్యశాస్త్ర కోవిదుడు. గ్రంథరచయిత కాటయ వేముడు అతడి బావమరిది అతడు కూడా కత్తిని, గంటాన్ని సమానంగా నడుపగలిగినవాడు.

లకుమ, రాయల కొలువులో నర్తకి, ఆమెను తొలిసారి చూడగానే" రేని ముగ్ధ మనస్సులో నవమన్మథుని ఆరవబాణము అవతరించినది. ప్రభువు తన్మయుడవుతాడు. చిన్మయుడవుతాడు. లకుమాలగ్న పంచప్రాణుడవుతాడు. ఆమె నృత్యము, నృత్తము, సాత్త్విక భావ నాట్యము మరల మరల స్మరించి రాజు పాన్పుపై అశాంతితో పొరలుతాడు. ఆమె ఊపే ప్రపంచమవుతుంది రాజుకు.

ముందు, లకుమను రాజనర్తకిగా నియమిస్తాడు. ఆపైన ఆమెతో కలసి తీర్థయాత్రలు చేయ సంకల్పిస్తాడు. రాణి ఇదంతా చూసి దుఃఖితురాలవుతుంది. లకుమవెనుక రథములోరాగా రాజు ముందు రథం మీద అహోబల నరసింహస్వామి దేవాలయానికీ, ఆపైన ద్రాక్షారామంలోని భీమేశ్వరస్వామి ఆలయానికి వెళ్తాడు. లకుమ అహోబలంలో చెంచులక్ష్మి వేషంలో, ద్రాక్షారామంలో జగజ్జనని వేషంలోనూ నర్తిస్తుంది. మోహవివశుడైన రాజు పూర్తిగా ఆమె యందు అనురక్తుడవుతాడు. లకుమ కూడా అతని ప్రేమకు దాసురాలవుతుంది. ఆమెపై వ్యామోహంతో కొలువు ముఖం చూడడం కూడా రాజు మానేస్తాడు.

ప్రజలు పలు విధాలుగా రాజు గురించి గుసగుసలుపోతారు. కాటయవేముడి కోరిక మేరకు రాజు ఒక రోజు కొలువుకు వస్తాడు. సభాసదులు సంతోషిస్తారు. ఇంతలో లకుమ కాలు బెణికిందని కబురు తెలుస్తుంది రాజుకు. వెంటనే ఆమె వద్దకు పరుగుతీస్తాడు. జనం రాజు ప్రవర్తనకు విస్తుపోతారు. విచారిస్తారు. ఇది తెలిసిన రాణి లకుమతో "దేశమొకదెస.... నీవు ఒక దెస... తేల్చుకొనుమెయ్యది ఘనమ్మో" అంటూ వేడుకుంటూ ప్రశ్నిస్తుంది. దీనితో లకుమ రాజును తాను మార్చలేనని నిశ్చయించుకొని బాకుతో గుండెలో పొడుచుకుని తన జీవితాన్ని చాలిస్తుంది. బాకు'పిడి'కి ఆమె ఒక లేఖను జత పరుస్తుంది. దానితో రాజుకు కనువిప్పై మళ్ళీ రాజ్యపాలనను యధాతథంగా కొనసాగిస్తాడు.

ఈ కావ్యంలో ఒక్కొక్క సన్నివేశం ఎంత హృద్యంగా ఉంటుందో మాటల్లో చెప్పటం కష్టం. తేలిక భాషలో అక్కడక్కడా మాండలిక పదాలను అలదుతూ త్రశ్య, మిశ్ర, చతురస్ర గతులలో సినారె ఈ గేయ కావ్యాన్ని నడిపి తీరు అత్యద్భుతం.

"ప్రపంచ పదులు" సినారె చేసిన మరొక ప్రయోగం.

నింగి లోతును చూడగోరితే నీటి చుక్కను కలుసుకో
రత్నతత్త్వం చూడగోరితే రాతి ముక్కను కలుసుకో
అణువు నడిగితే తెలియదా బ్రహ్మాండమంటే ఏమిటో
మౌనశిల్పం
చూడగోరితే
మంచు గడ్డను
కలుసుకో
మనిషి
మూలంచూడగోరితే
మట్టిబెడ్డను కలుసుకో

పదిపంక్తుల్లో కవితను వ్రాసి సినారె ఒక ప్రయోగం చేశారు.

ఈ కవితల్లో తాత్త్విక చింతన ఎక్కువగా కన్పిస్తుంది.

సినారె గజళ్ళు కూడా అద్భుతంగా వ్రాశారు. నిజానికి ప్రేమకు తాత్త్వికతకు మాత్రమే గజళ్ళు పరిమితమవుతాయి. కానీ సినారె వాటికి సామాజిక ప్రయోజనాన్ని కల్పించారు.

"స్వచ్ఛశీలమే నీకున్నా, వెదజల్లే బురదను మరవద్దు
పుకారుకేమని అనుకోకు, అది పునాదులను తొలి చేస్తుంది.
కాలం పులిలా గాండ్రిస్తే, ఏమంటాను, నేనే మంటాను
దిగులెందుకు, ఓయి సినారె, తెగబడమంటాను."

"నన్ను దోచుకొందువటే వన్నెల దొరసాని"తో సినీ కవిగా ఆయన ప్రస్థానం ఆరంభమయింది. ఆపై ఎన్ని మధురమైన గీతాలు ఆయన కలం నుండి జాలువారాయో!

"ఈ రేయి తీయనిదీ ఈ చిరుగాలి మనసైనది", "విన్నానులే ప్రియా కనుగొన్నానులే ప్రియా", ఏమో ఏమో ఇది... నాకేమో ఏమో అయినది", "తెలిసిందిలే, తెలిసిందిలే," రివ్వున సాగే... రెపరెపలాడే", నిన్న లేని అందమేదో నిదురలేచెనెందుకో", "పగలే వెన్నెలా, జగమే ఊయలా", "మబ్బులో ఏముందీ... నా మనసులో ఏముంది", "కిల కిల నవ్వులు చిలికిన", "చెలికాడు నిన్నే రమ్మని పిలువ...", "ఛాంగురే బంగారు రాజా...." ఇలా శృంగారం, కరుణ, వియోగం, విషాదం ఎలాంటి భావాన్నైనా ఎదకు హత్తుకునేలా చెప్పిన కవి సినారె.

"ఏకవీర" సినిమాకు పాటలు, మాటలు కూడా సినారె వ్రాశారు. అలాగే

"అక్బరు, సలీం, అనార్కలి"కి కూడా ఆయన మాటలు వ్రాశారు.

సినారె ప్రసంగం ఎంత మనోహరంగా ఉంటుందో ఆయన సినీగీతాన్నిగానీ, గజల్‌ను గానీ ఆలపిస్తున్నప్పుడు అంతే మనోహరంగా ఉంటుంది. సినారె అనగానే ఒక రూపం వెంటనే కనులకు కట్టేలా, ఆయన తన ఆహార్యాన్ని ఒకేలాఎప్పుడూ వుండేలా చూసుకున్నారు.

"తెలుగు జాతి మనది, నిండుగ వెలుగు జాతి మనది" అని ఆత్మవిశ్వాసంతో చెప్పిన సినారె జాతికి, భాషకు కూడా కలకాలం గుర్తుపెట్టుకునేంత సేవ చేశారు. కవిత్వం ద్వారా ఆయన నిత్యయౌవనుడిగా నిలచిపోయారు. భర్తృహరి ఒక మాట అన్నారు.

"జయన్తితే సుకృతినో, రససిద్ధాః, కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయం"

సిద్ధౌషధ సేవనవల్ల జరామరణాలను జయించవచ్చు. కవులు పండితులు అటువంటి సిద్ధౌషధాన్ని సేవించినటువారు. సినారె కూడా అట్టి యోగియే!

# సినారె 'విశ్వంభర'లో సాంస్కృతిక పరివర్తన

డా॥ గుమ్మా సాంబశివరావు

"విత్తుపొటమరించనిదే
కొత్త మొక్క మొలవలేదు
ప్రసవ వ్యథ మించనిదే
శిశువు వెలుగుచూడలేదు...
మొన్నచిగురు
ఇవాళ మొక్కై పైకిలేస్తుంది
నిన్నటి మొగ్గ

ఈ పూట పువ్వై విప్పారుతుంది - అంటూ ప్రకృతి పరిణామ క్రమాన్ని కవిత్వీకరించిన డా॥ సింగిరెడ్డి నారాయణరెడ్డిగారు మల్లారెడ్డి బుచ్చమ్మ దంపతులకు 1931 జులై 29వ తేదీన కరీంనగర్ జిల్లాలోని మారుమూల గ్రామం హనుమాజీ పేటలో జన్మించారు. వీధి బడిలో చదువును ప్రారంభించిన సినారె విశ్వవిద్యాలయ ఆచార్యునిగానే కాకుండా, కులపతులుగా కూడా బాధ్యతలు నిర్వర్తించారు. రాజ్యసభ సభ్యునిగా తనదైన ముద్రను ప్రకటించారు. సాహిత్య సృజనను నిత్యకృత్యంగా చేసుకుని, సభా కార్యక్రమాల్లో పాల్గొనటం దినచర్యగా పాటిస్తూ జీవితాన్ని గడిపిన పుంభావ సరస్వతి సినారె!

పద్యం, గేయం, వచనకవిత, పాట, గజల్, ద్విపదులు, పంచపదులు, బుర్రకథ, గేయనాటికలు, యాత్రాచరిత్ర, దీర్ఘ కథాత్మక గేయకావ్యాలు మొదలైన ప్రక్రియల్లో రచనలు గావించిన నిరంతర సాహితీమూర్తి సినారె.

ప్రతి పుట్టినరోజు నాడు ఒక కవితా సంపుటిని ఆవిష్కరించే సంప్రదాయానికి శ్రీకారం చుట్టిన సాహితీ తపస్వి. సినారె రాస్తూ రాస్తూ పోతాను సిరా ఇంకేవరకూ – పోతూ పోతూ రాస్తాను వపువు వాడే వరకూ అని చెప్పిన మాటను నిలబెట్టుకున్న కవివరేణ్యులు సినారె.

తెలుగు వారికి రెండవ జ్ఞానపీఠాన్ని అందించిన 'విశ్వంభర' కావ్యకర్త సినారె విశ్వంభరలోని సాంస్కృతిక పరివర్తనను వివరించే ప్రయత్నమే ఈ వ్యాసం.

విశ్వంభర కావ్యానికి ప్రస్తావన రాస్తూ సినారె ఈ కావ్యానికి నాయకుడు

మానవుడు. రంగ స్థలం విశాల విశ్వంభర. ఇతి వృత్తం తేదీలతో నిమిత్తంలేని, పేర్లతో అగత్యం లేని మనిషి కథ. ఈ కథకు నేపథ్యం ప్రకృతి. మనిషి ధరించే వివిధ భూమికలకు మూల ధాతువులు మనశ్శక్తులు. అలెగ్జాండర్, క్రీస్తు, అశోకుడు, సోక్రటీస్, బుద్ధుడు, లింకన్, లెనిన్, మార్క్స్, గాంధీ ఇలా ఎన్నెన్ని రూపాలో మనిషికి! కామం, క్రోధం, లోభం మదం, ఆత్మశోధనం, ప్రకృతిశక్తుల వశీకరణం, – ఇలా ఇలా ఎన్నెన్ని విభిన్న ప్రవృత్తులో మనిషికి! ఆదిమదశ నుంచీ ఆధునికదశ వరకు మనిషి చేసిన ప్రస్థానాలు ఈ కావ్యంలోని ప్రకరణాలు.

"మనిషి చేసిన సాధన త్రిముఖం. కళాత్మకం, వైజ్ఞానికం, ఆధ్యాత్మికం. ఈ సాధనలో అడుగడుగునా ఎదురు దెబ్బలు. క్షతుడైనా మనిషి తిరోగతుడు కాలేదు. 'విశ్వంభర' కావ్యరచనకు పూర్వం నాలో గీసుకున్న రేఖా చిత్రమిది". అని తన మనసులోని మాటను వెల్లడించారు.

మానవ జీవితం నిత్య చైతన్య స్రవంతి. అది అనంతంగా సాగుతూనే ఉంటుంది. అనంత జీవన ప్రమాణంలో ఉత్థాన పతనాలున్నా లెక్కచెయ్యకుండా మానవుడు పురోగమిస్తాడు. పురోగామియైన మానవుని విశిష్ట జీవన పరిణామ క్రమాన్ని ఆవిష్కరించటమే ధ్యేయంగా సాగిన కావ్యం విశ్వంభర.

విశ్వానికి ఆధారమైందే విశ్వంభర. విశ్వంభర అంటే భూమి. పంచభూతాలలో మొట్టమొదటిది భూమి. సమస్త ప్రాణికోటికీ ఆధారమైంది భూమి. భూమి ఒక గ్రహమే కాదు. జడ, చైతన్య పదార్థాలకు భద్రతనిచ్చే గృహం. అందుకే వేదం భూమిని తల్లిగా సంభావించింది.

సినారె విశ్వంభర ప్రత్యేక విశిష్టలతో కూడిన కావ్యం. ఈ కావ్యంలో వ్యక్తులు కనిపించరు గాని వారి వ్యక్తిత్వాలు ప్రతి బింబిస్తాయి. ఆలోచనామృతంగా సాగే ఈ కావ్యంలో తేదీలు కనిపించవు. అనేక సన్నివేశాలు తటస్థ పడతాయి. మానవుడు జన్మించకముందే ప్రకృతి తన విశ్వరూపాన్ని ప్రదర్శించిందని కవి ధ్వనింపచేస్తారు.

ఈ కావ్యంలో నేను అనే పదం మానవునికి సంకేతం. తాను పుట్టక ముందు తన కోసమే నక్షత్రాల నిరీక్షణ, ఉషస్సుల ఉద్వేగం, వెన్నెలల సొగసు, వెదురు బొంగుల నాదం, శిలల ఆకృతులు, నెమళ్ల నృత్యాలు, కోకిలల గానాలు ఉన్నాయని కవి వర్ణించిన తీరు సహృదయ రంజకం.

విశ్వంభర కావ్యం ఐదు ఖండాలుగా సాగింది. పంచభూతాత్మకమైన ప్రపంచానికి అంటే ప్రకృతికి ప్రతీకగా ఐదు ఖండాలను సినారె ఏర్పాటు చేశారని

భావించవచ్చు. కవిత్వం ఆలోచనామృతమనే పలుకల కనుగుణంగా సినారె ఈ కావ్యంలో ఏ విషయాన్ని సూటిగా చెప్పలేదు. భూమి తన మూలాల్ని అన్వేషించటం వెనుక సృష్టికర్త హస్తం ఉన్నదన్న విషయాన్ని ప్రకటిస్తూ "వెర్రెత్తిన ఏ శక్తి విసిరేసిన కందుకాన్ని" అని అన్నారు.

ఆధునిక మహాకావ్యమైన విశ్వంభర కావ్యం ద్వారా తెలిసిన విషయాల్నే సుబోధకంగా సుందరంగా చెప్పటానికి సినారె ప్రయత్నించారు. ఈ కావ్యంలో మానవేతిహాసానికి అంకురార్పణ గావిస్తూ సినారె ఆడం, ఈవ్‌లను ప్రతీకలుగా గ్రహించారు. బైబిల్‌లోని ఆడమ్, ఈవ్‌ల కథకు మూలం ఋగ్వేదమేనని మన పండితుల భావం.

ద్వాసుపర్ణా సయుజాసఖాయా
సమానం వృక్షం పరిష్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్య
త్యనశ్నన్నన్యో అభాచాకశీతి" - అని ఋగ్వేదం

– ఒక చెట్టు ప్రకృతి, రెండు పక్షులు (ఆత్మ పరమాత్మలు) ఒక పక్షి (జీవుడు) పండు తింటున్నాడు. మరో పక్షి (దేవుడు) చూస్తూ అంతటా ప్రకాశిస్తున్నాడు.

ఆలంకారికంగా చెప్పిన సృష్టితత్వాన్ని ఆయా మతగ్రంథాలు, తమ సంప్రదాయాలకు అనుగుణంగా అన్వయం చేసుకున్నాయి. చెట్టు పండును ఆడమ్ తినవద్దని ఈవ్‌ను ఆదేశించినా అమె గుండెలో కోరిక సర్పంలా తిరిగిందని చెప్పి "ఎంత రుచి అనిషిద్ధ ఫలానికి - ఎంత వడి ఈ విముక్త హృదయానికి" అంటాడు సినారె.

జీవుడు ప్రకృతి ఆకర్షణకి లోనవుతున్నాడు. ఈవ్ కూడా ప్రకృతి అకర్షణకులోనై పండు తింటానికి సాహసించింది. ఇక్కడ ఒకరి ఆంక్షతో పాటు మరొకరి కాంక్షను మనం గుర్తించవలసి ఉంది. ఆదిమసహచరుల్లో వివేకం వేయి రేకులుగా విచ్చుకుంది.

మనిషికంటే ముందు సృష్టి ఉంది. మనిషిని ఉదయించే సూర్యుని కిరణాలు వెచ్చగా తాకాయి. ఆ సూర్యుడు మనిషిలాగే ఎదిగి వస్తున్నాడని సినారె వ్యాఖ్యానించారు. చరాచర జగత్తుకు ఆత్మ సూర్యుడే' అనే వేదోక్తి ఇక్కడ స్ఫురిస్తుంది. సూర్యునికి మానవునికి కవి అభేదం చెప్పారు.

'విశ్వంభర'లో సినారె సృష్టి వైచిత్రిని అద్భుతంగా చిత్రించారు. ప్రకృతి ఎంత భయపెట్టినా, మానవుడు ప్రకృతిని జయించి పురోగామిగా వృద్ధి చెందాడని, తన

నాభి పాదులో పుట్టిన నాదాన్ని సంగీతంగా వినిపించాడని చెప్పారు. తర్వాత నృత్యం, కవిత్వం, చిత్రలేఖనం, శిల్పం అనే కళల్ని వివరించి మానవుని కళాత్మక వికాసాన్ని తెలిపారు. సినారె మనిషిని వృక్షంతో పోల్చారు. మనసును మహాసాగరంగా భావించాడు.

మానవుని మనసే జీవితం సాఫీగా సాగటానికి కట్టుబాట్లను ఏర్పాటు చేసుకుని వెంటనే వాటిని ఉల్లంఘిస్తుందని మానవ స్వభావాన్ని వివరిస్తూ

తాను కట్టుకున్న చెలియకలికట్టను
తానే కబళించాలని చూస్తుంది" అని చెప్పి అంతటా తానే
అధికారం చెలాయించాలనుకోవటానికి కారణం మనస్సేనని నిర్ధారించారు.

మనిషి పరిణామాన్ని వివరిస్తూ "కాలాన్ని తొడుక్కున్నాడు మనిషి - కత్తిరించి కుట్టువేసి - పృధివిని తిప్పుకున్నాడు మనిషి - నాలుగు దిక్కులను నాటేసి" అని చెప్పి ప్రకృతిని తనకు అనుకూలంగా మార్చుకుంటూ" విస్తరించాడు మనిషి - విశ్వాన్ని ఆత్మీకరించుకుని - ఆవరించాడు మనిషి - అంబరాన్ని పిడికిలించుకుని" అని రచించాడు.

ప్రకృతిలోని చలన శీలానికి పరిణామం మనిషి. "జగతిలోని భ్రమణ గుణానికి - ప్రతి రూపం మనిషి పాటలా సాగిన మనసు - ఆటలా ఊగిన మనసు - మాటలను కప్పుకుని అర్థాలను అల్లుకునీ - పలికింది అనంత ముఖాలుగా - ఒలికింది విభిన్న గళాలుగా" అని మనిషి ఆటపాటల పరివర్తనను తెలిపారు. అలాగే "మనిషి మనసు చూసుకుంది - తన నీడను అగణ్య రూపాలుగా - రసాహంకృతి కూర్చుకుంది - రక్తిని చైతన్యకోశాలుగా" అని మానవుని కళాత్మక పరిణామాన్ని ప్రకటించారు.

కాలం మారుతోంది మనసు గమ్యాన్ని అన్వేషిస్తోంది. అందుకే "పెరుగుతున్నది ఆ తపస్సు

శిరసు మీది పుట్టలను ఛేదించుకుంటూ
స్థిర సంకల్పం నాదంగా ప్రబోధించుకుంటూ
నక్షత్ర మండలాలను పెళ్లగించుకుంటూ
అక్షీణ కాంతి గోళాలను
ఆక్రమించుకుంటూ
అనాహతంగా అశరీరంగా ప్రస్థానిస్తూ
పెత్తనం మరిగిన వైభవమత్తుల

ఎత్తుగద్దెను ప్రతిఘటిస్తూ" అని మానవ ప్రస్థానాన్ని వివరించారు. మానవునిలో అధికార దాహం పెరిగిన తీరును ప్రశ్నిస్తూ

"విజేతగా వెలగాలంటే - విశ్వాన్నే భస్మం చేయాలా?

ధరాలోభం తీరాలంటే - నరరుధిరమే కావాలా?

వేయి తోటలను నరికిన చేయి - పూయిస్తుందా ఒక్క పువ్వును?

మారణ హుంకృతులు మరిగిన నోరు - చేరబిలుస్తుందా ఒక్క శిశువును" అని ప్రశ్నించారు. రణోన్మాదం మానవ ప్రపంచానికి హానికరమని, నమస్సులు నరోత్తములకే అందుతాయని, శిరస్సులు కారుణ్యానికే వంగుతాయని చెప్పారు.

"లక్షప్రాణాలను ఆర్పేసిన కత్తి - ఒక్క ఊపిరిని వెలిగిస్తుందా?

ఉర్వీతలాన్ని వణికించిన శక్తి - ఒక్క హృదయాన్ని జయిస్తుందా?" అని మానవతా దృక్పథాన్ని ప్రకటించారు.

కుత్తుకల్ని నరకటం వల్ల గెలుపురాదని, గుండెల్ని కదిపితే గెలుపు వస్తుందని చెప్పారు. వినాశనం జరిగితే గెలుపు కాదని, వివేకం పెరిగితేనే గెలుపు లభిస్తుందన్నారు. సమరం భీతిని రగిలిస్తుందని, సహనం ప్రీతిని వర్షిస్తుందని, అనురాగం చేసే శాసనమే అసలైన రాజనీతి అని అధికారదాహాన్ని నిరసించారు.

విశ్వంభరలోని నాల్గవ ఖండం సినారె తాత్త్వికచింతనకు నిలువెత్తు నిదర్శనంగా నిలుస్తుంది. ఏ అధికారమూ శాశ్వతం కాదని, దాన్ని ఎదిరించే శక్తులు అవతరిస్తూనే ఉంటాయని, సోక్రటీస్, జీసస్‌ల పేర్లు ప్రస్తావించకుండా వారి వృత్తాంతాల్ని తెలిపారు. అధికారం అణగదొక్కుతూ ఉంటే పీడితులు నోరు మూసుకుని, ఉండరని ప్రశ్నించే తత్త్వం ఎప్పటికైనా పెల్లుబుకుతుందని వివరిస్తూ

"అరుణోదయం ఊరుకోదు - కిరణాలను సారించనిదే

వసంతోదయం ఊరుకోదు - పరిమళాలను పారించనిదే

ప్రసరించే నీరు ఊరుకోదు - పల్లం అంతుముట్టనిదే

ప్రతిఘటించే మనసు ఊరుకోదు - ప్రశ్నలను ఎక్కుపెట్టనిదే" అంటారు. ప్రశ్నల్ని సంధించకపోతే పరిణామమే ఉండదు. ప్రశ్నించే వారిని అణచటానికి ప్రయత్నిస్తే పరిణామాలు తీవ్రంగా ఉంటాయని సోక్రటీస్ వృత్తాంతంలో తెలుపుతూ

"ప్రశ్నను బంధిస్తే ఉదయిస్తాయి - ప్రవచనాలు

గాలిని బంధిస్తే ఉబికి వస్తాయి - కల్లోలాలు ....

ఆలోచనల పొద్దు పొడుపును - ఆపలేవు ఏ చీకట్లు" అని హెచ్చరించారు.

సృష్టి పరిణామం చెందాలంటే

జ్ఞాన బీజం మొలకెత్తాలి. చైతన్య తేజం వెలుగొందాలి. మానసిక మథనం జరగాలి. అందుకే

అగుపించనిది నిత్యమా? – అగుపించేది మర్త్యమా?

ఎవడు చేసిన సృష్టి ఇది? – చివరికి మృత్యువే సత్యమా?"

నిరంతర జీవయాత్ర – మరణానికి నేపథ్యమా?" అని ప్రశ్నించారు. మానవుడు ఎన్ని విజయాలు సాధించినా, చివరికి అతనిలో కలిగే అసంతృప్తి అతణ్ణి జీవిత పరమార్థం వైపు తీసుకువెళుతుంది అనటానికి ఈ కవితా పంక్తులు ప్రత్యక్ష సాక్ష్యాలు.

మనిషిలోని జిజ్ఞాస పురోగమించిందని, ఎన్ని సత్యాల్ని అస్వాదిస్తున్నా ఆ పిపాస తీరటం లేదని, నిరంతర పరిశీలనా శక్తితో పరిశోధనా ప్రతిభతో సాంస్కృతిక పరివర్తన చెందాడని కవి వివరించారు.

"ఎగిరే పక్షులను చూస్తూ – ఏళ్ల తరబడి నిట్టూర్చినతాను

ఎగిసి పోతున్నాడు గగన వాటికి – ఏరెక్కా చొరలేని గూటికి

ఏటిని దాటి పోవాలంటే – మాటి మాటికి జడుసుకునేవాడు

కడలి కెరటాల లోగిళ్లను – పడక గదులుగా తీర్చుకున్నాడు.

గాలిలోని పరుగును హరించి – కదిలే చక్రాలకు అంటించి

కాలు మీద కాలు వేసుకుని – లీలగా పయనిస్తున్నాడు"

– మానవుని అన్వేషణా దృష్టి పరిణామం చెందిన తీరును, కష్టాల నుంచి సౌకర్యాల పథంలోనికి ప్రయాణించిన తీరును కవి ఇక్కడ స్పష్టం చేశారు. ఇంకా మానవ సంస్కృతీ వికాసాన్ని వివరిస్తూ కవి

"తెరవెనుక బొమ్మలాడిస్తూ దరువులు వేసుకున్న తాను పలికే మనుషులను తెరమీద వెలుగు నీడలుగా ఆడిస్తున్నాడని చెప్పారు. దూరాన్ని దృశ్యంగా మార్చి, దృశ్యానికి నాదాన్ని కూర్చి కంటి ఇంటిలోకి చేర్చి కాపురం చేయిస్తున్నాడని అద్భుతంగా భావించారు.

"మరనే మలిగా మలచి – మనిషికి ప్రతిగా నిలిపి

ఆలోచనలకే సరికొత్త – ఆకృతులు గీస్తున్నాడు" అని

మరమనిషి సృష్టిని గావించిన మనిషి ప్రతిభను ప్రశంసించారు.

అంతరిక్ష పరిశోధనలు గావిస్తున్న మానవుని మేధను మెచ్చుకుంటూ

"అవనిపై ఉంటూనే కళ్లను - అంతరిక్షంలోకి పంపించి
నక్షత్రాల నాడుల జాడలు - వీక్షిస్తూ ఉన్నాడు.
అగుపించని జీవాణువుల - అసలురూపు బయట పెట్టి
చూపులకు ఊహించలేని - సూక్ష్మత కలిగిస్తున్నాడు" అని చెప్పారు.

వైద్యరంగంలో మానవుడు గావించిన పరిశోధనల పరిణామాన్ని వివరిస్తూ

"మృత్యువుకూ వ్యాధికీ ఉన్న - పొత్తును విచ్ఛేదించి
ఆ రెంటికీ మధ్య మరింతగా - అఖాతం పెంచుతున్నాడు" అన్నారు.

అక్షరాలకు శాశ్వతత్వాన్ని సమకూర్చిన మానవుని ప్రచురణారంగ ప్రతిభను వివరిస్తూ

"గాలిగూటిలో గళ పేటికలో - మూలిగే అక్షర నిధులను
ప్రత్యక్ష నిక్షేపాలుగా - పదిల పరుచుకున్నాడు" - అని పేర్కొన్నారు.

నదీ గమనాలను నిరోధిస్తూ, వ్యవసాయ రంగంలో మానవుడు సాధించిన ప్రగతిని అక్షరీకరిస్తూ సినారె

"పిచ్చిగా ఉరక లెత్తే నదులను - మచ్చిక చేసి పెరట్లో కట్టేసి
పైరు పాపలకు పాలిచ్చే - పాడియావులుగా మలచుకున్నాడు" అని చెప్పారు.

ఇంకా అణు గర్భంలో పొదిగి ఉన్న విశ్వతత్త్వాన్ని గుప్పిట్లో బిగించి అశ్వక్రీడలాడుతున్నాడని మానవుని పరిశోధనాత్మక ప్రతిభను ప్రశంసించారు.

మానవుడు తన జిజ్ఞాసతో ఎన్నో విజయాల్ని సాధించాడు. సృష్టికి ప్రతి సృష్టి చేయగలిగే శక్తిని సాధించాడు. చివరకు అన్నీ తానై అహంకారానికి ప్రతి రూపమయ్యాడు. అందనంత ఎత్తుకు ఎదిగిన తానే ఆ ఎత్తు నుండి పడిపోవటానికి సిద్ధమయ్యాడు.

"అణువులోని అవ్యక్తమూర్తిని - అజాండంగా చూసిన తాను
గ్రహాలలో సుప్తంగా పడి ఉన్న - గాలి ఉనికిని చూసిన తాను
చూసుకున్నాడా తనలోని రూపం - తెలుసుకున్నాడా తన మనసు తూకం" అని ప్రశ్నించారు.

మనిషి ఎంతో ఎత్తుకు ఎదగవచ్చు. తోటి మనిషిని దిగువకు తొక్కి వెయ్యటం మంచిది కాదు. కానీ లోకంలో కనిపిస్తున్న దృశ్యం ఇదే. మనిషికి జ్ఞానాజ్ఞానాలున్నాయి. జయాపజయాలున్నాయి. తన మనసును సరిగ్గా తూకం వేసుకోలేకపోతే "ఏ అడుగో తన పక్కను తాకితే ఎంత విషం కక్కుతాడు" అన్న మాటలు అక్షరసత్యాలు.

లోకంలో ఎన్నో విషయాల్ని గమనిస్తున్నాం. చేనిగట్టు కొద్దిగా తరిగితే తలకాయలు పగులుతున్నాయి. ఆటపట్టు కాస్త చెదిరితే అనుబంధాలు తెగుతున్నాయి. పయనంలో పిలుస్తున్న మైలు రాళ్లు, పాదాలకు ప్రశ్నార్థకాలవుతున్నాయి. ఎక్కిన శిఖరాలను లోయల్లా మార్చుకున్నది, ఎగిసిన గగనాలను ఇరుకు గదులుగా చేసుకున్నది మనిషి అహంకారమేనని గుర్తించాలి.

శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఎంత అభివృద్ధిని సాధించిన మానవుడు అతీంద్రియ శక్తుల పట్ల విశ్వాసాన్ని పెంచుకుంటున్నాడని సినారె వివరిస్తూ

"అలంకరించుకున్నాడు మెడలో – అభయ చిహ్నాలను"
అద్దుకున్నాడు నుదిటి పై – ఆత్మీయ విశ్వాసాలను
పై మెట్టు ఎక్కిపోవాలన్నా – పగవాణ్ణి తొక్కి పోవాలన్నా
కట్టుకున్న రహస్యాల మూటలు – పట్టు పడకుండా ఉండాలన్నా ...
ఆ మనసుకు ఏకైక శరణం – అతిలోక శక్తుల సంస్మరణం"

అని మానవ సమాజంలోని వాస్తవికతను కళ్లకు గట్టినట్లు వర్ణించారు.

సమాజంలో భిన్నమతాలు, కులాలు, ఆరాధనా విధానాలు అవతరించాయి. వాటిలో అభిప్రాయ భేదాలు పొటమరించాయి. అందుకే

"కలరూపు ఒక్కటైతే – కలతలెందుకిన్ని?

మూలతత్త్వం ఒక్కటైతే – ముసుగులెందుకిన్ని? – అని ప్రశ్నించి "మానవతను అనుగమించే ధ్యేయం – మనుషులనే వేరు చేస్తుందా?" అని వాపోయారు. ఇది మనోనాదం కాదు మైకం పట్టిన రొద అని మతతత్త్వాన్ని, మూఢత్వాన్ని నిరసించారు.

మానవ సంస్కృతీ పరిణామాన్ని విశ్వంభర నాల్గవ ఖండం చివరలో సినారె అద్భుతంగా వర్ణించారు.

"గుహ నుంచి మహలు దాకా – నడక నుంచి రోదసీ నౌక దాకా
దివిటీల నుంచి విద్యుద్దీపాలదాకా – అమ్ముల నుంచి అణ్వస్త్రాలదాకా
ప్రవహించిన సంస్కృతికి హేతువు – మనిషిలో వికసించిన విజ్ఞాన ధాతువు

– అని మనిషిలోని చైతన్య రూపానికి ప్రతీకగా ఉన్న మానవుని జ్ఞానం వల్లనే ప్రకృతిలో మానవుని జీవనం ఎంతో వికాసం కలిగిందని చెప్పారు అంతేకాదు.

"చుక్కలను లెక్కిస్తూ కూర్చుంటే – ముక్కారులు పండేవి కావు
అంతా నుదుటరాసి, ఉందంటే – యంత్రాలు నడిచేవి కావు
విధి పరిధిలోచంక్రమిస్తుంటే – వివేకం పెరిగేది కాదు

సంకల్పం నడుము కట్టకుంటే – చరిత్ర తిరిగేది కాదు
మనిషి జీవితం – అనుభవాంకితం” అని చెప్పారు.

మానవ ప్రయత్నమూ, శ్రమాలేకపోతే ఏ పరిణామమూ సాధ్యం కాదనే వాస్తవాన్ని కవి ఇక్కడ స్పష్టం చేశారు.

మానవుడు తాను సాధించిన దానితో తృప్తి పడకుండా నిరంతరం అన్వేషణ సాగిస్తూ సరికొత్త జీవితానికి, సంస్కృతికి రూపులు దిద్దుతూ ఉంటాడు. అందుకే సినారె “సాగిపోతాడు కాంతిలహరిలా – చైతన్య కేతనుడు మానవుడు” అని మానవుని నిత్య చైతన్య ప్రస్థానాన్ని గుర్తు చేశాడు.

సత్త్వరజస్తమోగుణాలతో కూడిన ఈ ప్రపంచంలో ఒక మనిషి ఇంకొక మనిషిని అణగదొక్కే ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. అందుకే “అయ్యో! మనిషీ – అహంకారాల రంగద్దాలను – అంత రంగానికి తొడుక్కున్న మనిషీ – తెలుపు నలుపుల కొలమానాలతో విలువ కడుతున్నావా?” అని ప్రశ్నించాడు. మానవులంతా ఒక్కటేనని చెప్పటానికి”

ఏవన్నె గోవైతేనేమి – ఇచ్చే పాలు తెలుపే
ఏ రంగు తనువైతేనేమి – ఆ రక్తం ఎరుపే” – అనే పంక్తుల్ని రచించారు.

ప్రపంచాధిపత్యాన్ని చేజిక్కుంచుకోవాలని, ప్రగతిని కబళించాలని ప్రయత్నించే శ్వేత. వర్ణాహంకారాన్ని కవి ప్రశ్నించారు.

మనిషి అంటే వలలతో పట్టేసే మత్స్యం కాదని, గొలుసులతో కట్టేసే మృగం కాదని, నిత్యం శిలువకు మొక్కుకునే మనిషివై ఉండి, సాటి మనిషి పై స్వారీ చేస్తూనే ప్రేమ శాసనాన్ని చాటుతున్నావా? అని శ్వేత అధికారాన్ని ప్రశ్నించారు. బ్రిటీషువారి వర్ణాహంకారాన్ని భారతీయుల్ని అణచి వెయ్యటానికి వాళ్లు చేసిన ప్రయత్నాల్ని భంగ్యంతరంగా వర్ణించిన సినారె భారతీయుల చైతన్యాన్ని భావస్ఫోరకంగా

“గోమాతల గిట్టల్లో – కొడవలి అంచులు నడుస్తున్నాయి.
తెగిపోతున్న కండలు – ఎగురుతున్నాయి జెండాలుగా” అని వర్ణించారు.

ఆంగ్లేయుల దురహంకారాన్ని, పెత్తనాన్ని “మౌనమే నినాదంగా మందహాసమే మహాస్త్రంగా, సహనమే కవచంగా, శాంతమే ప్రవచనంగా నిరాడంబరంగా సాగే ఆ అడుగు గిరీంద్రాల తలలు వంచింది” అని జాతిపిత మహాత్మాగాంధీని గూర్చి చెప్పిన మాటలు స్ఫూర్తిదాయకాలు” అంతేకాదు. ఇన్ని పాతరల తుపాకీ మందు –

ఎగిరిపోయిందే – ఒక్క బక్కపలచని నిశ్వాసం ముందు – ఇన్ని అంతస్తుల పునాదిరాళ్లు – ఎగిరి పడ్డాయే – ఒక్క చెక్కు చెదరని విశ్వాసం ముందు” అని గాంధీ వైశిష్ట్యాన్ని ప్రకటించారు.

మానవుని లక్ష్యం “వినూత్న చైతన్య సృజనమా? విశ్వ గోళ విధ్వంసనమా?” అని ప్రశ్నించారు. జీవన యానంలో ఎన్నో ఆటు పోట్లు జయాపజయాలు అందుకే” ఇది నిత్య ప్రస్థానం – ఎగుడు దిగుళ్లు తప్పవు – ఇది నిత్య ప్రయోగం – ఎదురు దెబ్బలు తప్పవు” అని చెప్పారు.

మానవుడు తనను ఆవరించిన తమస్సు నుంచి, దానికి లోబడే మనస్సు నుంచి ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగాలి అందుకే సినారె

“తమస్సు వలపన్నినప్పుడు – మనస్సు పట్టు తప్పినప్పుడు
ఆలోచన ఆయుధంగా – అంతశ్చేతన ఆలంబనంగా
పురోగమిస్తాడు మనిషి – పరిసరాల పైకెగసి ” – అన్నారు.

అంతశ్చేతనం అంటే ఆత్మజ్ఞానమేనని గుర్తించి దాన్ని ఆలంబనంగా చేసుకుని మానవుడు పురోగమిస్తున్నాడనటం యథార్థం.

అన్నిటికీ మనసే మూలమని గుర్తించాలి. అందుకే సినారె “ఋషిత్వానికీ పశుత్వానికీ – సంస్కృతికీ దుష్కృతికీ
స్వచ్ఛందతకూ నిర్బంధతకూ – సమార్ద్రతకూ రౌద్రతకూ
తొలిబీజం మనసు – తొలిరూపం మనసు
మనసుకు తొడుగు మనిషి – మనిషికి ఉడుపు జగతి
ఇదే విశ్వంభరాతత్త్వం – ఇదే అనంత జీవిత సత్యం” – అని

‘విశ్వంభర’ కావ్యాన్ని ముగించారు. ప్రకృతికీ మానవునికి ఉన్న సంబంధాన్ని మానవ జీవన సంస్కృతీ పరివర్తనను విశ్వంభరలో వర్ణించిన సినారె 12-6-2017న ఈ విశ్వంభరను వీడి వెళ్లటం తెలుగు సాహిత్యానికి తీరనిలోటు. అయినా ‘సుకవి జీవించు ప్రజల నాలుకల యందు’ అన్న జాషువా పలుకులు సినారె పట్ల ప్రత్యక్షర సత్యాలు.

# భళారె.. సి.నా.రె....!!

శ్రీ ఎస్.ఆర్. భల్లం

శిఖరం దిన దినం ఎదగదు. సముద్రం క్షణక్షణం విస్తరించదు. సి.నా.రె. కవితలు శిఖర సముద్రాలు కావు. అవి నిరంతర రూపాంతరాభివృద్ధి చెందే నిత్యావసర నవజీవ పదార్థాలు. సి.నా.రెకి నాదహృదయం తెలుసు. శబ్దసంయోజనం తెలుసు. అర్థశక్తి బాగా తెలుసు.

మహాకవి నారాయణరెడ్డి మాట్లాడుతుంటే - కవిత్వం ఊపిరి పీలుస్తున్నట్లనిపిస్తుంది! గీతిని విరచిస్తుంటే - కృష్ణుడు వేణువు మ్రోగిస్తున్నట్లనిపిస్తుంది. వచన రచన సాగిస్తుంటే - మట్టిని సైతం మాణిక్యం చేస్తున్నట్లనిపిస్తుంది. మధుర కవిత వినిపిస్తుంటే - మనిషిలో మానవత స్పందిస్తున్నట్లనిపిస్తుంది. కవితకు - సమత, మమత, నవత, మానవతలను అద్దడం సి.నా.రె వ్యక్తిత్వం...!

సి.నా.రె. ఆధునిక కవితారంగంలో ఒక లెజండరీ కవి. ఒక ఫినామినా తెలుగు సరిహద్దులు దాటి దేశపటంలోకి విస్తరిస్తున్న కవి. విశ్వంభర కవి. కాలం వెంట నడవడం, కలాన్ని, కళాత్మకంగా నడపడం, సంప్రదాయంలో స్తబ్దతను నిరసించడం, కొత్తదనంలోని ఉత్తమగుణాన్ని కవితా హృదయానికి హత్తుకోవడం, ప్రయోగాన్ని ప్రయోజనం తెలిసి ప్రయోగించడం, ఉక్తి, శక్తితో వస్తు శక్తిని ఉన్మీలింపచేయడం, సి.నా.రెకి ఉగ్గుతో వచ్చిన విద్యలు...!

పద్యం రాసినా, గద్యం కూర్చినా, గేయం రచించినా, వచనగీతం చిత్రించినా, ప్రకృతికి తగిన ఆకృతినీ, నిర్మితికి తగిన అలంకృతినీ, శీలానికి తగిన శైలినీ కూర్చడంలో సి.నా.రె అందెవేసిన చేయి!

మరోకవి చేయలేని పని సి.నా.రె చేసి చూపించారు. కవిత్వాన్ని బహుళ పాఠకలోకం దగ్గరకు తీసికెళ్లారు. కవిత్వాన్ని మాలిక రూపంలో విస్తృతపరచే టెక్నిక్‌ని ఆయన ఎపుడూ విడిచి పయనించలేదు. "మందహాసానికీ చందస్సుంటుందని మరవలేకపోతున్నా" నన్న మానవ భావాల గణిత శాస్త్రజ్ఞుడు. విశ్వమానవ జీవితపు, విశ్వజనీన భావనల కూడికలూ, తీసివేతలూ క్షుణ్ణంగా తెలిసిన సాహిత్య సామాజిక శాస్త్రవేత్త.

"కాగితాలెన్నెన్ని పితికితే, కవిత ఒలికెను చుక్కలా
అనుభవాలెన్నెన్ని అతికితే, ఆత్మ మొలిచెను మొక్కలా"

పద్యం, గద్యం, గేయం, కవిత, పాట, ప్రపంచపది, మాకందం, గజల్స్ - సమకాలీన కవిత్వం అన్ని రూపాల్లో అంతటి వైవిధ్యం చూపిన ఘనత సి.నా.రేదే.

అద్భుత పదాల ఆరోహణ, అవరోహణ, ఉచ్చారణలో స్పష్టత ప్రవర్ధమాన కవులందరికీ ఆదర్శం.

కవిత్వం
కృత్రిమ పిండోత్పత్తి కాదు
సింథటిక్ ఊహల
చిత్ర భంగిమల క్రీడాగారం కారాదు
అది రావాలి
విత్తు చిట్లినంత సులభంగా..

పలుకుకు, కులుకు అలది, మాటకు ఆట నేర్పి, అక్షరానికి ఆత్మను తొడిగి, అనుభూతులు కలిగించే సి.నా.రె. కలంతో ప్రమేయం లేకుండా ఓ గొప్ప కవితను ఆశువుగా చెప్పగలరు. రంజింప చేయగలరు. ఊహాలోకాల్లో విహరింప చేయగలరు. ఆహూతులను కవితాత్మక ఉపన్యాసంతో కట్టి పడేసే సమ్మోహన శక్తి సి.నా.రె కుంది.

"ఆధునిక ఆంధ్ర కవిత్వం సంప్రదాయములు ప్రయోగములు" అన్న పరిశోధనలో ఆయనకు వొక్క పీహెచ్.డీ వచ్చింది గాని, దానివల్ల వందల మంది డాక్టరేట్లు పొందారన్నది సాహిత్య లోకానికి తెలిసిన నగ్న సత్యం. సి.నా.రెలోని పరిశోధకుడ్ని కవి, వక్త కప్పేశారు కాని నిజంగా చెప్పాలంటే ఆయన గొప్ప సాహిత్య విజ్ఞాన పరిశోధన ఖని.

"ఏ రక్కసి గాలికి ఎగిరిపోయింది
గోత్రాలూ క్షేత్రాలూ ఎరగని
గువ్వల గాంధర్వ చుంబనం...
కాల సాక్షిని కనుక్కుంటే తెలుస్తుంది
ఏ విత్తనం ఖురానులా పలకడానికి
ఎంతెంత స్వర సేవ చేశానో
ఏ మొక్క ఉపనిషత్తులూ ఎదగడానికి
ఎంతెంత స్వరసేవ చేశానో.."

అంటూ – మందిర్, మసీద్ వైషమ్యాల్లో మానవత్వం మాడి మసి అవుతుందని ఆవేదన వ్యక్తపరుస్తారు.

సి.నా.రె. కవిత్వం విస్ఫులింగాలు కురిపించేదీ, పరుగులు పెట్టించేదీ కాదు. అలాగని – అర్థం కాని గహనాటవుల్లో సంచరింప చేసేదీ కాదు. అక్షరాలు సరళంగా భావాలు మృదువుగా సందేశ సమ్మిశ్రితంగా ఉంటాయి. అపుడపుడూ ఎపుడన్నా

ఒకే ఒక సూటి ప్రశ్న – ఒక్క ధర్మాగ్రహపు ప్రశ్న దర్శనమిస్తుంటుంది.

"నరాల దారాలతో బిగించిన
డప్పు డొక్కలో తన్నితే
ఉరుములు విరి చేస్తాయి
తన్నిన కాళ్లను చీపురు పుల్లల్లా
డప్పంటే మూరెడు తోలు పేరిక కాదు
మట్టిగుండెల ఘోషలను పుక్కిన పట్టుకొన్న
మహోగ్ర మృగేంద్ర కంఠం...
తుదిగెలుపు లేగదూడలది, మూగవాడలది
మ్రోగే డప్పులది, మూల్గే నిప్పులది.... " అనే కవితలో "డప్పు డొక్కల్లో.."

కవితా దృక్పథం వివరిస్తారు.

సి.నా.రె తన ప్రాపంచిక దృక్పథానికి చాలా ఆలస్యంగా 'విశ్వంభర' అని పేరు పెట్టారు. కానీ శాంతి సామరస్యాలు, సమానత్వం, లౌకిక ప్రజాస్వామ్యం కోరుకునే కవిగా, ఆయనను స్థూలంగా అంచనా వేయవచ్చు. ఆయనది ఎగుడు దిగుడులు లేని, ఒడిదొడుకులు లేని సాహిత్య జీవతం :

సమాజమే సంద్రంగా, సంకల్పమే కవ్వంగా
ఆశయాల వాసుకిని చుట్టి
అంతు తేలేదాకా గిలకొట్టి
తీసిన నవ్య అమృతం.." అంటూ

"మరో హరివిల్లు" కవితాజల్లులు కురిపిస్తారు. ఆధునిక తెలుగు కవిత్వానికి ఒక ప్రచారకుడిగా, ప్రదర్శకుడిగా, తన వక్తృత్వంతో, ఆహార్యంతో, కవిత్వంతో చేసిన కృషి సి.నా.రెను గొప్ప జనరంజక ప్రఖ్యాతుడ్ని చేశాయి.

"గానుగెద్దులా తిరగడంలో –
గతి వుంది కానీ ప్రగతి లేదు
గంగిరెద్దులా ఎగరడంలో –
తమాషా వుంది కానీ తాండవం లేదు.."

చివరి నిమిషం దాకా "అక్షరాల గవాక్షాల"ను తెరచి, అభ్యుదయ భావాల ఊపిరి నింపుకున్న మహాకవి సి.నా.రె.

"ప్రకృతిలోని మూలనాదమే
పెకలి వచ్చిందా తనలోకి..

తనలోని జీవనాదమే
తరలి పోయిందా ప్రకృతిలోకి.."

అంటూ మనిషి, ప్రకృతి మధ్య అద్వైత భావాన్ని ప్రకటించిన విశ్వంభర ఒకటి చాలు. సి.నా.రెను సాహిత్య లోకంలో చిరంజీవిగా నిలపడానికి...

"మల్లెలా జీవించే మహా యోగం లేకున్నా
ముల్లులా బ్రతకడం పోవాలి.."

అంటూ అక్షరాల గవాక్షాలలో అద్భుతమైన సందేశం సి.నా.రె ఆవిష్కరిస్తారు.

"భాషకు మడి, శ్వాసకు ముడి లాంటిది
మడి కట్టుకొని కూర్చుంటే ఏ భాషా బతకలేదు"

అంటూనే అమ్మభాషను ఉద్దేశ పూర్వకంగా అంపశయ్య ఎక్కించే ధోరణుల్ని తీవ్రంగా నిరసించారు.

"తెలుగుజాతి మనది నిండుగ వెలుగుజాతి మనది" అంటూ స్ఫూర్తి నింపి, "వటపత్రసాయికి వరహాల లాలి" పాడిన సాహితీ శిఖరం. సి.నారె కవితా విన్నాణమంతా ఒక ఎత్తయితే - సామాజిక తాత్త్వికత మరొకెత్తు. సినిమాల కోసం రాసిన ఆయన పాటల్లో మానవత, ప్రగతిశీలనత ద్యోతకం అవుతాయి. "కర్ణ" సినిమాకోసం ఆయన "గాలికి కులమేదీ, ఏదీ.. నేలకు కులమేదీ..." అన్న పాట అద్భుతంగా రాశారు. అందులో కులంపట్ల తన నిరసన ప్రకటిస్తాయన. "పాలకు ఒకటే తెలివర్ణం, ఏదీ ప్రతిభకు కలదా ఫలభేదం. వీరుల కెందుకు కులభేదం - అది మనసులు చీల్చిన మతభేదం" అంటారు సి.నా.రె.

"శిశరం నుంచి వసంతానికి
చీకటి నుంచి ప్రభాతానికి
నిరాశ నుంచి ఆశాశిఖరానికి
అశ్రుజలధి నుంచి ఆనంద తీరానికి
నడిపించే మార్పు..! నేనిచ్చే తీర్పు..!!

జగమెరిగిన కవి సి.నా.రె ముచ్చటైన మూడు అక్షరాలు. తెలుగు కవితకు నవా. అవి తెలుగుతనం తొణికిసలాడే పూర్ణకలశాలు. కవితా విపంచిపై వినిపించే స్వరాలు. మానవీయతా విలువలకు మణిదీపాలు.

సినిమా పాట రాసినా, కవిత రాసినా ప్రతి పంక్తీరసాత్మకమే. ప్రాసలంటే ప్రీతి మెండు. అది సినీ గీత రచనలో సునాయాసంగా వచ్చి అమరిపోతాయి. సందర్భోచిత గీత రచనలో సినారె దిట్ట. చమత్కారం అంటే ఆయనకు మమకారం. ఒక్క మాటలో చెప్పాలంటే సినారె తెలుగు సినీతెరకే అద్భుత అలంకారం.

"మాయదారి సిన్నోడు మనసే లాగేసిండు" (అమ్మమాట) చాంగురే బంగారు రాజా (శ్రీకృష్ణ పాండవీయం), వగలరాణివి నీవే - సొగసుకాడని నేనే (బందిపోటు), కోటలోని మొనగాడా - వేటకు వచ్చావా (గోపాలుడు - భూపాలుడు) ఎంతవారుగానీ వేదాంతులైనగానీ (భలే తమ్ముడు) ఈ రేయి తీయనిది ఈ చిరుగాలి మనసైనది (చిట్టి చెల్లెలు) ఇత్యాది పాటలు ఆపాతమధురాలు.

"అక్బర్ సలీమ్ - అనార్కలీ" చిత్రానికి మాటలు, పాటలు సమకూర్చారు. "ఏకవీర" నవలకు చిత్రరూపం దాల్చగా, మాటలురాసి పండిత పామర జనరంజకం చేశారు. "ఈ నల్లని రాళ్లలో ఏకన్నులు దాగెనో, ఈ బండల మాటున ఏ గుండెలు మ్రోగెనో" అన్నపాట విని పరవశించని తెలుగు హృదయం ఉండదు.

సినారె సంపద ఆయన కలమేకాదు, గళంకూడా. ఆయన కలం ఎంత పదునైనదో గళం అంత తియ్యనైనది. ఆ పదాల విరుపు, కొత్త కొత్త పదాలసృష్టి, కొన్నిచోట్ల నొక్కులు, మరికొన్ని చోట్ల పదాల ట్రిక్కులు, నిండైన, అందమైన విగ్రహం వక్తగా ఆయన రాణింపుకు సృష్టికర్త సమకూర్చిన హంగులు. ఆయన రచించిన గజళ్లు, ప్రపంచ పదలను ఆయనే గానం చేస్తే, వినవలసిందే...!

సినారె గొప్పకవి, అంతకంటే గొప్ప వక్త. అనితర సాధ్యంగా సభానిర్వహణ చేసేవారు. ప్రసంగం కవితాపఠనంలా సాగేది. రాతకూ కూతకూ, పాటకూ మాటకూ కలానికి గళానికి హద్దులు చెరిపేసేవారు. "గజల్" అన్న ఉర్దూ కవితారూపానికి తెలుగుప్రజల్లో ప్రాచుర్యం కల్పించారు. తెలుగు గజళ్ల పరిమాళాన్ని ప్రపంచవ్యాప్తి పరిచారు.

కవిత్వం ఎంత అందంగా రాస్తారో, అంతకంత అందంగా చదువుతారు. రేడియోలో సినారె కవిత్వం చదివిన తీరు విని ఇన్‌స్పైరై, కవిత్వం రాయడం మొదలెట్టిన వారెందరో. తెలుగు సాహిత్యాభిమానుల గుండెల్లో సినారె గొప్ప వక్తగా చిరస్మరణీయులు.

సినారె ప్రసంగం ఓ తెలుగునదీ ప్రవాహమే. శ్రోతలు అందులో మునిగి తేలి ఆస్వాదించాల్సిందే. కానీ వర్ణించడం చాలా కష్టం. అలాంటి ఆత్మీయ ఆధునిక తెలుగు సాహితీ శిఖరం ఆయన.

సినారె మాట - పానుగంటి పరిభాషలో మనం మలుచుకుంటే "మాటయన్న మాటయా - మాణిక్యముల మూట, మౌక్తికముల పేట, మకరంద ప్రవాహపు తేట, జిగికి జిగి, బిగికిబిగి, ఎదురెక్కున కెదురెక్కు, వెన్ని వగలు, ఎన్ని హోయలు, ఎన్ని వన్నెలు, ఎన్ని ఒద్దికలు" అన్నట్టుగా ప్రాసలతో విలాస హాస వయ్యారాలతో భాషించే వ్యక్తి సినారె.

వేలాది గ్రంథావిష్కరణ సభల్లో సకాలంగా ప్రసంగించిన వాగ్భూషణవరేణ్యుడు. లలిత కళారాధనలో వెలిగిన చిరుదివ్వె. మధుర భారతి పద సన్నిధిలో ఒదిగే తొలిపువ్వు. సంగీత సాహిత్య సమలం కృతం, స్వరరాగ పదయోగసమ భూషితం సి.నా.రె. జీవితం.

ఆకాశవాణిలో లలితగీతాలతో, సంగీత రూపకాలతో కవితలతో, ప్రసంగాలతో తొలినాళ్లనుండి కవిగా వినుతికెక్కిన "అయాయ్ చార్మ్ ఇన్ ఆల్ఇండియా రేడియో యాజ్ ఎ పోయట్" అని పార్లమెంటులో స్వయంగా ప్రకటించారు.

సినారే సినీకళా లాస్యం వేయి భావాల శిఖర సమానం. అన్నింటా అందెవేసిన కళాకలం ఆయనిది. ఆయన చూడని సినీ సాహితీ పార్శ్వం లేదు. ఆయన భావానికి అందని బాధ, ఆవేదన, హాస్యం లేదు. లాస్యం లేదు. అందుకే 'నీటిలోన నీడలోన నేనే వున్నా నులే" అంటూ నిత్యం ఆయన పాటలు మనల్నీ అలరిస్తూనే ఉంటాయి. సినీ సాహిత్య విశ్వంభరుడు కదా ఆయన.

"మనసు తెలుసుకున్నవాడు మర్మజ్ఞుడు
తనను తెలుసుకున్నవాడు తత్త్వజ్ఞుడు
అన్నీ తెలుసన్నవాడు అల్పజ్ఞుడు"

అని మనిషి తత్త్వాన్ని బోధించిన కవనరుషి సి.నా.రె. 'కవిత్వం నా మాతృభాష' అని కవితాత్మకంగా తన హృదయాన్ని ఆవిష్కరిస్తారు. ప్రాచీన కావ్య పరిజ్ఞానంతో ఏర్పరుచుకున్న కవితాభాషకు అలంకారికతోను, అనుప్రాసనలతోను వన్నె చిన్నెలు దిద్ది తనదైన శైలిని పొందుపరచుకున్నారు.

సినారె కవిత్వం తాలూకు ధార, లలితమైనా పదబంధాలు పదలాలిత్వం అమోఘం. అంత పాండిత్యం ఉన్న, ఆయన పాటల్లో పంటికింద రాయిలాంటి పదాలు మచ్చుకైన కనపడవు. గేయకావ్యాలు రాస్తే అలా రాయాలి అని అనిపిస్తుంది.

అందమైన శైలీ, లయతత్త్వం, నిర్వహణశక్తి, సన్నివేశకల్పన, స్వప్నభంగం నుంచే కర్పూరవసంతరాయలు, విశ్వనాథనాయకుడు - అన్నిటిలో అది చూడవచ్చు. ప్రయోగాత్మక తత్త్వరచన కవిత్వంలో రాసిన, "విశ్వంభర" దానికి నిదర్శనం. అట్లాగే వస్తువాది తత్త్వంగా కవిత్వం రాయడంవల్ల అది జీవితానికి దగ్గరగా ఉండడం సినారె కవిత్వం ప్రత్యేకత.

"కరగనిదే కొవ్వొత్తికి కాంతి ఎలా పుడుతుంది?
చెక్కనిదే శిల కడుపున శిల్పమెలా పుడుతుంది?
మరగనిదే నీరు ఎలా మబ్బురూపు కడుతుంది?
నలగనిదే అడుగు ఎలా నటనరక్తి కడుతుంది?

తొలినాళ్లలో సినారె కవిత్వ వస్తువులోనూ, భాషలోనూ, సంప్రదాయ వాసనలు గుబాళించాయి. ఆయన అభ్యుదయ దృక్పథం ఏర్పరుచుకున్న తర్వాత వర్తమాన సమాజం వస్తువయ్యాక, ఆయన భాష కూడా మారింది.

సినారె సాహిత్యం సర్వకాలీనం, విశ్వజనీనం, వ్యక్తి వికాసం వరకూ, అన్నీ ఆయన కార్య వస్తువులే. ఆయనకు జ్ఞానపీఠం అందించిన కావ్యం 'విశ్వంభర' విశ్వవిద్యాలయాల్లో పాఠంగా నిలవడం, వివిధ భాషల్లోకి అనువాదం కావడం తెలుగువారికి గర్వకారణం. సాధారణ వాడుక భాషలో సినీ గీతాలైనా, గ్రాంథిక భాషలో పద్యరచన కావ్యాలైన ఒకే శ్రద్ధతో, అంకిత భావంతో రాయడం వల్ల పదికాలాలు తెలుగునేలపై అవి మనగలుగుతున్నాయి.

ఏకాంతంలో ఉదయించే అక్షరాకృతులు సమూహం నాల్కల మీద నర్తించినప్పుడే సార్థకమవుతాయని సమూహం వైపు అన్న కవితల్లో ఏకాంతాన్ని అపూర్వకంగా అభివర్ణించారు. సి.నా.రె కవితల్లో ఏవో అనిర్వచనీయమైన భావాలు అక్షర రూపంలో గోచరిస్తాయి. "శబ్దాన్ని వినడంలో విశేషమే ముంది? నిశ్శబ్దాన్ని వినగలగాలి" అంటారు సి.నా.రె. తనను తాను తెలుసుకోవడం కంటే గణనీయ విద్య మరేముంది.

"భాషే సి.నా.రె. తెచ్చుకున్న తీయనివరం
భాషే సి.నా.రె కట్టుకున్న జీవన గోపురం"

ఆయన వచనం బహువచనం, నాదం సామ్యవేదం, కవిత్వం ఆయన మాతృభాష, ఇతివృత్తం మానవత్వం. తెలుగుకళ్లకు తెలుసు సినారె లలితకళారూపం, తెలిగిళ్లకు తెలుసు, సినారె కలగీతికాదీపం. మార్పు ఆయన తీర్పు, ఆయన ఇంటి పేరు చైతన్యం, తేజస్సు ఆయన తపస్సు, ఉదయం ఆయన హృదయం, సినారెకి వచ్చినన్ని అవార్డులు, రివార్డులు, పదవులు బహుశా తెలుగుకవుల్లో ఎవ్వరికీ వచ్చి వుండవు.

"ఎన్నెన్ని ప్రస్థానాలు మనిషికి
ఎన్నెన్ని పరిభ్రమణాలు మనిషికి..."

అంతలోనే నురగల పరుగు అంతలోనే కదలని అడుగు ఎవరు తాను ఏధాతు గర్భం నుంచి ఎదిగిన మాను ఎలా కుదించుకున్నాయో...?ఇంత మొలకలో అంతటి శాఖలు, ఎలా పాదుకున్నాయో, ఇంత విత్తులో అంతటి సినారె జీవరేఖలు.

అభ్యుదయ కవిత్వకాలంలో పుట్టినకవి సి.నా.రె. దిగంబర, చేతనావర్త, విప్లవ, స్త్రీ, దళిత, బహుజన, ముస్లిం ప్రాంతీయ ఆస్తిత్వ ఉద్యమాల వాదాల, ప్రపంచీకరణ, వ్యతిరేక సాహిత్య కాలాల్లో కవిగా జీవించారాయన. వీటిలో ఒకటీ అరా వాదాలతో ఆయన విబేదించినా, ఈ అన్ని ఉద్యమాల వాదాలసారం సి.నా.రె కవిత్వంలో కన్పిస్తుంది. ఆయన కాలంతో పాటు నడిచిన కవి. ప్రజల పక్షం వహించే ప్రజాతంత్ర

ప్రజాస్వామిక వాదాలనన్నిటినీ సినారె సమన్వయం చేసుకున్నారు.

సినారె రచించిన మంటలూ – మానవుడు, మార్పు నా తీర్పు, ఉదయం నా హృదయం, తేజస్సు నా తపస్సు, కవిత నా చిరునామా, ఇంటిపేరు చైతన్యం లాంటి అనేక కావ్యాల్లో స్వాతంత్ర్యానంతర భారతీయ సామాజిక పరిణామాలు విమర్శనాత్మకంగా ప్రతిబింబిస్తాయి.

అమెరికాలోని 'మసాచుసెట్స్ యూనివర్సిటీలో సినారె కవిత్వాన్ని ఆంగ్లంలోకి అనువదించి విద్యార్థులకు పాఠ్యాంశంగా బోధిస్తున్నారంటే, సినారె గొప్పతనం, ఖ్యాతి, ఎంతవరకు అద్భుతంగా, అపూర్వంగా పాకిందో అర్థమౌతుంది.

"జీవితం ఎందుకున్నదీ అంటే' కవిత్వం రాయడం కోసమే అంటానన్నది తరుచూ వాడే సినారె మాట. కవిగా వక్తగా సామాజిక చైతన్య ప్రబోధమే ప్రధానలక్ష్యమని ఆయన అభిప్రాయం కూడా. సినారె గ్రంథాలు ఇంగ్లీషు, ఫ్రెంచి, సంస్కృతం, హిందీ, మళయాళం ఉర్దూ, కన్నడం తదితరభాషల్లోకి అనువాదమయ్యాయి. ఆయనే స్వయంగా హిందీ, ఉర్దూ భాషల్లో కవితలు రాశారు.

చిరునవ్వులాంటి మనసుంటే, శిరసు వంచుతాను, మోసం దాచిన ముఖమంటే, ఆ ముసుగు చించుతానంటూ

" నాదేశం పావనగంగ, నాదేశం కరుణాంతరంగ
నాదేశం భగవద్గీత, నాదేశం అగ్నిపునీత సీత

అని దేశభక్తిని ప్రకటించి" మనసుకి తొడుగు మనిషి, మనిషికి ఉడుపు జగతి, ఇదే విశ్వంభర తత్త్వం, అనంత జీవిత తత్త్వం అంటూ అక్షరాల ప్రకటించారు.

"రాస్తూ రాస్తూ పోతాను,
సిరా ఇంకేవరకు...
పోతూ పోతూ రాస్తాను,
వలపు వాడే వరకే.." అంటూ

"మరణం నను వరించివస్తే ఏమంటాను, నేనే మంటాను..?"

పాలు పట్టి జోలపాడి పడుకోమంటాను" అంటూ తప్పని మరణాన్ని తాత్త్వికతో జోకొట్టిన సాహితీ విశ్వంభరుడు సి.నా.రె దివికేగారు "నా రణం మరణం పైనే" అంటూ చివరి పుస్తకాన్ని ఆవిష్కరించిన అక్షర హాలికుడి కలం ఆగిపోయింది.

# సి.నా.రె అక్షరం జీవజ్వాల

శ్రీ ఎస్.ఆర్. పృధ్వీ

తెలుగు సాహిత్యం హిమాలయ పర్వతం వంటిది. సాహితీ వైభవానికి కారకులైన కవితమూర్తులెందరో కనిపిస్తారు. వారిలో సుప్రసిద్ధుల కోవకి చెందినవారు సింగిరెడ్డి నారాయణరెడ్డి గారు. ఎక్కడో మారమూల గ్రామంలో జన్మించి, అంచెలంచెలుగా ఎదిగి సాహితీ శిఖరాన్ని అధిరోహించిన గొప్ప కవి, పండితుడు. తల్లిదండ్రుల ప్రేమ, ఆప్యాయతల మధ్య పెరిగినవాడు. ఒక సందర్భంలో తండ్రిని గురించి ఇలా వ్రాసారు.

"కన్న తండ్రి : నల్లని రే
గళ్ళు దున్ని, నా బ్రతుకున
రవ్వలు పండించిన క
ర్షక మణి మల్లారెడ్డి" ప్రేమించిన వాళ్ళను గుర్తు చేసుకోవడంలో ఎంతో సంతృప్తి ఉంటుంది.

సాహితీ పరిజ్ఞానానికి సి.నా.రె. నిలువెత్తు నిదర్శనం. ఆయన మాటే ఒక పాట. సమ్మోహన సౌందర్యం. పద్యం పరవశింపజేస్తుంది. వచనం ఆలోచింపజేస్తుంది. ప్రేమ పునాదిగా మొలిచిన గజల్ మొక్కలోంచి సామాజిక చైతన్యపు పరిమళాలు పుట్టించిన అక్షర మాంత్రికుడు. సి.నా.రె. అంటే అక్షరాల పంటలు పండే కవితా సుక్షేత్రం. ఈ క్షేత్రంలో ఎన్నో రసరమ్య కావ్యాలను పండించారాయన. ఆయన చూపొక ప్రశ్న; ఒక సమాధానం. ఏమిచేసినా, ఏది వ్రాసినా, దానికి శాశ్వతత్వం కలుగుజేయడంలో కృతకృత్యులయ్యారు. అందుకు సాక్ష్యాలు, వారు సృష్టించిన సాహితీ సంపదే.

సినారే ఖ్యాతి వ్యాప్తిచెందని ప్రాంతం లేదనేది వాస్తవం. అధ్యాపకుడుగా ఉద్యోగించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతిగా బాధ్యతలు నిర్వహించినా, రాజ్యసభ సభ్యునిగా నియమించబడినా, అధికార భాషాసంఘం అధ్యక్షునిగా సేవలందించినా, సాహిత్య అకాడమీ సభ్యునిగా కొనసాగినా, ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షునిగా అడుగులు వేసినా, భాషా సేవకి పట్టం గట్టి, నిర్వహణా సామర్థ్యాన్ని నిలుపుకున్న మహా మనీషి.

అటువంటి మహాకవితో నాకూ పరిచయం ఉంది అని చెప్పుకునేందుకు అనేకమంది గర్వపడతారు. అటువంటి వారిలో నేను ఒకడిని కావడం నా అదృష్టం.

సి.నా.రె.తో వున్న అనుబంధం గురించి రెండుమాటలు చెప్పుకోవాలి. లేకపోతే

అసంతృప్తిగానే ఉండిపోతుంది. 1971 ప్రాంతంలో ఆట వెలది, తేటగీతి ఛందస్సులో పద్యాలల్లడం ప్రారంభించారు. 1972లో ఒక గ్రంథాలయంలో సభ్యునిగా చేరినప్పుడు నాకంటపడిన పుస్తకాలు మూడు. మహాప్రస్థానం, కవితా పుష్పకం, మధ్యతరగతి మందహాసం. చదివినా అర్థంకాని వయసులో ఒకసారి తిరిగేసాను. పద్యం వదిలి, వచనం వ్రాయమని నన్ను ప్రేరిపించాయి. సందర్భం వచ్చినప్పుడల్లా ఈ సన్నివేశాన్ని నెమరువేసుకుంటుంటాను, కృతజ్ఞతగా.

నాకు దాశరథి, ఆరుద్ర, శేషేంద్ర, జస్టిస్ ఆవుల సాంబశివరావు, కొంగర జగ్గయ్య వంటి ప్రముఖులంతా ముందుగా ఉత్తరాల ద్వారానే పరిచయం. ఆ తర్వాతనే ముఖతః పరిచయం. సి.నా.రె గారి పరిచయం కూడా ఆ మార్గంలోనే.

1985-86ల నుండి నేను వెలువరించిన పుస్తకాలు వారికి పంపడం. వారు చదివి ఆశీస్సులు పంపడం ఒక అలవాటు. నా సంపాదకత్వంలో వెలువడిన అనేక ప్రత్యేక సంచికలకు కూడా వారు శుభాకాంక్షలు పంపారు. నా పరిచయం ఎప్పుడూ దూరం నుండే. రెండు దఫాలు రాజమండ్రిలో కలిసాను. 2014లోను, 2015లోను రెండుసార్లు వారి చేతుల మీదుగా జ్ఞాపికలందుకున్నాను. మొదటిసారి జ్ఞాపిక ఇస్తూ, "గమనిస్తున్నాను, నిరంతరంగా వ్రాస్తూనే ఉన్నావు" అన్నారు. నా పుస్తకం "ఆధునిక తెలుగు కవిత్వంలో తండ్రి ఒక పరిశీలన" పుస్తకానికి అభినందనలు వ్రాస్తూ, "ఆధునిక తెలుగు సాహిత్యంలో తండ్రి" అనే అంశంపైన మీరు ఎందరెందరో సమకాలీన కవుల కవితలను ఉదహరిస్తూ ఒక పఠనీయ గ్రంథం రచించినందుకు అభినందనీయులు.

మీ గ్రంథంలో ఉదహరించిన పితృమూర్తులలో మా నాయన 'మల్లారెడ్డి' కూడా ఉండడం నా హర్షానికి మారాకు తొడిగినట్లుగా ఉంది" అన్నారు. అలాగే, మరొకచోట ఎస్.ఆర్. పృథ్వి ఉత్తమశ్రేణి రచయిత ఇటు కవిత రచనలో, అటు వ్యాసరచనలో, తమ విశిష్టశైలిని నిలుపుకున్నవారు అనడం, నేనెంత అదృష్టవంతుడినో అర్థమైంది.

మనిషిని చిరునవ్వుతో పలకరించి, అక్కున చేర్చుకునే తత్త్వం సి.నా.రె గారిది. అందువల్లనే వేలాది మంది వారికి అభిమానులయ్యారు. నేనొక కవిగా నిలబడేందుకు ప్రేరేపించిన కవితా కావ్యాలలో వారి కావ్యం 'మధ్యతరగతి మందహాసం' ఒకటని మరోసారి ప్రకటించు కొంటున్నాను. మధ్యతరగతి మనుషుల గురించే చెప్పిన కావ్యమది. కొనడానికి ఆ పుస్తకం మా ఊళ్ళో లభ్యం కాక, గ్రంథాలయం నుండి మరొసారి తెచ్చుకుని, కవితలన్నీ వ్రాసుకుని బైండు చేయించుకున్నాను.

సి.నా.రె పాటలు, గీతాలు తెలుగు ప్రజలను రసస్రవంతిలో ఓలలాడించడం మనకు తెలుసు. చిన్నతనంలో వారితో పెన వేసుకున్న జానపద నేపథ్యమే అందుకు

కారణమని పెద్దల మాట. సి.నా.రెను పంచికట్టులో చూడగానే తెలుగుతనం హుందాగా కనిపిస్తుంది ఆయన భౌతికరూపంలో. అంతరంగమంతా సాహిత్య పరిమళంతో నిండి ఉంటుంది. అందరూ అలవోకగా పలికే మాటలకు తేనెపూసి, కమ్మని పాటలుగా మలిచి, జనవాహినిని ఉర్రూతలూగించిన గొప్పతనం ఆయనకి మాత్రమే దక్కింది. వ్యక్తిగా ఎంత క్రమశిక్షణతో మసలుతారో, వారి సాహిత్యం కూడా అంతే క్రమశిక్షణగా ఉంటుంది. వివాదరహితంగా, తరగని చిరునవ్వుని ఆభరణంగా జీవితానికి అలంకరించుకున్న మహీపతి.

సప్తతి సంబరాల నాటికి వారి రచనలన్నీ సంపుటాలుగా వెలువడెనై. భాషకు అమితంగా ప్రేమించిన భాషాకోవిదుడు సి.నా.రె. భాషంటే ఏమిటో, భాష గొప్పతనం ఎలాంటిదో ఒకచోట చెబుతారాయన. భాష పుట్టింది నాతర్వాతనే; పలికిందీనా తర్వాతనే అంటారు. ఆయన శిశువుగా భాషను పెంచితే, ఆ భాష పశువుని మనిషిగా మార్చిందంటారు. ఈ పంక్తుల్లో సి.నా.రె ఆత్మవిశ్వాసం కనిపిస్తుంది.

"నా ఇంటి వివృత గవాక్షం భాష
నా కంటి వినిర్మల కటాక్షం భాష
విశ్వాన్ని నా గదిలోకి పంపే వెంటిలేషన్ భాష
వేయి పడగలెత్తి నర్తించే ఇన్స్పిరేషన్ భాష" అన్నారు.

భాషే ఆయన తెచ్చుకున్న తీయని వరం అంటారు. భాషే కట్టుకున్న జీవన గోపురం అంటారు. భాష, మాటలుగా, పాటలుగా రూపుదిద్దుకున్నప్పటికీ, ఏ లిపికే అందని భాష, లేలేత చిరునవ్వులో ఉందని ఆయన నమ్మారు. అంతేకాదు. ఆ నమ్మకాన్ని ఆయన పెదాలు, జీవి ఉన్నంత కాలం నిలుపుకోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది.

సి.నా.రె తన పుట్టినరోజునాడు ఒక కావ్యాన్ని ఆవిష్కరింపజేసుకునే సంప్రదాయాన్ని గత కొన్నేండ్లుగా అనుసరిస్తున్నారు. 2012 సం॥లో జన్మదిన సందర్భంగా వెలువరించిన కావ్యం 'వాక్కుకు వయసు లేదు". ఈ గ్రంథం కాపీ ఒకటి ఆగస్టు 13, 2012న, ఆత్మీయుడు శ్రీ ఎస్సార్ పృథ్వికి అని స్వహస్తాలతో వ్రాసి, సంతకం చేసి పంపారు. 82వ సంవత్సరంలో కాలుమోపిన సందర్భంలో వెలువరించిన గ్రంథమిది సరిగ్గా ఇందులో 82 కవితల్ని పొందుపర్చారు.

అక్షరానికి మరణం లేదని చాలామంది పెద్దలు చెప్పినమాట నిజమే. అక్షరాన్ని సృష్టించిన వాడు లేకపోయినా, సృష్టించబడిన అక్షరం అజరామంగా నిలిచే ఉంటుంది. సి.నా.రె వాక్కుకు వయసు లేదన్నారు.

వాక్కు చేత బలం చేకూర్చవచ్చు. ధైర్యాన్ని కలిగించే మాటలు మాట్లాడితే ఎదుటి వాడిని ఆవహించి వున్న అధైర్యం నీరు కారుతుంది. చేయవలసిన కార్యం మీద మనసు లగ్నమౌతుంది. మహాభారతంలో శ్రీకృష్ణుడు, అర్జునిడికి ఉపదేశించినది వాక్ప్రణీతమే కదా!

మానవుడి విషయంలో వాక్కు ప్రధానమైనదిగా పెద్దలు చెప్తారు. నోరు మంచిదైతే, ఊరు మంచదవుతుందన్న సామెత మనకి తెలుసు. నోరు అంటేమాట అని కదా.

'వాక్కుకు వయసు లేదు' కావ్యం అనుభవసారం. ఈ సంపుటిలో కవితలు ఒక్కొక్కటి ఒక్కో ఆణిముత్యం. తిరుగులేని పురోగతి గురించి చెబుతూ కాలాన్ని కవచంగా ధరించి విక్రమిస్తే ఎటువంటి హృదయంమైనా, ఎంతటి తీవ్రమైన ప్రఘాతాలకైనా ఎదురొడ్డి నిలుస్తుందంటారు. ఈద గల్గిన వాడికి స్థిరమైన సంకల్పం తోడుగా వుంటే సువిశాల సాగం యొక్క అవతలి తీరం వచ్చి ఎదురుగా నిలుస్తుందంటారు. అదేవిధంగా ఎండలోమలమల మాడిపోతున్న చెట్లు. వణికించే చలిలో కూడా తనను చేరిన పక్షులకు ఆశ్రయం కల్పిస్తాయంటారు. ఈ రెండింటి కోణాలు వేరు వేరు. అయినా వస్తువు యొక్క తత్వం ఒకటే. అందువలన సమకాలీన పరిస్థితులను తన అధీనంలోకి తెచ్చుకుని జీవనయాత్ర సాగించే ప్రతి జీవికి తిరుగులేని పురోగతి కనిపిస్తుందంటారు.

అంతేకాదు, నిన్ను ఎగరేసుకు పోవాలని వస్తున్న సుడిగాల్పులు, నువ్వు రొమ్ము సాచి కుదురుగా నిలబడితే అవి పిల్లగాలులై నిన్ను ఒడిలోకి చేర్చుకుంటాయి అంటారు. జటిలమైన సమస్యల యొక్క చిక్కు ముడులను విప్పి, వాటంతటవే సమసిపోయేలా మనిషిలో వున్న నిశ్చలమైన సంకల్పం చేస్తుందంటారు. మనిషి, తన జీవన యాత్రను సజావుగా సాగించడానికి ఉండవలసిన లక్షణాల గురించి ఈ కావ్యంలో చెప్తారు. అసలు మనిషికి లోపల ఒక దీక్షంటూ ఉండాలి. అప్పుడు ఏ కార్యాన్ని తలపెట్టినా, నేను సాధిస్తాను అనే నమ్మకం ఒక ఆయుధంలాగ పనిచేస్తుందంటారు.

మనకి ఆప్తులై కీర్తిశేషులైన వారికోసం ఎక్కడెక్కడో వెతకొద్దంటారు. కళ్ళు మూసుకుని, ఏకాగ్రతతో వాళ్ళను తలుచుకున్నప్పుడు, స్మరణీయలందరూ, స్మృతుల ఫలకాలపై నిత్యదర్శనీయులుగా నిలిచిపోతారు అంటారు. వెలుతురుకి, చీకటికి నడుమ ఘర్షణ; నీతికి, నిజాయితీకి మధ్య సంఘర్షణలు నిత్యం ప్రకృతిలోను, మనిషిలోను కనిపిస్తాయి. చీకటికీ వెలుగుకీ నడుమ సంఘర్షణ సర్వకాలీనమైనది. అది ప్రకృతిపరంగా ఏర్పడింది. కాని, మనిషిని, చీకటిలాంటి తన ఆలోచనల్ని చెరిపేసుకుంటూ, క్రాంతిపూర్ణ భావాలను ఎగరేసుకుంటూ ఉద్యమించమంటాడు. అప్పుడే మనిషి 'మనిషి' అనిపించుకుంటాడని అంటారు.

సి.నా.రె కవిత్వమంతా మనిషి చుట్టూరానే సంచరిస్తుంది. ప్రతి అక్షరం సామాజిక వాస్తవికతకు నిదర్శనం. ప్రాపంచిక అభ్యుదయాన్ని కాంక్షించే వారెవరైనా వ్యవస్థను కూలదోస్తున్న అంశాలనే వస్తువులుగా ఎంచుకుంటారు. సి.నా.రె. ఎంచుకున్నవన్నీ సమాజ శ్రేయానికి విఘాతం కలిగించేవే. వాటిగురించి సున్నితంగా చెప్పడంతో కవితకి అందం చేకూరింది.

ఎదురింటి మొక్కలు అనే కవితలో తనకు తాను పొగడుకోవడం సంకుచిత దృక్పథం అవుతుందని, ఎదుటి వారి గొప్పతనాన్ని అభినందించడం సముదాతత్త్వం అవుతుందని మొక్కలను ఉపమానంగా చెప్తారు. కలాన్ని దులిపినంత మాత్రాన అక్షరాలు రాలతాయా? రాలవు. ఆలోచనల్ని కుదపాలి అంటారు. మబ్బు ఎంతగా మధనపడినా చినుకు రాలదు. ఆ చినుకులకు రాలాలి అనే సంకల్పం ఉండాలి అంటారు. ఉదాత్త గుణ సంపన్నులెప్పుడూ తాము చేసే పరోపకారం బాహాటంగా ప్రకటించరు. కాని, నేటి పరిస్థితి భిన్నం. ఒక రూపాయి పరుల కోసం వ్యయపరిస్తే, వంద ఖర్చుచేసినట్లు ఆర్భాటం చేస్తారు. అది తగదంటారు. మనిషిలో సూటిగా చూసే చూపు నిజాయితీకి నిఖార్సయిన మార్గదర్శి అని సి.నా.రె విశ్వాసం.

మౌనం ఒక ఆయుధం వంటిది. మనసు అయస్కాంతానికి ఆకర్షించబడే అవ్యక్తపు ఊహలను అంటకుండా నిరోధిస్తుంది మౌనం.

"నిశ్శబ్దం నీ కోసం నిరీక్షిస్తున్నది / రణగొణ ధ్వనుల ఊబిలోంచి
నేనెప్పుడు బయటపడతానో అని / నిక్కి నిక్కి చూస్తున్నది" అంటారు.

మనసులో రొదలు రేగినప్పుడు ప్రశాంతత వుండదు. కళ్లుమూసుకున్నా నిద్రపట్టదు. అవసరంలేని ఆలోచనలన్నీ మనసు పొరమీదికి ఈగల్లాగ చేరి రొదచేస్తాయి. ఆ పరిస్థితి నుండి బయట పడాలంటే మనిషి తనకు తాను శృతి చేసుకోవాలి అంటారు. రొదలను తుదముట్టించేది మౌనయుద్ధం ఒక్కటే అంటారు. అది చెంత వున్నప్పుడు, ఏ రొదలు అడ్డగించినా, అప్రతిహతంగా జీవన ప్రస్థానం కొనసాగుతుందని అంటారు.

నిక్కచ్చిగా సమయాన్ని పాటించేవాడు సూర్యుడు మాత్రమే. మబ్బులు మసకేసిన సరే నియమం ప్రకారం సూర్యోదయం, సూర్యోస్తమయాలను పాటించేది కిరణాయుధుడైన సూర్యుడు అంటారు. కోరికలు పలురకాలుగా ఉంటాయి. మంచివి, చెడువి. కొన్ని వికృత హాసం చేస్తూ మనసుని ఊపేస్తాయి. మంచిని ఎంపిక చేసుకోవడం మనిషి తత్వానికైనా, ప్రకృతి ఆస్థిత్వానికైనా సమగ్రసార్థకత అంటారు. మైత్రికి మరణం లేదంటారు. స్వప్నం కరిగిపోగానే వాస్తవం ఎదురుగా నిలుస్తుంది. అదే మనిషియొక్క జీవన ప్రగతికి అద్దం పడుతుందని అంటారు.

దృష్టిలోతుల్ని బట్టి అనుబంధాలు ఏర్పడుతుంటాయి. ఏమిటీ అనుబంధం?

"మట్టిలో కురిసే వాన చినుకులను
అయ్యో వాటి అస్థిత్వాన్ని కోల్పోతున్నాయే అని అనుకోవద్దు
అవి రూపాంతరం చెంది త్వరలోనే
మొక్కలుగా మరో జన్మ ఎత్తుతాయి"

అదే మట్టికీ, వాన చినుకుకీ వున్న అనుబంధం అంటారు.

మనుషులకి వింత వింత కోరికలు పుడుతుంటాయట. ఏళ్ళ తరబడి నేలమీద నడిచీ నడిచీ వెగటుపుట్టిన పాదాలకు నీటిమీద నడవాలనే సరదా. చేతివేళ్ళకు నిప్పుకణాలను నిమిరితే కలిగే అనుభవాన్ని అందుకోవాలని ఉంటుందట. ఇటువంటి కోరికలు, మనషిలోని మనో వైపరీత్యానికి సూచికలు అంటారు. చూపుకి రూపం ఉండదు. అయినా, ఎన్నెన్నో రూపాలను స్వరూపాలను కళ్ళకు అందిస్తుందంటారు.

అనునిత్యం మనిషి యొక్క అనుభవంలో జనించే వందలాది సన్నివేశాలకు రూపుకట్టిన అక్షర సమూహమే ఈ గొప్ప కావ్యం అనడంలో అతిశయోక్తి లేదు. సాహిత్యస్ఫూర్తిని సమయానుకూలంగా అక్షరయజ్ఞంలో నింపిన మహాకవి సి.నా.రె.

ఊహలు తలక్రిందులైతే ఎలాగుంటాయో చెబుతారు. చిత్రాన్ని గీసినా, శిల్పాన్ని చెక్కినా, పాట పాడినా, వాటికి పరిపూర్ణత లభించవచ్చు; లేకపోవచ్చు. లభించనప్పుడు నైరాశ్యం ఊబిలో దిగపడొద్దు అంటారు. ఊపిరిని ఊతకర్రగా చేసుకుని పట్టసడలని కృషితో మళ్ళీ ప్రారంభించమంటారు. ఒక కార్యాన్ని తలపెట్టినప్పుడు "పట్టుదల" మనిషికి ముఖ్యమని బోధిస్తారు. మట్టి పొరల్లోకి వెళ్ళకపోతే దుక్కిదున్నే కర్రుకు తృప్తి ఉండదంటారు. కురిసిన మేఘం అవనీ గర్భంలో లీనమైతేనే సార్థక మౌతుందంటారు. బాల్యాన్ని ముద్దిడతారు, ఊరిని అమ్మతోడుగా ప్రేమిస్తారు. నిజమైన క్రియాశీలత విశ్రాంతిని కోరదంటారు.

పగలే చీకటి ఆవహించే సందర్భాలను కవులు మాత్రమే చూడగలరు. సామాన్యులు తెల్లవారింది చీకటి విడిపోయిందని భ్రమిస్తారు. పగటిపూట చీకటి ఆవహించిన సన్నివేశాల గురించి సి.నా.రె గారిలా ప్రస్తావించారు.

"రంగులు మార్చే రాజకీయం / ప్రసారం చేసే ప్రసంగాల మాటున
గుప్తంగా ఉన్నది తేనేనని / తెల్లారగానే చీకటి నిష్క్రమించిందని
అమాయకులు అంటుంటారు / పాపం వాళ్ళకు తెలియదు.
వెలుతురు దుస్తుల్లో ప్రవేశించేది నేనేనని / ఎన్నికలొస్తే చాలు.
కుహనా నేతల మాటల్లో గలగల లాడేది
వాళ్ళందించేమూటల్లో
కిలకిల నవ్వేది నేనే"

ఇక్కడ 'నేనే' అంటే చీకటి కనిపించకుండా వెలుతురులో కలిసి వికటాట్ట హాసం చేస్తుంది. పగలే వెన్నెల కాస్తే ఎంత ఆనందమో, ఆ పగటిని చీకటి మింగేస్తే, అంత బాధాకరం మరొకటుండదు.

చెట్టు మోడు కావటం, చేను బీడు కావటం తాత్కాలికమైన అంశాలు. తిరిగి చెట్టు చిగురిస్తుంది. చేనుపండి ధాన్యరాశులు కురిపిస్తుంది. అలాగే కొన్ని సందర్భాలలో కలాన్ని ఎన్నిసార్లు విదిలించినా ఒక్క అక్షరం కూడా కాగితం మీద రాలదు. ఆ కలానికి సృజన పౌరుషం ఆవేశిస్తే అక్షరాలు పుటల కొద్దీ రాలతాయి అంటారు. సంఘర్షణ నిప్పురవ్వలను పుట్టిస్తుంది. అవి అంతస్సంఘర్షణలైతే ఆలోచనలను రగులు కొల్పుతాయంటారు. ఆలోచన మనిషిని వివేకవంతుడని చేస్తుంది. జరిగే సంఘర్షణలను ప్రతిఘటించి నిలిచినప్పుడు మానవుడు ఆత్మ విజేత అనిపించుకుంటాడు. మనోవైకల్యం మనిషి గతిని మార్చేస్తుంది. ప్రసన్నంగా ఉన్నప్పుడు లౌకిక జగత్తులోని వాస్తవికత కనిపిస్తుంది. కాదని, లక్ష్యరహితంగా అంతర్ముఖంగా ఉండాలని ప్రయత్నిస్తే కనిపించేది వికృత దృశ్యపరంపర అంటారు.

కవిత్వానికి ప్రవాహశీలత ఉంటుంది. అది పంక్తులు పంక్తులుగా ప్రవహిస్తుంది. ధారాళ కవితాఝురి, కొందరికి వంటి మీద దురదపుడుతుంది. అది మందు వేసుకుంటేనో, లేపనం పూసుకుంటేనో తగ్గుతుంది. కొందరికి నోటిదురద ఉంటుంది. వాడి మాటలు వినేవాళ్ళు లేకపోతే నోటి దురదా ఆగుతుంది. ఇంకొందరికి కీర్తి కండూతి దురద పుడుతుంది. ఇది విసర్జనీయమైంది. ఈ దురద పోవాలంటే వాడే ఈ లోకం నుండి పోవాలి.

ఇలా లోకసహజమైన వర్తమాన జీవన అంశాలను ఎన్నింటినో ఈ కవిత్వం ద్వారా చెప్తారు. సి.నా.రె కి స్నేహం విలువ బాగా తెలుసు. వారి జీవితంలో స్నేహం గౌరవించబడింది. స్నేహం అనేది మానవ జీవితంలో అనుసరించవలసిన ఒక ధర్మం. అటువంటి స్నేహం గురించి వ్రాస్తూ

"అసలైన స్నేహానికి / సంయోగమే తప్ప వియోగం లేదు
చిరునవ్వుల నురగలతో / తరగలెత్తే స్నేహం ఏనాడూ
ముఖం మాడ్చుకోదు" అంటారు. ఇంకా, పూల లాలిత్యాన్ని, తేనెల మాధుర్యాన్ని, గగనాల ఎత్తులను, సాగరాల లోతులను, తనలో పొదుగుకున్న సముదాత్త మానవ ధర్మమే స్నేహమని అంటారు. అందుకే సి.నా.రె కలం స్నేహానికి జోహారని గళమెత్తి పలుకుతుంది.

మనిషికి ఏకాగ్రత అవసరం. క్రియాశీల దృక్పథం మనిషిని చైతన్యవంతుడిని చేస్తుంది. అందుకోసం మదిలో గూడుకట్టుకున్న శూన్యాన్ని బహిష్కరించాలి అంటారు.

వయసుకి వార్థక్యం ఉంటుంది గాని, వాక్కుకి ఉండదంటారు. వాక్కుకి, వయసుకి వున్న వ్యత్యాసం గురించి ఇలా అంటారు.

"ఏళ్ళు పై బడుతుంటే
వయసుకు ముఖం నిండా ముడతలొస్తాయి
కాళ్ళు ఊగుతూ తూగుతూ / నడుస్తుంటాయి
పసవున్న వాక్కుకి ఇవి వర్తించవు.
అది ఎప్పుడు నిటారుగా నిల్చుంటుంది.
నిబ్బరంగా నడుస్తుంది / మనసు పిలచినప్పుడల్లా వచ్చి
వాక్కు చేతులు కట్టుకుని నిల్చోదు / స్వేచ్ఛ దానికి ప్రాణం
తాను రావాలనుకున్నప్పుడు / అది ఎగిరొచ్చి
నాల్కమీద వాలుతుంది. / ఎగిరే గుణం వాక్కుకే గానీ
వాలిపోయే వయసుకు లేదు"

సి.నా.రె వాక్కుకి విలువుందన్నారు. ప్రతి మాటకి కాదు. 'పసవున్నా వాక్కు' కేనన్నారు ఇంకా

"వాక్కు చూసేది వర్తమానాన్నే
వర్తవమానంలో గర్భితంగా వున్న
భవిష్యత్తునే" అన్నారు.

వర్తమానంలోంచి భవిష్యత్తు వైపు పయనించగల సామర్థ్యం వాక్కుకు ఉందని చెప్పడమంటే సామాన్యులకు సాధ్యం కానిది.

మనిషి ఆశాజీవి. పరిణామం చెందుతున్న వర్తమానంలోంచి మనిషి జీవనానికి ఊతమిచ్చే ఎన్నో ఆశలను వివరిస్తారు. ఈ కవితా కావ్యమంతా ఏకధారగా సాగుతుంది.

కాలం కరచాలనం చేస్తుందని కొన్ని సన్నివేశాలను వివరిస్తారు చూడండి.

"పచ్చనిచెట్టు నీడలో
ఎంతసేపు కూర్చున్నా విసుగుపుట్టదు" ఎందుకు? అనే ప్రశ్న వేసుకున్నప్పుడు
"ఆ నీడ అందించే చల్లదనాన్ని / నిర్వచించగలిగేది
దాన్ని అనుభవించే శరీరమే" అని సమాధానం లభిస్తుంది. ఒక కార్యాన్ని తలపెట్టినప్పుడు రేపు, రేపు అని వాయిదా వేసుకుంటూపోతే తలపెట్టిన కార్యమెలా

సిద్ధిస్తుంది. ఆచరణలో పెట్టినప్పుడు సరళ స్వభావమున్న కాలం / కరచాలనం చేసి అభినందిస్తుంది" అంటారు.

వీరి కవిత్వంలో చాలా సందర్భాలలో ఒక అనుకూల అంశాన్ని ప్రతిపాదిస్తారు. ఆ అంశం ఏ విధంగా అనుకూలంగా మారుతుందో చెప్తారు.

"కోరికలకు కొలతలు లేవు / వాటికి సంఖ్యానియత అసలేలేదు
తీరినకొద్దీ అది ఊరుతూ ఉంటాయి / మనం నిద్రపోతున్నప్పుడు కూడా
అవి విశ్రాంతి తీసుకోవు
కలల వేదిక పైన చిందులు వేస్తుంటాయి" ఈ కోరికలు మనిషికి అనుకూలత సిద్ధింపచేయడానికి –

"కోరికలకున్న / రెండు పరస్పర విరుద్ధ పార్శ్వాల్లోంచి
మంచిని ఎంపిక చేసుకున్నప్పుడే / మనిషి వ్యక్తిత్వానికైనా
ప్రకృతి ఆస్తి – త్వానికైనా / సమగ్రసార్థకత" అంటారు.

ఒక అంశాన్ని ప్రతిపాదించి, దానికి సమాధానంగా మనిషి ఉపయోగంలోకి తెచ్చుకునే విధానాన్ని బోధిస్తారు. ఇంత పెద్ద కవితా కావ్యంలో ఎక్కడా కూడా చెప్పిన అంశాన్ని తిరిగి చెప్పిన సంఘటన ఎక్కడా కనిపించదు. ప్రారంభం నుండి చివరి వరకు ఒకే దారిన నడవడం వీరికే సాధ్యపడిందేమో!

సి.నా.రె గారి విషయంలో దర్శనం, సృజన రెండూ సమాంతరంగాను, పరిపుష్టితోను సాగడం గమనిస్తాం. వస్తువును ఆవిష్కరించడంలో కొత్తదారులెన్నో చూపుతారు. గేయ, వచన రీతులను ఏకాకాలంలో అభినందనీయంగా నడిపించిన ఉదాత్త చరితులు సి.నా.రె. సమకాలీన సమస్యలపై, సందర్భాలపై స్పందిస్తూ, వచన కవితాధారను భాషా పటిమతో అలవోకగా కావ్యాలతో గుప్పించిన మహాకవి. సి.నా.రె వ్యక్తిత్వం ఎంత గొప్పదో వారి కవిత్వం అంతకంటే గొప్పది. తెలుగు అక్షరం ఆయన కలంలో కోరుకున్న రీతిలో ఒదిగిపోతుంది. అంటే ఆశ్చర్యపడనక్కరలేదు. వచన కవిత్వ రచనలోను, గేయ రచనలోను సి.నారె. సార్వభౌముడు. ఆయన లేరన్న నిస్పృహను వీడి, తరతరాలు అనుభవించేందుకు సృష్టించిన తెలుగు సంపదను స్వాదించడమే సి.నా.రెకిచ్చే గొప్ప నివాళి.

# నీ పేరు తలచినా చాలు ...

డా॥ కంపల్లె రవిచంద్రన్

సినారె రాసిన మొదటి సినిమాపాట **'కలల అలలపై తేలెను మనసు మల్లెపూవై/ ఎగసి పోదునో చెలియా నీవే ఇక నేనై....** పూర్తి కావ్యగౌరవాన్ని సంపాదించిన పాట ఇది. పాట ఆసాంతం ప్రేయసి చేత చిలిపిప్రశ్నలు వేయించి, ప్రియుడిచేత గడుసు సమాధానాలు చెప్పించేరీతిలో రసభరితంగా సాగుతుంది. నిజానికీ పాటంతా ప్రశ్నా సమాధానాలే. ఇదే టెక్నిక్ ఆయనే రాసిన 'మబ్బులో ఏముంది?' (లక్షాధికారి) పాటలో కూడా కన్పిస్తుంది.

ఎన్.టి.రామారావు, నాగరత్నల మీద చిత్రీకరించిన పాట ఇది. జోసఫ్, కృష్ణమూర్తి ఈ పాటను యమన్‌రాగస్వరాల అలలపై తేలియాడించి, మల్లెలు, విరజాజుల సోయగాలు జోడించి రసగుళికగా అందించారు. ఎస్.జానకి, ఘంటసాల కంఠాల మేళవింపులో కూడా మలుపుమలుపునా శృంగారం తొణికిసలాడుతుంది. స్వరాల విరుపులు, పదాల మలుపులు, నటీనటుల మెరుపులు, అన్నీ యాభైఐదేళ్లు కావస్తున్నా, పాట అందాల్ని చెక్కు చెదరనీయలేదు. ఐతే, ఈ చిత్రంలో "నన్ను దోచుకుందువటే...' అనే పాట ప్రజానీకానికి బాగా దగ్గరైనందువల్ల, అప్పటికి జమున మాంచిఫైలులో ఉండడం వల్ల, నూతనతారపై చిత్రీకరించిన ఈపాట ఎంతగొప్పదైనా అడవిలో కూసిన కోకిలవలే ఉండిపోయింది.

'నాగార్జునసాగరం (1955), 'కర్పూర వసంతరాయలు' (1957), వెన్నెలవాడ (1959), 'రామప్ప (1960) మొదలైన కావ్యాలతో సుస్థిరకీర్తి సంపాదించుకున్న తర్వాతే సి.నారాయణరెడ్డి చిత్రరంగప్రవేశం చేశారు. ఆ సుముహూర్తబలమేమిటో తెలీదుగానీ ఎన్నోవినూత్న, విశిష్టభావాలు గలపాటలతో రసికజనులను ఉర్రూతలూగించారు ఆయన.

అదివరకు 'కొమ్మపై కోయిలా', 'ఆ మబ్బు ఈమబ్బు', 'కలకల ఆ కోకిల', 'కుహుకుహు మని పాడే కోకిలా!" అంటూ గాయనీగాయకులు గొంతెత్తి, గొంతులు బొంగురుపోయేవరకూ గోలచేసి వదిలిపెట్టారు. 'చంద్రుని' మీద చంద్రునికున్న మచ్చల కన్నా ఎక్కువ పాటలు వచ్చాయి. నక్షత్రాలనైనా లెక్కపెట్టగలం గానీ, నక్షత్రాల మీద, వెన్నెలమీద, వసంతఋతువు మీద, కలువలమీద అరిగిపోయిన గ్రామ ఫోన్‌ప్లేటులా ఎన్ని పాటలొచ్చాయో లెక్కించలేం. హఠాత్తుగా 'ఏరువాక' (రోజుల మారాయి; కొసరాజు) జిక్కి మీద ఒక పాటవచ్చి, శ్రోతల చెవులకు పట్టిన బూజును కొంతవరకు తొలగింపచేసింది. ఈ పరంపరలోనే దాశరథి, సి.నారాయణరెడ్డి లాంటి

అభ్యుదయకవుల అవసరాన్ని చిత్రనిర్మాతలు గుర్తించారు. అసలు ఆ సమయంలో బలమైన కథతో పాటు కమ్మనిపాటలు కూడా చిత్రవిజయానికి తోడ్పడుతాయని ఋజువుచేసిన సందర్భాలే ఎక్కువ. అందుకే నారాయణరెడ్డి శుభాగమనం ఒక గొప్ప ఆశారేఖ వెలిగినట్లేనని చెప్పడంలో అతిశయోక్తి ఏమీ లేదు. వాణిజ్యరంగమైనప్పటికీ వాణి పలికించే మాణిక్యవీణా నిక్వణాలు వినిపించిన సమర్థులు సినారె.

---

నారాయణరెడ్డి నవరసమయరచనలు చదివి, ఆ మధుర రసాస్వాదనలో మైమరచి, తమ హృదయపీఠాలపై వారి కవితాసరస్వతిని ప్రతిష్ఠించి, ప్రమోద కుసుమాలతో పూజించని రసజ్ఞులుండరు. వారి కావ్యాలు సకల కళలకు నెలవులు, కవన కపురపు తావులు. వారి గేయాలు సుమమాలలు. 'కర్పూరవసంతరాయలు'లో లకుమ నృత్య భంగిమలను గూర్చి వీరు రాసిన చరణాలు చదువుతుంటే, కళ్లముందు ఆ కన్య కేళీ నాట్యవిన్యాసాలు కనిపిస్తాయి. ఆ మంజుల మంజీరధ్వనులు చెవులలో దాగుడుమూత లాడుతాయి.

ఇటువంటి కవి సినిమాలకు రాస్తున్నారంటే ("గులేబకావళి" రోజుల్లో) అబ్బురంలో ఉబ్బితబ్బిబ్బై పోయారు ఆనాటి ప్రేక్షకులు. ఆ చిత్రం విడుదలైన తర్వాత విసుగు, విరామం లేకుండా ఆ పాటలను పదేపదే విన్నారు. పదహారు ప్రబంధాలలో పరిఢవిల్లిన ప్రౌఢ శృంగార పరీమళాన్ని కవితానల తప్తగావించి, ఆ దివ్యగంధాన్ని **'మదనాసుందరనా దొర'** పాటలో యిగిర్చారు. జావళి సరళినున్న ఈపాటలో మాటలన్నీ అతిసరళాలు. అతిమధురాలు. అతితరళాలు. వెతికిచూచినా ఒక్క ద్విత్వాక్షరం కనబడదు.

**గిలిగింత లిడయింత పులకింతలేదేమి పాట** పాడిన పి.సుశీల కంఠంలో విలాసం, వయారం మయూరనృత్యం చేస్తున్నట్లుంటాయి. ఈ పాటకు తగిన అంతస్థులో సంగీతరచనచేసింది వేలూరి కృష్ణమూర్తి (చిన్నమ్మకథ), జోసఫ్, రెండు రాగాలను అద్వితీయంగా, అపూర్వంగా మేళవించి అపూర్వమైన ప్రయోగం చేశారు. ఆ రాగాలు కేదారగౌళ, బలహంస.

ఇన్ని దశాబ్దాలు దాటినా ఈ జావళి పూర్ణశశిబింబ సమాన ప్రకాశితం. తర్వాతి రోజుల్లో ముఖ్యంగా డి.వి.ఎస్.రాజు, భావనారాయణ, విఠలాచార్య తాము తీసినచిత్రాల్లో నారాయణరెడ్డి చేతే జావళులు రాయించుకోవడానికి ఈ పాటే ప్రేరకం.

---

వాసవి ఫిలింస్ "అనుబంధాలు" (1963) చిత్రంలో నారాయణరెడ్డి రాసిన **నా పేరు సెలయేరు / నన్నెవ్వ రాపలేరు / తడియారని వలపులతో / తరలి పొరలి తిరిగేను...**

ప్రతిచరణంలోకూడ ఇటు సెలయేటి పరంగా, అటు సింగారమే బంగారంలా జీవించే స్త్రీపరంగా చెప్పుకోదగ్గ అర్థముంది. ఈ ద్వంద్వార్థం తెచ్చిపెట్టుకున్నట్టుగా లేక అతిసహజంగా, అతిసరళంగా ఉండడం మరొక ప్రత్యేకత. ఈపాటలో అన్ని అందాలభావనలు ఒకఎత్తు. **ఎంతటిమునినైనా నాచెంతకు లాగేను** అన్నది ఒకఎత్తు అవును మరి. యెంతటి మునియైనా మున్కలిడ నదికి రాడా? అది ఆ జాణ ఉద్దేశం. అలానే ఎంతటివాడైనా తన అందం ముందు తలవంచాల్సిందే అని, రచనలో ఈఅందాల్ని తెచ్చింది నారాయణరెడ్డిలేఖినిలోని నెఱజాణతనం. తెలుగుసినిమాలలో వెలిగిన శ్లేషాలంకారగీతానికి చటుక్కున జ్ఞాపకం వచ్చే మనోహరోదాహరణ ఈ పాట.

ఈ పాట కైపుతో, మత్తు కలిగించేలా పాడింది ఎల్లారీశ్వరి. ఆమె కంఠంలో ఉండే హద్దులు, అందాలు సరిగా అవగాహన చేసుకుని ఎం.బి.శ్రీనివాస్ వరస సమకూర్చారు.

---

తమ్మారెడ్డి కృష్ణమూర్తి నిర్మించిన "లక్షాధికారి" (1973) చిత్రంలో నారాయణరెడ్డి రాసిన మూడుపాటల్లో విలక్షణమైంది. **'దాచాలంటే దాగదులే'.**

సినిమా పరిభాషలో ఈతరహాపాటలను 'టీజింగ్ సాంగ్స్' అంటారు. గానీ నచ్చినవారి వెంటబడే 'ప్లీజింగ్‌సాంగ్సే' ఇవి. ఈ పాటలోని 'వదలను వదలను వదలనులే...' అనే ప్రయోగానికి ఆ రోజుల్లో పాప్యులర్ అయిన 'కభినహిఁ కభినహిఁ కభినహిఁ' అనే హిందీపాటలోని మాటలు ప్రేరణ, పల్లవి చివరలోనే కాదు, చరణం చివర కూడా ఆ కొలతలోనే **కదలను కదలను కదలనులే, విడువను విడువను విడువనులే** అంటూ ఆ వరసలోనే ముక్తాయింపులు ఉండడం ఈ పాట స్వరరచనలోని ప్రత్యేకాంశం.

మొదటి చరణంలో కథానాయకుని సన్ననిమీసాన్ని, నున్ననిబుగ్గలను కూడా వర్ణించడం ఆ పురుషపుంగవుని ఓరచూపులను బంగారు తూపులనడం ప్రబంధగంధమున్న అభివ్యక్తులు.

రెండోచరణం – కవిత్వం పొదుగుతున్న పాదాలు, నాయకుని అందమైన శీలం పట్ల నాయికకున్న నమ్మకానికి అక్షరరూపాలు.

ఈ పాటంతా గమనిస్తే, యువప్రణయం ఇంతకన్నా పొందికగా పాటలో అమరుతుందా? అన్పిస్తుంది. చలపతిరావు 'నటభైరవి' రాగంలో చేసిన వరసలో

పెద్ద కొత్తదనం కొట్టొచ్చినట్లు లేకపోయినా – పాటకు తగినట్లుగా ఉరకలు వేసే యువనదిలా, పరుగులు తీసే ఒంటిగిత్తలా, ఉత్సాహంతో ఊగిపోతుంది. ఈ ఊపుకే కదా యాభైఏళ్లు పైబడినా, ఈపాటకు ఇంకా శ్రోతలు ఊగుతూనే ఉన్నారు.

పి.సుశీల కూడా చాలా తేలికగా, చిరుగాలికెగిరే పైటచెంగులా, హాయిగా, తీయగా పాడారు. ఆమె పాడిన వందలాది ఉడికింపుగీతాలలో ఇదొక ప్రత్యేక గీతంగా శ్రోతల మదిలో మంచిచోటు చేసుకుంది.

---

భానుమతీరామకృష్ణులు నిర్మించిన 'వివాహబంధం' (1964)లో విలక్షణమైన పాటలు రాశారు సినారె. అందులో తప్పక చెప్పుకోదగ్గ చెప్పుకోవలసిన గీతాలు రెండు. మొదటిది **ఆలుమగలు విడిపోయినంతనే..** అనే పాట. భారత వైవాహికధర్మాన్నీ, ఆలూమగలు బంధాన్నీ ఇంత అందంగా చిత్రించిన పాట మరొకటి లేదేమో ("కోడరికం"లో ఎం.ఎల్.వసంతకుమారి పాడిన 'ఇల్లాలు' పాట మినహాయిస్తే!) ప్రత్యేమైన మార్గంలో తన కవితను పయనింపజేయడంలో తనకుతానే సాటి అని సి.నా.రె నిరూపించుకున్న పాట ఇది. ఈ పాటలోని చరణాల్లో వైవాహిక సంబంధమైన సంప్రదాయికపదాలు చాలా మెలకువతో ప్రయోగించారాయన. వివాహం అనేది ఒక విధానం మాత్రమే కాదు, ఒక బాహిరబంధం మాత్రమే కాదు, నుదుట బాసికం, పాదాల పారాణి తీసేయవచ్చు. మాసిపోవచ్చు, అగ్నిసాక్షిగా అంకితమైన అంతరంగాలు వేరవుతాయా? ఇది నాయిక హృదయమథనం లోంచి వెలువడిన హాలాహలం లాంటి ప్రశ్న. అందులో నుంచే అమృతం ఉద్భవిస్తే అదే అసలైన పరిష్కారం. నిజానికి పరిణామం అలాగే ఉండాలి. చివరిచరణంలో – **కోవెల తలుపులు మూసినంతనే దైవం దూరమైపోవునా మనసున చీకటి కమ్మినంతనే మమతలవెలుగులు మాయునా"** అని పైఅభిప్రాయాన్నే సి.నా.రె సూచించారు. ఇక్కడ దైవం భర్త. 'మనసున చీకటి' అభిప్రాయభేదాలకు సంకేతం. చీకటిపోయి వెలుగొస్తుంది. వివాహబంధం అనురాగాన్ని పెనవేసుకున్న విశేషబంధంగా మరింత దృఢమౌతుంది. ఇదీ ఆశారేఖ! నిట్టూర్పులోంచి ఓదార్పు మొగ్గతొడిగే పదునైన సన్నివేశానికి మంచిపాట రాశారు సి.నా.రె.

ఇంత అందమైనపాటను విషాద మాధుర్యంతో మరింత అందంగా పాడారు భానుమతి. ఈపాట వింటూంటే విచారంతో లీనమైపోవాలనీ, ఆ బాధలతో పాలుపంచుకోవాలనీ అనిపిస్తుంది. అలాంటి భావాలు శ్రోతలలో భానుమతి తప్ప మరెవరూ కలిగించలేరు. తీయనిబాధ అని అంటారే – అటువంటిబాధతో నింపివేస్తుందీ పాట.

---

"పూజాఫలం" (1964) చిత్రం కోసం ఎస్.జానకి పాడిన **పగలే వెన్నెల జగమే ఊయల / కదలే ఊహలకే కన్నులుంటే...** అని సాగే ఈ అద్భుతగీతం విననివాళ్లు ఉండకపోవచ్చు. సి.నారాయణరెడ్డి రాయగా ఎస్.రాజేశ్వరరావు స్వరపరచిన గీతం ఇది. ఈ చిత్రంలో వినబడిన తడవలు బట్టి నిర్ణయిస్తే ఈ పాటనే 'థీమ్‌సాంగ్' అని చెప్పుకోవచ్చు. పియానో ముందు జమునతో చిత్రీకరింపబడినప్పుడే కాక - ఎన్నోమార్లు నేపథ్యంలో వాద్యగోష్ఠిగా, లీలగా, గాత్రమార్గాన, పరూర్ గోపాలకృష్ణ వాయులీనాన, మరొకచోట సావిత్రి ముఖభావాల మీద (సుశీల కంఠాన వినిపిస్తుంది.

ఈ పాట సాహిత్యాన్ని కాగితంపై రాసి చదివితే గజల్సు, రుబాయీలలో పాటించే అంత్యప్రాసలన్నీ అమృతపదాలుగా ఒదిగిపోయి కనిపిస్తాయి. శ్రోతలు పులకించిపోయారు. 'తొంగిచూచె', 'పొంగిపూచె', 'పరుగుదీసె', 'శిరసునూపె', 'నెమలి ఆడె", 'పికము పాడె', 'కురిసిపోదా', 'నిలిపిపోదా, 'విరిసిపోదా...' ఇలా ప్రతిపదంలో ఒక చక్కనివడి, ఒరవడి ఉన్నాయి. నిజానికి 'కదలే ఊహలకే కన్నులుంటే' అని ముందురాసి, 'పగలేవెన్నెల జగమేఊయల' అని తరువాత ఉండాలని, అలా లేకపోవడంతో అన్వయలోపం జరిగిందని వి.ఏ.కె. రంగారావు అప్పట్లో ఈ పాటపై పెద్దవిమర్శలే చేశారు. కాన్నీ దీన్ని సి.నా.రె. కవితాచమత్కృతిగా మనం సరిపెట్టుకోవాలి. సింధుభైరవిఛాయలలో చెవికింపుగా, నోటికి నిండుగా వచ్చే పాట ఇది. ఎన్నిసార్లు విన్నా తనివితీరదు; అలా హృదయాంతరాళంలో మార్మోగుతూనే ఉంటుంది. ఈపాట గురించి రాయలంటే కొత్తఉపమానాలను వెతకాలి. ఒక్కమాటలో చెప్పాలంటే మాధుర్యానికీ, మానసికానందానికీ వంతెన కట్టాయి. సి.నా.రె కలం, జానకి గళం, గతంలో 'యువభారతి' సంస్థ వెలువరించిన సి.నా.రె సినిమాపాటల సంకలనానికి; ఎస్.జానకి పాటల ఆడియోకాసెట్‌కు, 'పగలేవెన్నెల' పేరుపెట్టడం ఈ పాటకున్న జనరంజకశక్తిని తెలియజేస్తుంది.

---

'రామప్ప' శ్రవ్యరూపకంలో శిల్పాలను వర్ణిస్తూ, 'ఉలుల తాకిడికి జలల పొంగిన అలలు' అంటారు ఇంకా 'రాల లోపల పూలు పూచిన రామమందిర లీల.... రాలలో హృదయాలు వెలసిన రాసకేళీశాల' అని చక్కని ఉపమానాలంకారాల్ని ప్రయోగించడంలో తనకు తానేసాటి అనిపించుకున్నారు. అదే 'రామప్ప' రూపకంలో 'ఈ నల్లనిరాలలో ఏ కన్నులు దాగెనో...' అని ఓ గంభీరగీతం ఉంది.

పాలగుమ్మి విశ్వనాథం స్వరపరచిన ఆగీతాన్ని ఆ రూపక నాయకపాత్రధారి మంగళంపల్లి బాలమురళీకృష్ణ సహజ గంభీరమధురస్వరంతో గానం చేశారు. ఆకాశవాణి శ్రోతలకు అదోవిందు. డి.ఎల్.నారాయణ సలహామేరకు దర్శకనిర్మాత

బి.ఎస్.రంగా ఈ పాటను 'అమరశిల్పి జక్కన్న' (1964) సినిమాకి అరువు తీసుకున్నారు.

ఈ పాటలోని పదాలకు నోరువచ్చి పాడినంత సహజంగా ఈ పాట పుట్టిందని చెప్పవచ్చు. పల్లవిలో చిరు ప్రశ్నలుంటాయి. చరణంలో రుచికరసమాధానాలు ఉంటాయి. అవి సూటిగా లేకపోయినా శిలల సహజత్వం తెలియచేస్తుంటాయి. శిలలు ఇలా కూడా మాట్లాడగలవని, కఠినంలో వెన్న ఉన్నసంగతులను కవి పలికించిన తీరు అత్యంతరమణీయం. ప్రతిపదంలోను ఒక సుందరత విలసిల్లుతున్నది.

కవితామూల్యాలు పొదుగుకున్న ఈపాటను ఎస్.రాజేశ్వరరావు రేడియో వరస గాకుండా, మోహనరాగంలో ఎత్తుకున్నా భావానికి తగిన గానమాధురి నింపడం కోసం చరణాల్లో మోహనరాగంలో లేని మధ్యమనిషాదస్వరాలను కూడా మేళవించారు. 'కన్నులు దాగెనో'' అన్నప్పుడు కిందిస్థాయిలో పలికి, 'గుండెలు మోగెనో' అన్నప్పుడు పైస్థాయిలో రాగాన్ని గమకాలతో పొడిగించి హృదయస్పందనలకున్న ప్రాధాన్యాన్ని వ్యక్తీకరించారు. అలాగే మిగతాచరణాల్లో కూడా శబ్దార్థాన్ని బట్టే స్వరసంధానం చేశారు. ప్రత్యేకించి చెప్పుకోదగ్గ స్వరకల్పనా నిపుణత చివరిచరణంలో ఉంటుంది. 'పైన కఠినమనిపించును' అనే పంక్తిలో 'పైన' అనే పదం పైస్థాయిలో అనిపించి, 'లోన వెన్న కనిపించును' అనే పంక్తిలో 'లోన' అనేపదం లో స్థాయిలో పలికించడం సాలూరి వారి భావోచితస్వరమేళనకు మచ్చుతునకలు.

అయితే వాద్యగోష్ఠి ఉలుల శబ్దాన్ని చిత్రీకరణలో సద్వినియోగపరచకపోవడం ఈ పాటలో ఒకదోషం.

శిల్పి జక్కన శిల్పకారుడే గాదు గాయకుడు కూడానేమో ననిపించే విధంగా ఘంటసాల తనగాత్రంతో ఈ పాటకు అజరామరత్వం ప్రసాదించారు. ఇక నటసమ్రాట్ అభినయం సరేసరి. వేరే వ్యాఖ్యానమక్కరేలేదు. కవి, స్వరకర్త, గాయకుడు, నటుడు.... ఇలా నలుగురూ పాటను చిత్రపటంగా నాలుగుపక్కల ఉండి పాటకు పరమార్థం చేకూర్చారు. యాభై సం॥లు దాటిపోయినా, వన్నెతరగని, చెక్కుచెదరని పాట ఇది.

---

రిపబ్లిక్ ప్రొడక్షన్సు సీతారాం తీసిన 'బొబ్బిలియుద్ధం'(1964) చిత్రంలో నారాయణరెడ్డి రచనకు సాలూరి రాజేశ్వరరావు సంగీతంలో పి. భానుమతి పాడిన పాట 'ఊయలలూగినదోయి మనసే...".

ఈ చిత్రంలో "మల్లమదేవి" పాత్ర ప్రౌఢపాత్ర. మరి పాటకూడా ఆ కోవలోనే ఉండాలి కదా! ఎస్.రాజేశ్వరరావు చాలా జాగ్రత్తగా భానుమతి తలూపిన ట్యూన్ సిద్ధం చేశాక నారాయణరెడ్డిని పిలిపించి పాట రాయించారు.

**ఊయలలూగినదోయి మనసే**

**తీయని ఊహల తీవెలపైన** తాను ఊయల ఊగుతూ పాట పాడే పాత్రకాదది. అందువల్ల మనసు ఊయలలూగింది అన్నారు సి.నా.రె. 'ఊహలతీవెలు' అనే రూపకం తప్ప చెప్పుకోదగ్గ కవితా ప్రౌఢి లేదీ పల్లవిలో. అయితే చిన్న రహస్యం ఉంది. ఎస్. రాజేశ్వరరావు కూర్చిన బాణీలో ఎక్కడా ద్విత్వాలకూ, సంయుక్తాక్షరాలకూ తావులేదు. గేయకర్త ఆ ట్యూనును అవలీలగా పట్టుకోగలిగితే ఆ పాటను పట్టపుటేనుగా చేసేస్తారు సాలూరివారు.

అభినయం, గాత్రాభినయం పుట్టుకతోనే చెవులకు లోలాకులుగా తెచ్చుకున్న భానుమతి గంధర్వగాత్రంలో వెలువడ్డ అమృతధార ఈపాట. "మల్లీశ్వరి" తర్వాత ఎన్.టి.రామారావు, భానుమతిల కాంబినేషన్‌లో వచ్చిన చిత్రమిది. అందుకే ఈ చిత్రానికి మొదట మాస్టరువేణును సంగీతదర్శకుడిగా తీసుకున్నా, సీతారామ్ పెద్దబ్బాయి ప్రభు "మల్లీశ్వరి" సంగీతకర్త ఎస్.రాజేశ్వరరావునే పట్టుబట్టి ఈ చిత్రానికి నియమించుకున్నారు. నారాయణరెడ్డి కూడా "మల్లీశ్వరి"ని దృష్టిలో పెట్టుకునే 'బొబ్బిలియుద్ధం'లో మనసునే ఊయల లూగించారు.

యమన్‌కల్యాణిరాగంలో అతిమధురంగా భానుమతి పాడిన ఈ పాటను వింటున్న వారి మనసులూ, తనువులూ కూడా ఊయలలూగుతాయనడంలో ఏ మాత్రం సందేహం లేదు. అరశతాబ్దం దాటిపోయినా నేటికీ తెలుగుప్రేక్షకుల గుండెలలో ఊయలలూగి, తెలియనిహాయి కలిగిస్తూనే ఉందీ పాట.

---

సందర్భాన్నీ, పాత్రల మనోభావాల్నీ ఒడిసిపట్టి అక్షరసంపదను పాటగా మలచడంలో సి.నా.రె సిద్ధహస్తులు. "మంగమ్మశపథం" (1965)లోని **రివ్వున సాగే రెపరెపలాడే..** పాటలో యవ్వన సోయగాలు, సొగసులు, పరువాలు, రూపలావణ్యాలు అన్నీనావే, నావే అనే పాత్ర మనోభావాన్ని చక్కగా పలికించారు.

కథానాయిక మంగమ్మ (జమున) పై చిత్రీకరించిన గీతమిది. సంగీతదర్శకులు ఇచ్చిన బాణీలకు రాసిన పాట ఇది. టి.వి.రాజు ఇచ్చిన పల్లవిలో మధ్యమధ్య మెత్తని తబలా చరుపులకు తగినంత కాలవ్యవధి ఉంది. ఓ రకమైన ఊపుకోసం అవలంబించేపద్ధతి అది. తరగెత్తే నురగవయసులో ఉరకలెత్తే పల్లెపడుచు పాడుకున్న పాట ఇది. యవ్వనం రివ్వునసాగడం, పదేపదే సవ్వడిచేయడం పడుచుదనాన్ని

వ్యక్తం చేయడానికి కవి చేసిన గడుసు ప్రయోగాలు. నాయిక స్వాభిమాన ప్రవృత్తిని ద్యోతకం చేయడానికి కుబుసం విడుస్తున్న కోడెత్రాచుతో ఉపమించారు. సి.నా.రె తరువాతి కథలో ప్రతినాయకుడి లాంటి నాయకుడు చేసిన ప్రహారాలకు తాచులా బుసకొట్టి పగతీర్చుకుంటుంది నాయిక. ఆ అంశాన్ని, ఆమె మనోలక్షణాన్ని చక్కగా ధ్వనింపజేశారు కవి. అటు బాణీ, ఇటువాణి సరిపాళ్లలో కుదిరిన ఈ పాట జనరంజకం కావడంలో ఆశ్చర్యం లేదు. సుశీల గొంతులో పాత్ర, పాత్ర నటనలో సుశీల మమేకమైనట్లుగా కనిపించి, వినిపించే పాట ఇది.

---

ఎన్.టి.రామారావు నిర్మించిన "శ్రీకృష్ణపాండవీయం" చిత్రంలో సి.నా.రె. రాక్షస స్త్రీ హిండింబ పాత్రకోసం **ఛాంగురే బంగారు రాజా** అని విలక్షణమైన పాట రాశారు. రాక్షసాంగన మానవాంగనగా మారిన సన్నివేశానికి రాసిన పాట ఇది. కనుక ఈ పాట అంతగా వాడుకలలో లేని మాటలతో, జానపదధోరణిలో, ఉసిగొలిపే వస్తువుతో రూపొందించారాయన. తెలుగుభాషలో సంస్కృతపదాలు జనవ్యవహారంలో కలిసిపోయినంతగా కొన్ని అచ్చతెలుగుమాటలు కలిసిపోలేదు. అలాంటి మాటలు అధికంగా ప్రయోగించి ఆపాటకు కొత్తదనం తీసుకువచ్చారాయన **'ఛాంగురే బంగారు రాజా', 'మజ్ఞా రే మగరేడా! మత్తైన వగకాడా! అయ్యారే నీకే మనసియ్యాలని ఉందిరా...'** ఈ పాటలో 'అమ్మకచెల్ల' అనే మరో ప్రయోగం ఉంది. ఇదీ ఆశ్చర్యార్థకమే, అచ్చతెనుగుమాటే. ఈ పదాన్ని చేమకూర వేంకటకవి 'విజయవిలాసం' కావ్యంలో యమకగమకంలో 'అమ్మకచెల్ల! నాదు మనసమ్మక చెల్లదు' అని ప్రయోగించారు. సి.నా.రెపై ప్రాచీన కావ్యవాసనలుండడం వల్ల ఇలాంటి పదాలన్నీ ఈ పాటలో తరుముకు వచ్చాయి. 'మగరేడు', 'వగకాడు', 'మొలకమీసం', 'సింగపునడుము', 'మెచ్చెకంటిచూపు', 'పచ్చల పిడిబాకు', 'విచ్చిన పువ్వురేకు', 'కైదండా' లాంటి పదాలన్నీ ఈపాటలోంచి చిక్కదనానికి బాగా తోడ్పడ్డాయి. 'మచ్చెకంటిచూపు, 'పచ్చల పిడిబాకు' అనడం పదునైన అభివ్యక్తి, కోడెవయసు లెస్స' లోని 'లెస్స' పాత తెలుగుపదమే అయినా 'దాని గుబాళింపు ఇంకా హైలెస్స' అనడం జాలరుల నుడికారాన్ని రంగరించిన ప్రయోగం. చిక్కని అచ్చ తెలుగుమాటలతో చెక్కిన ఈపాటకు టి.వి.రాజు స్వరరచన సైదోడుగా సాగింది. జిక్కి గొంతులోని గడుసుహొయాలు ఈ గీతానికి వాదోడు. ఆణిముత్యాల లాంటి అచ్చతెనుగు పదాల చిలకరింపులతో, తీయని తెలుగుతల్లి పలకరింపులతో, నూతనత్వం కలిగించే పులకరింపులతో ఎనలేని అనుభూతులను, అనుభవాలను రేపుతుంది. వాద్యానుసరణ, వరుస కొత్తదనపు కులుకులతో మెలికలు

తిరుగుతుంటాయి. గాయని గాత్రంలో వలపు కలిగించే వెచ్చదనం, కోరికలు రేపే కొంటెదనం, తనివి తీసుకువచ్చే తీయదనం మిళితమై తేనెవాగులా ప్రవహిస్తుంటాయి.

---

ఇతర నిర్మాతలకు తాను దర్శకత్వం వహించినప్పుడు విఠలాచార్య స్వరకల్పన గురించి, పదరచన గురించి అంతగా పట్టించుకునేవారు కాదు. తుదినిర్ణయం నిర్మాతలకే వదిలేసేవారు. "శ్రీవిఠల్ ప్రొడక్షన్స్' అనే తన సొంతకంపెనీలో తాను నిర్మించే చిత్రాలకు పాటలు రాయించుకునేటప్పుడు మాత్రం సంగీత, సాహిత్యాలపై ప్రత్యేకదృష్టి, శ్రద్ధ పెట్టేవారు. ఆసమయంలో ఆయన జానపదహృదయంలో కవితాగానపథం మెరుపుతీగెలా మెరిసేది. వస్తురీత్యా ఆయన చిత్రాల్లో ముదురువీరం, మొరటుహాస్యం కనిపించినా పాటల వరకూ వస్తే సుతిమెత్తని శృంగారాన్ని, శ్రుతి రమ్య సంగీతాన్ని ప్రేక్షక శ్రోతలకందించాలనుకునేవారు. అలా ఆయన అభిరుచి మేరకూ సిద్ధమైందే **పలుకవే నా రామచిలుకా** (అగ్గిబరాటా; 1966).

ఈ గీతం పాడుతున్న సమయం నిశీథం. స్థలం రాచమేడలోని అంతఃపురం. పాడుతున్నది నాయక విరహంలో కలలుగంటున్న కథానాయిక. నాయకుణ్ణి కలుసుకోలేనిస్థితిలో. మరునాడైనా కలుసుకోవాలనే ఉద్విగ్నపరిస్థితులో నాయిక చిలుకను సంబోధించి పాడుతుంది. తన ఆకాంక్షను వెళ్లబోసుకోడానికి పక్కన చెలికత్తెలెవరూ లేరు ఆ రాచిలుక తప్ప.

విఠలాచార్యకు ఈ సన్నివేశానికి "మల్లీశ్వరి" లో భానుమతి పాడుకున్న 'ఎందుకే నీకింత తొందర' పాటలా రాయించుకోవాలనిపించింది. వెంటనే సి. నారాయణరెడ్డిని పిలిపించి ఆ పాటలాగే రాయమన్నారు. ఈ చిత్ర సంగీతదర్శకులు 'విజయా' కృష్ణమూర్తి. లోగడ విజయావారి చిత్రాల్లో ఘంటసాలకు సహాయకుడిగా స్వరరచనలో పాల్గొనడంవల్ల ఆయనకు 'విజయా'కృష్ణమూర్తి అని పేరొచ్చింది. తరువాత రోజుల్లో టి.వి.రాజుకు సహాయకుడిగా ఉంటూ వచ్చిన కృష్ణమూర్తి కర్ణాటక హిందూస్తానీ రాగపరిజ్ఞానం క్షుణ్ణంగా ఉన్నవారు. ఆశుధారలో రాగకల్పన చేసే యం.యస్. విశ్వనాథన్ ధాటికి తట్టుకుని అంతవేగంగానూ 'స్వరలిపి' రాసుకునే గానలక్షణదక్షులు. సినారె "మల్లీశ్వరి" ఛాయలలోనే పాటరాస్తే, "మల్లీశ్వరి" పాట యమన్ కల్యాణి మధ్యమశ్రుతిలో రూపొందింది గనుక కృష్ణమూర్తి కూడా ఈ పాటను ఆ కల్యాణి రాగచ్ఛాయలలోనే స్వరపరిచారు.

విజయాకృష్ణమూర్తి రాగలక్షణం బాగా తెలిసినవారు కాబట్టి పల్లవిలోని మొదటి పంక్తిని మధ్యమశ్రుతి నుంచి కొంచెం పైకెగరేసి పాడించారు. ఏ మాత్రం పోలికల్లేని వినూత్న రీతిలో కవితాత్మను ఆవిష్కరించే రాగరామణీయం వెల్లివిరిసింది. ఈ

చిత్రంలో నాయికా (రాజశ్రీ) నాయకుల (ఎన్‌టిఆర్) మధ్య అప్పటికే అనురాగం పూలవంతెనగా నిలిచింది. పరస్పర పరిష్వంగం కోసం నాయికపడే తపన ఈపాటలో వెల్లడయ్యింది. ఆ రామచిలుకకూ, ఈ రాచ చెలువకూ సామ్యముంది. ఇద్దరూ బందీలే. ఉభయులకూ బంధవిమోచనం కావాలనే తహతహ ఉంది. ఆ చిలుకరెక్కలు కొట్టుకుంటూ ఉండే ఈ చెలువ కనురెప్పలు కొట్టుకుంటూ ఉంది. ఇటు బందీలుగా ఉండటం, అటు ఎగిసిపోవడం, ఆ పిదప ఆకాశం నీడలో కరిగిపోవడం ఆ చిలుక చెలికీ, ఈ రాకుమారికీ సమాన లక్షణాలే. ఈ భావాలన్నిటినీ 'ఎందుకే నీకింతతొందర' పాటలో 'ఈ రేయి తీరెనా' అనే పంక్తిని మూర్ఛనస్థితిలో కిందికి దింపి ఎంతో ఆర్ద్రంగా స్వరకల్పన చేశారు సంగీతదర్శకులు.

ఇక ఈ పాట పాడిన పి.సుశీల గాత్రసమ్మోహనానికి రెండు చేతులెత్తి నమస్కరించక తప్పదు. ఈ పాటలో ప్రతిపదం వీణ మీటినట్లే వినిపిస్తుంది. పంజరం, బంగారుమేడ, కంటిపాప, కలల దారి, గగనాలనీడ, పన్నీరుతొణకడం... ఇలా ప్రతిపలుకుతో తేనెలొలికే మాధుర్యం కనిపిస్తుంది. పాట వింటుంటే చిలుకస్వరమా? వీణారవమా? అనే సందేహం వస్తుంది. కల్యాణిరాగంలో ఇంత మాధుర్యం ఉందా? అని తన్మయులైపోతారు శ్రోతలు. ప్రశాంతమానసం నుండి ప్రణయ పరిధులు దాటే సమ్మోహన గాత్రవిన్యాసం సుశీలకు లభించిన వరమా? లేక కఠోరసాధనా? అని మనలో మనమే తర్కించుకోవాల్సి వస్తుందీ పాట వింటే! నవరసగీతాలకు ఆమె గాత్రం పుట్టినిల్లు.

కొన్ని యుగళగీతాల్లో ఆంగిక సాత్త్వికాభినయాలను ప్రవేశపెట్టినా, ప్రత్యేకించి శాస్త్రీయనృత్యగీత సన్నివేశాల్ని కల్పించిన సందర్భాలు కొన్నిచిత్రాల్లోనే ఉన్నాయి. అందులో ఒకటి "కంచుకోట" (1967) చిత్రంలో ఇద్దరు నర్తకీమణులపైన చిత్రీకరించిన నృత్యగీతం **సరిలేరు నీకెవ్వరూ**...నారాయణరెడ్డి రాసిన ఈ పాట అప్పట్లో పెద్దగా ప్రజాదరణ పొందలేదు గానీ తర్వాతర్వాత రేడియో ద్వారా శ్రోతలకు బాగా చేరువయ్యింది. ఒక మహారాజు, అతని సోదరుడు ఇరువురి సమక్షంలో వేర్వేరు ప్రదేశాలలో అభినయించే గీతమిది. ఇది కేవల వినోదార్థం కల్పించింది కాదు. ధర్మనిరతితో రాజ్యపాలనం చేసే ఆ మహారాజు వ్యక్తిత్వాన్ని, అతిరసికతతో శ్రుతిమించిన చేష్టలు చేసే ఆ రాజసోదరుని ప్రవృత్తిని ఆ గీతంలో చిత్రించాలి. అంచేత ఆ ఉభయపాత్రల శీలావిష్కరణ, ప్రేక్షకరంజనదృష్టిలో పెట్టుకుని ఆ నృత్యాగీతాన్ని రాశారు సి.నా.రె. **సరిలేరు నీ కెవ్వరు - నర పాల సుధాకర / సరి లేరు నీకెవ్వరు / సురవైభవాన - భాసురకీర్తిలోన'** ... అని రాజనర్తకి పాడితే, మరో నర్తకి **సరిలేరు నీకెవ్వరు - రతిరాజసుందరా/ సరిలేరు నీకెవ్వరు - రతిరాజ**

**సుందరా సరిలేరు నీకెవ్వరు / సిరిలోనగానీ – మగసిరిలోనగానీ...** అని పాడుతుంది. **'సరిలేరు నీ కెవ్వరు'** అనేది ఇద్దరికీ వర్తించింది. ఒకరు పరరాజ శిక్షకులూ ప్రజారక్షకులూ అయితే, మరొకరు మరులెత్తి, మధువెత్తి యవ్వనవీణలు కవ్వించినవారు. తరువాతి చరణాలు ఒకటి సంస్కృత పదగంభీతంగా సాగితే, మరొకటి తేటతేట తెలుగుమాటల్లో జాలువారింది. **రాజభోజ రవితేజ దానజిత – కల్పభూజ జోహార్| నీటు గుల్కి సుమకోటి తేనెలా నేటి తేటి జోహార్** ఈ రెండు పాదాలు ద్రుతగతిలో పరవళ్లు తొక్కుతాయి. ఆ నర్తకీద్వయం లాగే. అప్పటికి సినిమాపాటలలో కనీసం వేయిసారులు వినబడిన కల్యాణిరాగంలో ఉన్న కొంత కొత్తదనం, ఎంతో మెత్తదనం అందులో చూపెట్టగలిగిన మహాదేవన్‌ని మెచ్చుకోవాలి గదా! పక్కా శాస్త్రీయపద్ధతికి మరీ అంత దగ్గరగా లేకపోయినా సినిమాలలో ఇలాంటివి శాస్త్రీయగీతాలనే చెప్పుకోవచ్చు. వాద్యగోష్ఠి అంతా మృదంగతీర్మానాలతో రత్నఖచితమైన చలువ చప్పరములా లేనివెన్నెలను వెలయిస్తుందీచిత్రంలో. ఈ పాటలో సి.నా.రె. ప్రయోగించిన మొదటిపంక్తి తదనంతర కాలంలో పత్రికల్లో ఘనకార్యాలను చేసేవాళ్లను ఉద్దేశించి రాసేటప్పుడు శీర్షికగా మారడం గమనించదగ్గ అంశం.

చిక్కని కథ, చక్కని చిత్రీకరణ, మొక్కవోనినటన ముప్పేటలుగా అల్లుకున్న చిత్రాలు కొన్ని ఆర్థికంగా విజయవంతం కాని సందర్భాలున్నాయి. "పాలమనసులు" (1968) చిత్రం ఈ కోవలోనిదే. కాసులురాలే జానపదచిత్రాలను రాసులు పోసిన నిర్మాత యస్. భావనారాయణ మంచికథతో, సాంఘిక చిత్రం తీయాలనే మక్కువతో తీసినచిత్రమిది. అప్పటికే కన్నడంలో వెలువడి పదుగురి మెప్పులందుకున్న చిత్రానికి రీమేక్ ఇది. అయినా మనసులను చెమరింపజేసే కొన్ని కొత్తఅంశాల కలబోత.

ప్రకృతి పర్యంకంలో సొంత ఎస్టేట్‌లో స్థిరపడిపోయిన సంపన్న గృహస్థుని కూతురు ఈ కథలోని నాయిక. ఆ తండ్రి గుమ్మడి, ఆ కూతురు జమున, ఆ ప్రశాంత వాతావరణంలోకి ప్రవేశిస్తాడు హరనాథ్. కథానాయకుడిగా, నాయికానాయకుల ప్రణయ మధురిమ, అనూహ్యరీతిలో నాయకుడు చిందించిన చేదు – పర్యవసానం కథ విషాదాంతంగా ముగియడం. జమున అభినయ జీవితగ్రంథంలో చెరిగిపోని పసిడిపుట ఈ "పాలమనసులు" చిత్రంలో ఆమె ధరించిన 'ఇందిర' పాత్ర.

ఈ చిత్రంలో నాయికా ప్రవేశం పరమ పునీతపరిసరాల్లో, ప్రభాతకిరణాల్లో జరుగుతుంది. ఆ సమయంలో నాయిక పూలుకోస్తూ పాడుకున్న పాటను సి.నా.రె చాలా కవితాత్మకంగా రాశారు.

**ఉదయకిరణాలోన.. నా – హృదయాన కదలాడె నవరాగవీణ** అని పల్లవి, సాహిత్యపరంగా ఈ పాట గురించి నాలుగు మాటలు – అప్పటికి కథానాయిక

ప్రణయస్పర్శ ఎరుగనిముగ్ధ. అందుకే ఉదయకిరణాలలో నవరాగవీణ కదలాడిందన్నా రాయన. అది నవరాగమే కానీ అనురాగం కాదు. ఈ గీతంలోని 'నా' అనే పదాన్ని ప్రకృతిపరమైన తాదాత్మ్యానికి ప్రతినిధిగానే ప్రయోగించారు. అంటే తోటనూ, పూలనూ, వెలుగులనూ చూసినప్పుడు నాయికలో కలిగిన ప్రతిస్పందనమే ఈ పాటలోని ఇతివృత్తం. మొదటి చరణం **పసరాకులపై కురిసే వెలుగులు - కొస తీవెలపై విరిసే వెలుగులు / ఆలయశిఖరాల అంచుల మెరిసీ - నాలో పొంగారు బంగారు వెలుగులు** - ఆ కిరణాల వెలుగులు పొందిన పరిణామాన్నీ, చేసిన ప్రస్థానన్నీ పరమభావుకంగా చెప్పారు సి.నా.రె. కొస తీవెలమీద విరిసే వెలుగులంటే - ఆ వెలుగులే పూలై వికసించాయనే భావన. రెండోచరణంలో సంప్రదాయకంగా ఉన్న కమల భ్రమరానుబంధాన్ని ఉల్లేఖించారు. ఆ చరణం **జగమే కమలమై వికసించినది - మనసే భ్రమరమై రవళించినది / ఆ భగవానుని ఆరనికళలే - అణువూ అణువున పులకించినవి.. లోకమే కమలమై** వికసిస్తే హృదయమే తుమ్మెదలా రవళించింది. ఇది కేవల ప్రాకృతికవర్ణన. ఈ దశనుంచి మనల్ని పారమార్థికదశకు తీసుకువెళ్లారు సి.నా.రె. పుడమి అణువణువులో పులకించినవి దైవాంశాలే అని. నాయకలోని సౌందర్యాస్వాదనతో పాటు దైవారాధనను కూడా ఈ పంక్తుల్లో ధ్వనింపజేశారాయన. నాలుగు పంక్తులుగా పొదిగిన ఈ పాట చరణాల్లో మూడో పంక్తిలో అంత్యప్రాస లేకపోవడం ఉర్దూ రుబాయీ విధానం. యస్.జానకి కంఠంలో ఈ పాట కమ్మని ఒదుగులు పోయింది.

ఈ చిత్రంలోనిదే మరో పాట - కథానాయకుడు చేసిన వంచనకు గురైన కథానాయిక భగ్న హృదయావిష్కరణం. పగిలిన అద్దమే ఈ పాటకు పల్లవి. సన్నివేశం బరువుతో, నలిగిపోతున్న గుండెతో సి.నా.రె నుండి వచ్చిన పాట ఇది. ఆర్ద్ర స్వరంతో యస్.జానకి కన్నీటిని రంగరించి పాడారు. సత్యం స్వరరచన కూడా అంతే పరిపూర్ణంగా రూపొందింది. **పగిలిన అద్దంలో అగుపించిన దేమిటి / ముక్కలైన నీ వదనం - వేయి చెక్కలైన నీ హృదయం,** ఇక్కడ పగిలింది గాజు కాదు. ముఖం, గుండె. ఆ సీను పాలవంకసీను, ఆ నాయిక మనసు పాలమనసు. ఆమె వలపు పాలవలపు. ఆ అంశాన్నే మొదటిచరణంలో చెప్పారు సి.నా.రె. **మనిషికి మనసెందుకు ఉండాలి / మనసున వలపెందుకు నిండాలి / పాలవంటి వలపెందుకు తొణకాలి / పరమాత్ముని నిలదీసి అడగాలి....** మన పిచ్చిగానీ నిలదీసి అడగాలంటే అగుపడితే కదా ఆ పరమాత్ముడు, పగిలిన హృదయంనికి చివరిదిక్కు పరమాత్ముడే కదా! భగ్న హృదయం పొందిన తీవ్రవేదనను మొదటి చరణంలో చెబితే రెండో చరణంలో మనసుకు తగిలిన గాయం ఎన్నడూ మాసిపోయేది కాదని చెబుతూ సినారె ఈ క్రిందివిధంగా చెప్పారు.

**అరికాలికి నాటుకున్న ముల్లు - అవలీలగ తీసివేయగలవు**
**ఎదలోపల నాటుకున్న ముల్లు - ఏనాడూ తీసివేయలేవు'....**

ఆ ఉద్విగ్నచిత్తవృత్తి కథానాయకుడి ప్రణయచిహ్నాలు చెరిపివేయాలని సంకల్పించిన నాయిక ఇద్దరిపేర్లను ముద్దుగా చెక్కుకున్న చెట్టును నరికిపారేస్తుంది. పాలమనసు విరిగింది. జ్వాలగా మిగిలింది. అంతటితో కథ అంతం.

---

సి.నారాయణరెడ్డి రాయగా ఘంటసాల, పి.లీల, పి. సుశీల - మోహనరాగ మిశ్రమంలో మోహనంగా వినిపించిన పాట **నీ చరణ కమలాలు** (శ్రీకృష్ణావతారం, 1967) అన్నది. ఈ గీతంలో శ్రీకృష్ణ, రుక్మిణీ, సత్యభామల వ్యక్తిత్వచిత్రణ కన్పించడం విశేషం. రుక్మిణి మాటల్లో భక్తికే ప్రాధాన్యం. అందుకే బృందావనాలు తనకెందుకంటూ శ్రీకృష్ణుని రాసక్రీడలపై మెత్తని ఎత్తిపొడుపుంది. శ్రీకృష్ణుడు జగన్నాటక సూత్రధారి కదూ, అందుకే అంతకంటే సుతిమెత్తగా రక్తిని చొప్పిస్తూ 'చరణకమలాలు' అని ఆమె అంటే నయనకమలాల్లో తానుంటే చాలునంటాడు. పైగా బృందమాల స్థానంలో నందన వన ప్రస్తావన తెచ్చాడు. ఇది 'పారిజాతాపహరణ' వృత్తాంతాన్ని స్ఫురింపజేసే చమత్కృతి.

ఇదిలా ఉండగానే సత్యభామ రంగం మీద కొచ్చి 'సుమమోని చివురుపై మురళిగా మంచి పలికించమంది. స్వామి దక్షిణనాయకుడు కదా, మాటల గాలానికి చిక్కుతాడా? అందుకే, మోవికంటే, మురళి కంటే గొప్పగా మధురిమలొలికే రాగాలేమిటి? అనురాగాలే చిత్రిస్తానని సత్యభామను తనవశం చేసుకున్నాడు. ఒకరకంగా చెప్పాలంటే సత్రాజితి కోరుకున్నదీ అదే. అష్ట భార్యల్లో తన ఆధిక్యాన్ని ప్రాణేశ్వరుని నోట వినాలనే ఆమె ఆత్రుత. అందుకే **నీ హృదయ గగనాన నేనున్న చాలు** ఎందుకు బృందవనాలని ఆగరుధూపం వేశాడు శ్రీకృష్ణుడు.

**ఓ దేవి నీలోన నివసింతునే** అంటూ ఆమె స్థానం ఆమెకిచ్చేశాడు. పైగా లోలోన రవళిస్తానంటాడు. అలా 'లోలోన' అని ఎందుకన్నాడు? బయటపడితే భామవేటు తప్పదు కదా! శ్రీకృష్ణుడు సత్యాపతి అని ఎందరనుకున్నా మనసిచ్చి మనువాడిన నెచ్చెలి రుక్మిణి కదా. అందుకే ఆత్మసాక్షిని ఎలా కాదంటాడు.

పహాడ్ రాగ స్వరాలతో టి.వి.రాజు ఈ పాటతో ప్రణయజగత్తుకి ఊయలు వేసి ప్రేక్షక హృదయాల్ని మంత్రముగ్ధల్ని చేశాడు. ఘంటసాల గాత్రంలోని మృదుత్వం, పి.లీల గళంలోని సందర్భోచిత గాంభీర్యం, సుశీల స్వరంలోని ఆత్మస్థైర్యం ముప్పేటలా అల్లుకుని ఈ పాట ఇన్నేళ్లయినా మనల్ని ఆకర్షిస్తూనే ఉంది. ఇలా ఆకర్షించడానికి మరొక ముఖ్యకారణం. ఈ పాటలో రుక్మిణి - రుక్మిణి అనవలసిన మాటలే

అంటుంది; చూపవలసిన నటనే చూపుతుంది. అలాగే కృష్ణుడు . అలాగే సత్యభామ కూడా. త్రికరణశుద్ధిగా పాత్రౌచిత్యాన్ని పాటించిన పాట ఇది.

శ్రీకృష్ణుని అష్టమహిషుల్లో సత్యభామని విలక్షణమానిని, స్వాభిమానం ఆమె వ్యక్తిత్వానికి మూలధనం. దానికి ఏ మాత్రం క్షతి కలిగినా దండతాడిత భుజంగినిలా బుస్సుమంటుంది. కలహభోజనుడు, నారదుడు తెచ్చియిచ్చిన పారిజాతపుష్పాన్ని కృష్ణుడు రుక్మిణిసిగలో తురిమాడని తెలుసుకుని ఆవిడ పొందిన క్రోధ రూపం 'పారిజాతాపహరణం' కావ్యంలో నందితిమ్మన అచ్చొత్తినట్టు చూపించాడు. ఆ అలకలకొలికి తన ప్రాణేశ్వరుణ్ణి పాదతాడనంతో సత్కరించి. అంతలోనే భోరున అశ్రువృష్టి కురిపించి పారిజాతం వృక్షాన్నే నందనవనం నుంచి తెప్పించుకుని తన పెరట్లో నాటించుకుంటుంది. అప్పుడు గానీ తాను అందరికన్నామిన్న అనే ఆత్మాభిమానతర్పణం జరగలేదు. ఈ నేపథ్యంలో "శ్రీకృష్ణావతారం" చిత్రంలో సత్యాకృష్ణుల యుగళగీతం రాశారు సి.నా.రె. ఈ గీతంలో కూడా ఆ ఉభయుల మౌలిక మనోవృత్తులచిత్రణ ఉంది. శ్రీకృష్ణుడు అందమైనవాడు. అలాంటివాడు తన వాడయ్యాడు - ఇది సత్య స్వాతిశయం. ఈ స్వాతిశయాన్ని సాకీతో ప్రారంభించారు సి.నా.రె.

**మెరుగు చామనచాయమేని సొంపుల వాడు / నును మీగథల దేలు మనసున్న చెలికాడు / దొరవోలె నా మనసు దోచుకున్నాడే....** ఆ పైన పల్లవి ఇలా వెల్లివిరిసింది **– జగముల నేలే గోపాలుడే – నా – సిగలో పూవౌను ఈనాడే.**

'సాకీ'లో శ్రీకృష్ణుడు తనమనసును దోచుకున్న దొర అని, జగన్నాథుడే తనకు దాసుడని ప్రకటించడం సత్యభామ స్వాభిమానానికి నిదర్శనం. కృష్ణుడు నవనీతచోరుడు. 'వెన్నదొంగ' అనడం మామూలు. నీటిమీదతేలినట్లు మీగడల మీద తేలిపోయే మనసున్నవాడు అనడం ఔచిత్యభరితమైన చమత్కారోక్తి. కృష్ణుడు అప్పుడు ఇలా పల్లవిస్తాడు **– మగువల నేలే గోపాలుడే – నీ – మనసే దోచెను ఈనాడే...** అక్కడికక్కడే తిరిగినట్టనిపించినా ఈ పంక్తుల్లో నారాయణరెడ్డి లేఖిని గడుసుదనాన్ని మనం గమనించాలి. 'జగములనేలే గోపాలుడే' అని సత్య అంటే 'మగువల నేలే గోపాలుడే' అని కృష్ణుడంటాడు. అంతటివాడు ఆశ్చర్యకరంగా 'నా సిగ పువ్వవుతాడు' అని సాత్రాజితి గొప్పలు చెబితే, ఆ మాధవుడు మగువల నేలే గోపాలుణ్ణని తన దక్షిణనాయకత్వాన్ని ధ్వనింపజేస్తాడు. ఈ గీతంలోని మూడు చరణాలు అర్థవంతంగా పొదిగినా రెండోచరణం వారి అంతరికప్రవృత్తులకు మరింత చేరువగా ఉంది ఆ చరణం.

**భామా మానస పంజరమ్ములో రామచిలుకవై నిలిచేవా..** అని సత్యాదేవి ఆకాంక్ష- కాదు ఆంక్ష. "ఆ ఇంట, ఈ ఇంట ఉన్నా ఉండొచ్చు గానీ అంతరంగం దాకా వెళ్లకు"54 - ఇదీ ఆ మానిని ఆన. ఆ విశ్వమోహనుడు సామాన్యుడా? తాను ప్రణయానికే దాసుణ్ణని, పంజరమైనా తనకు పసిడిమేడే అని అనడమే కాదు, బాస కూడా చేస్తాడు. బాసలు చేయడంలో, ఆశలు చూపడంలో ఆ గోవిందుడు పారంగతుడు కదా! 'ప్రణయదాసుడు' అనగానే ఆ అమాయక సత్య తనప్రేమకు మాత్రమే దాసుడని భ్రాంతివలయంలో పడిపోతుంది. కళావతి రాగంలో టి.వి.రాజు ప్రతిశబ్ద రాగ తరంగితంగా ఈ పాటను స్వరపరిచారు.

ఇక్కడొక చిన్న ఉపాఖ్యానం. సత్యభామ పాత్రధారిణి కుమారి కాంచన గురించి, సత్యభామ అనగానే నా ఊహాపథాన కనిపించేది చెంపకు చేరదీసి కనులలో తామసం - తమీ రెండూ చూపగల ఎస్.వరలక్ష్మి, మాట మాటనా రాజసం పలికించగల జమున, అన్నిటా ఈమె సత్యేనపించగల భానుమతీలతో పోల్చి, అప్పటికి వయసూ, మనసూ కూడా పరిపక్వం పొందని, ప్రౌఢత్వం చెందని కాంచన కాదని, 'శ్రీకృష్ణావతారం' చూచిన తరువాత ఎవరూ అనలేదు. ఆ నడకలో, ఆ నవ్వులో, ఆ నడుము సన్ననలో, నల్లవానిలోనే నాణెమెంచగల ఆ నీలాల నయనాలలో - ఒకటేమిటి; అన్నిటింలో లేత సత్యభామను తలపుల నిలిపింది కాంచన.

'నవశక్తి ప్రొడక్షన్స్' వారి "నిండుసంసారం" (1968) చిత్రంలో సి.నా.రె టైటిల్స్ మీద కథానాయకునిపై చిత్రీకరించిన **ఎవరికీ తలవంచకు - ఎవరినీ యాచించకు / గుండె బలమే నీ ఆయుధం - నిండుమనసే నీధనం...** అనే పాటను రాశారు. నిజానికి టైటిల్సు నడుస్తూ ఉండగా పాట రాణించడం కష్టం. చిత్రంలోని కథాత్మను వివరించేపాట అయితే ముందు టైటిల్స్ మీద కొంతభాగం చిత్రీకరించి చిత్రం మధ్యలోగానీ, చివరలోగానీ ఆ పల్లవిని, కొన్ని పంక్తులను 'రిపీట్' చేస్తుంటారు. ఇది అలాంటిది కాదు. ఎన్.టి.ఆర్. కథానాయకుడు కాబట్టి ఆయన ధరించిన పాత్ర ఉదాత్తమైందని ప్రేక్షకుల హృదయాల్లో ముద్రపడడానికి ఈ పాటను రాశారు సి.నా.రె. మొదటినుంచీ వీలుచిక్కినప్పుడల్లా మంచినీ, మానవప్రగతినీ, మెత్తని అధిక్షేపాన్నీ, సినీగీతాల్లో ప్రవేశపెట్టాలనే కాంక్ష సి.నా.రె.ది అలాంటి అవకాశాలు దొరికినప్పుడు ఆయనలోని అభ్యుదయకవి రివ్వున ఎగిరొచ్చేవారు. ప్రతిమనిషి వ్యక్తిత్వం స్వతంత్రమైందిగా ఉండాలని పల్లవిలో ఇలా - **ఎవరికీ తల వంచకు... ఎవరినీ యాచించకు / గుండె బలమే నీ ఆయుధం - నిండు మనసే నీ ధనం...** ఈ పల్లవిలోని తలవంచని మనస్తత్వాన్ని మాస్టర్‌వేణు భావగర్భితంగా స్వరపరిచారు. ఎవరికీ... ఎవరినీ.. అనే పదాల్లోని చివరి అక్షరాలను పై స్థాయిలో సాగదీయడం ఈ బాణీ జనప్రియం కావడంలో తోడ్పడింది.

**చాలీచాలని జీతంతో - మిడి - మేలుపు కొలువులు కొలవకు / ముడుచుకు పోయిన ఆశలతో- మిడిమిడి బతుకును గడపకు / చీకటిరాజ్యం ఎంతోకాలం - చెలాయించదని మరవకు ....** మనిషి ఎదుగుతూ బతకాలి. సొంతకాళ్లమీద నిలవాలి. ఇప్పుడున్న ప్రతికూలపరస్థితి ఎప్పుడూ ఉంటుందనుకోవద్దు. మంచిరోజులొస్తాయనే ఆశావాదం ఈచరణంలో ధ్వనింపజేశారు సి.నా.రె. మరో చరణంలో మరీ అంతసూటిగా వెళ్లినా మనుగడకే ప్రమాదమని చిరుహెచ్చరిక చేశారాయన. జీవితాన్ని సరికొత్తగా ఉపమిస్తూ ఇలా సాగింది చరణం. **జీవితమే ఒక వైకుంఠపాళి- నిజం తెలుసుకో భాయీ / ఎగరేసే నిచ్చెనలేకాదు. పడదోసే పాములు ఉంటాయి / చిరునవ్వులతో విషవలయాలను ఛేదించి ముందుకు పదవోయి...**

వైకుంఠపాళి ఆట తెలిసినవాళ్లకు ఇందులోని నిచ్చెనలేమిటో, పాములేమిటో వివరించేనక్కరలేదు. లక్ష్యసాధన అంత సులభమైంది కాదని, నిచ్చెనలెక్కగానే సరిపోదని ఆ పక్కనే ఉన్న పాముల్ని గమనించాలని ఈ చరణంలో చెప్పారు. సి.నా.రె అయితే ఇందులోని కొసమెరుపు పాముల్ని చంపమనే బదులు 'విషవలయాలను ఛేదించి ముందుకు పదవోయి...' అనడంలో ఉంది. అయితే అందుకు చిరునవ్వు సరిపోతుందా? ఆ చిరునవ్వు కేవలం పెదవి అతికించుకున్నది కాదు. విషమ పరిస్థితులకు చెదిరిపోని గుండెబలానికి సి.నా.రె ప్రయోగించిన సంకేతమది.

నారాయణరెడ్డి పాటల్లో రచన చాలా పకడ్బందీగా ఉండడం ఒక విలక్షణమైన సొగసు. ఈ సొగసుకు నికషోపలం "మంచిమిత్రులు" (1969) చిత్రంలోని '**ఎన్నాళ్లో వేచిన ఉదయం యీనాడే ఎదురౌతుంటే....**' అనే పాట. ఈ చిత్రం 'పందయ" (1963) మన్న తమిళచిత్రం. అందులోనూ ఈ సన్నివేశంలో ఒక పాటుంది. వస్తువిదే అయినా దీనికున్న అంతస్సూ, పరిధీ, ఆకర్షణా దానికిలేవు. కోదండపాణి వరస. ఘంటసాల, బాలసుబ్రహ్మణ్యం కలిసిపాడిన అతికొద్దిపాటల్లో ఒకటి. అన్ని విధాలా 'ప్రతీరాత్రీ వసంతరాత్రి' (ఏకవీర, దేవులపల్లి, 1969) కి ధీటైంది.

ఎవరికి వారే తాము అవలంబిస్తున్న పంథా సరైందని గాఢంగా నమ్మినవారు కాబట్టి అంత ఉత్కంఠ దొంతరలెత్తుతోంది. వారి మనఃప్రవృత్తులకు అనుగుణంగా కోదండపాణి (ఈ చిత్ర సంగీతదర్శకుడు) స్వరస్థాయిల్లో కొన్ని ఒడుపులు పాటించారు. 'ఎన్నాళ్లో' అన్న పదాన్ని లాగిపైకి విసరడం, 'ఇంకా' అనే మాటను సాగదీయడం భావాభివ్యక్తికి దోహదంచేసే అంశాలు.

చరణాల్లో నిర్దిష్టంగా ఆ ఉభయుల అభిప్రాయాలను సి.నా.రె ఇలా పొందుపరిచారు. శోభన్‌బాబు. **మంచిని పెంచిన మనిషిని - ఏ వంచన ఏమి**

**చేయదని / నీతికి నిలబడువానికి - ఏ - నాటికి ఓటమి లేదని / నే చదివిన జీవితపాఠం - నీకే నేర్పాలని వస్తే ॥ఇంకా॥**

నిజాయితీ ఉన్న పోలీసు అధికారిగా ఆ కథానాయకుడు ఎప్పటికైనా మంచికి, నీతికి విజయమని విశ్వసిస్తాడు. పోలీసు అధికారిగా తానునేర్చుకున్న ఆ జీవితపాఠాన్ని తనమిత్రుడితో చెప్పాలని ఉబలాటపడుతున్నాడు. మరి మరో కథానాయకుడు ఝూటాలోకం, కేటువ్యవస్థ మాటలతో దారికి రావని, దెబ్బకు దెబ్బే తగిన గుణపాఠమని గాఢంగా విశ్వసిస్తాడు. అతని ఆశయాన్ని సి.నా.రె. ఈ చరణంలో చెప్పారు.

**నాగులు తిరిగే కోనలో - ఏ - న్యాయం పనికిరాదని / కత్తిని విసిరే వానిని - ఆ - కత్తితోనె గెలవాలని / నేనెరిగిన చేదునిజం - నీతో చెప్పాలని వస్తే / ఇంకా తెలవారదేమి...** ఆ 'కోన' మనచుట్టూ ఉన్న సమాజం. ఆ కత్తి విసిరేవాడు దౌర్జన్యాలకు మరిగిన దోపిడీదారు. ఆ చేదునిజం ఆ కథానాయకుడు విధిలేక మింగింది. అది తన మిత్రుడితో చెప్పాలని ఆత్రపడుతున్నాడతడు.

ఇది సినీధోరణిలో రాసినగీతం కాదు. ఒక ప్రగతిశీలకవిగా సి.నా.రె. గేయరచన ఇంచుమించు ఇలాగే ఉండేది. కాకుంటే కవిత్వంపాలు మరికొంత సాంద్రంగా ఉంటుంది.

---

గత శతాబ్దిని అనుసమాన సాహిత్యసృష్టితో సుసంపన్నం చేసిన కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ, ఆయన రాసిన నవలల్లో విషయవిస్తృతికి 'వేయిపడగలు' పతాకగా ఉంటే, హృదయావిష్కృతికి 'ఏకవీర' ప్రతీక.

వాస్తవిక జీవితానికి ప్రతిరూపంగా విధి నిర్మించిన విచిత్ర మంటపం సజీవశిల్పం 'ఏకవీర' కథ. ఆ మంటపానికి నాలుగుస్తంభాలు - అందమైనశిల్పాలు, కథలో విశిష్టమైన పాత్రలు - కుట్టాన్ సేతుపతి, వీరభూపతి, ఏకవీర, మీనాక్షి. ఈ నలుగురి కరుణరసపూరితమైన కమనీయగాథ 'ఏకవీర' మరువరానిసత్యాలు నిండి ఉన్న మరపురానికథ ఇది. నిర్దయలో దయ, కఠోర సంఘటనలలో కారుణ్యం ఎలా సాధించుకోవాలో, జీవితం దగ్ధమైనా జీవితపువిలువను ఎలా శాశ్వతంగా నిలపాలో వివరించేకథ 'ఏకవీర'.

దాంపత్య జీవితాన్ని ఎలా అర్థం చేసుకోవాలో, కాంక్షకూ - కర్తవ్యానికీ జరిగే అనునిత్యసంఘర్షణలో మానవులెలా ప్రవర్తించాలో - మానవతను ఎలా కాపాడుకోవాలో; కన్నీటిలో కార్చిచ్చు కాక - కమ్మదనాన్ని ఎలా పండించుకోవాలో; భగ్నజీవులు ఎలా ధన్యజీవులు కావాలో సూత్రప్రాయగా చెప్పే ప్రణయోపనిషత్తు 'ఏకవీర'.

ఈ చిత్రంలో సి.నా.రె. రాసిన చాలా గొప్పపాట **నీపేరు తలచినాచాలు** అనేది. ప్రథమవీక్షణంలోనే తన హృదయాన్ని లోగొన్న వీరభూపతి మూర్తిని తనలో పదిలపరచుకున్న ఏకవీర (కె.ఆర్.విజయ) కోవెలలో శ్రీకృష్ణవిగ్రహం ముందు మధురభక్తి భరితగీతం పాడుతుంది. కృష్ణారాధనలో మేను మరిచిన గోపిక పాడుకునే పద్ధతిలో రచించిన పాట ఇది.

**నీ పేరు తలచినా చాలు మదిలో పొంగు శతకోటి యమునాతరంగాలు**

పల్లవిలోనే గోపికామధురభక్తికి నిత్యసాక్షిగా ఉన్న యమునను ప్రవేశపెట్టారు సి.నా.రె. చరణంలో వేణుగాన శ్రవణంలో కలిగే అనిర్వచనీయ తన్మయత్వాన్ని ఇలా వ్యక్తీకరించారాయన.

**ఏమి మురళి అది ఏమి రవళిరా / పాట వినగ ప్రాణాలు కదలురా**

**మురళీధర! నీ స్వర లహరులలో /మరణమైనా మధురమురా..** ఈ పారవశ్యంలో మరణమైనా మధురమని అనడం భావతీవ్రతకు పరాకాష్ఠ. తరువాత చరణంలో ప్రణయభావమార్దవాన్ని ఇలా సంతరించారాయన.

వెదురు పొదలలో తిరిగి తిరిగి నీ / పదపల్లవములు కందిపోయెనో...

ఎదపానుపుపై పవళించరా - నా / పొదిగన కౌగిట పులకించరా...

ఇలా లయతాళాత్మకంగా కదలాడిన గీతం, రమణీయ సమాసాలను తాళరహితంగా ఆలపించడంతో ఒక కమ్మని మలుపు తిరుగుతుంది..

గోపాలా! నందబాలా! / నవమంజుల మురళీలోలా

మృదుసమీరకంపిత మనోజ్ఞకుంతల / తమాల పల్లవ జాలా!"

పిల్లగాలిచేత చలించిన కురులు అనే చీకటి కానుగచెట్టు చిగుళ్ళుకలవాడు కృష్ణుడని సంస్కృతసమాస నిర్భరంగా సంబోధించడం సి.నా.రె. పదఘటనప్రౌఢికి నిదర్శనం. ఇందులోని పదాలు బరువుగా ఉన్నా ఆ రాగధారవల్ల నురగల్లా తేలిపోతాయి. ఆ తరువాత కలిగిన ఉద్వేగంలో ద్రుతగతిలో ఇలా పాడుతుంది నాయిక -

**ఏమి పిలుపు అది ఏమి పిలుపు / బృందా నికుంజముల పూలు పూచి**

**శరదిందు చంద్రికల కేలుసాచి / తరుణాంత రంగమున దాగిదాగి**

**చెలి అందెలందు చెలరేగిరేగి / తొందరించెరా తొలకరించెరా**

**వలపు జల్లుగా పలకరించెరా ....**" ఇలా లయాత్మకంగా, అతి వేగంగా నాయిక పాడుతూ ఉంటే, ఆ దాపుననే దాగి ఉన్న నాయకుడు పై శ్రుతిలో నాయిక పదాలకు సహచరంగా ఉండేట్టుగా రాగాన్ని ఆలపిస్తాడు. కొన్నిపంక్తుల్ని భిన్నస్థాయిలో తానూగానం చేస్తాడు. సంగీతపరంగా ఈ చరణం ఒక ప్రయోగమే.

ఆర్థికంగా విజయం సాధించలేకపోయినా ఉత్తమచిత్రంగా గుర్తుండిపోయింది 'ఏకవీర"

ఇలా నారాయణరెడ్డి పాటలలో ఎన్నని తడమను.. 'కులగోత్రాలు' గుర్తుకు రాలేదా?, "చదువుకున్న అమ్మాయిలు" అక్కర్లేదా? "ఆత్మగౌరవం" పట్టించుకోవా? "తాత-మనవడు" మరచిపోయావా? "అక్బరుసలీంఅనార్కలి", "గోపాలుడు - భూపాలుడు", "మానవుడు-దానవుడు" "తల్లా-పెళ్లమా", "మూగనోము", "సప్తస్వరాలు" .... ఇలా ఎన్ని సినిమాలు నారాయణరెడ్డి పాటల బొక్కసం లోంచి నన్ను వెక్కిరిస్తున్నాయి. ఆయన పేరు వింటేనే మదిలో శతకోటి పాటల యమునా తరంగాలు ఉప్పొంగుతాయి. ఒకటా? రెండా? పదులా? వందలా? కొన్నివేల పాటలు సి.నా.రె మనకందించిన వెల్లిన అమృతఫలాలు.

# సినారె కృష్ణాజిల్లాతో అనుబంధం

# చిత్రమాలిక



కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహించిన
మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలలో
సినారెను అభినందిస్తున్న నాటి గవర్నర్ శ్రీ ఎన్‌డి తివారీ,
డా॥ మండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీమతి పురందేశ్వరి



సద్గురు శివానంద మూర్తిగారితో
సినారె



మొదటి ప్రపంచ తెలుగు
మహాసభలలో సినారెను
అభినందిస్తున్న
నాటి ముఖ్యమంత్రి
శ్రీ జలగం వెంగళరావు,
విద్యామంత్రి
శ్రీ మండలి వెంకట
కృష్ణారావు



సుప్రీంకోర్టు న్యాయమూర్తి జస్టిస్ జాస్తి చలమేశ్వర్ గారితో సినారె



కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహించిన మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలలో శ్రీమతి పురందేశ్వరి , నాటి గవర్నర్ శ్రీ ఎన్‌డి తివారీ, డా॥ మండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, సినారె, డా॥ రాళ్లబండి కవితాప్రసాద్, డా॥ జి.వి. పూర్ణచందు



కృష్ణాజిల్లా శ్రీకాకుళం ఆంధ్ర మహావిష్ణు ఆలయ ప్రాంగణంలో శ్రీకృష్ణదేవరాయ విగ్రహాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీ కె. రోశయ్య, సినారె, సద్గురు శివానంద మూర్తి, డా॥ మండలి బుద్ధ ప్రసాద్, కృష్ణదేవరాయ వంశ వారసుడు శ్రీ అచ్యుత దేవరాయలు



డా॥ మండలి బుద్ధప్రసాద్ ఇంట జరిగిన
ఒక కార్యక్రమంలో ఆశీస్సులు అందిస్తున్న సినారె, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్





దివిసీమ ఉప్పెన విధ్వంసాన్ని సందర్శించిన సినారె







శ్రీ మండలి వెంకటకృష్ణారావు అభినందన సభకు అధ్యక్షత వహించిన సినారె




కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ "తెలుగు వ్యాసమండలి" గ్రంథావిష్కరణ చేస్తున్న నాటి ముఖ్యమంత్రి శ్రీ కిరణ్ కుమార్ రెడ్డి, డా. సినారె, శ్రీ దాసరి నారాయణరావు, శ్రీ మండలి బుద్ధప్రసాద్, డా. రాళ్లబండి కవితాప్రసాద్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. జి వి పూర్ణచందు, డా. సామల రమేష్ బాబు ప్రభృతులు.



కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన 2వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలను ప్రారంభించి, పరిశోధనా గ్రంథం "తెలుగుపున్నమి" ఆవిష్కరిస్తున్న సినారె, శ్రీ రామోజీరావు, శ్రీ మండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీ ఐ. రామకుమార్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. జి వి పూర్ణచందు

